# చతుర

సంపుటి : 2 సంచిక : 10

నవంబర్ - 1979

## ఈ నెల సమగ్ర నవల

సినీమాయామేయ జగత్తులో హీరోయిన్‌గా మకుటం ఉన్న మహారాణి ఆమె. ఆ రంగంలోని వారంతా ఆవిడ కరుణాకటాక్షాల కోసం పడిగాపులు పడవలసిన వారే. ప్రేక్షకులకేమో ఆవిడ మహానటి, ఆరాధ్య దేవత.

అలాంటి ఆమె అకస్మాత్‌గా తారాపథం నుండి ఎలా రాలిపోయింది? ఎక్స్‌ట్రా వేషాలకు సైతం అంగీకరించ వలసిన దుస్థితికి ఎలా జారిపోయింది?

# దివి నుండి భువికి

పతనమైన ఒక ఉజ్వల తార చరిత్రనూ, ఆమెనా స్థితికి తెచ్చిన సినీరంగ వాతావరణపు వైరుధ్యాలనూ చిత్రిస్తూ ప్రసిద్ధ తమిళ రచయిత...

## అరంధై నారాయణన్

రచించిన నవలకు జి.సి. జీవి అనువాదం 'దివి నుండి భువికి' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

## ఈ నెల ముఖపత్రం

ఒంటెలకూ, ఎడారులకు ప్రసిద్ధిగాంచిన రాజస్థాన్‌లోని గ్రామీణ సుందరి.

ఫొటో : సూరజ్ ఎన్. శర్మ, జైపూర్.

## రెండవ కవరు

కర్ణాటకలోని సోమనాథపూర్ ఆలయశిల్పం. ఆదిశేషువుచే పరివేష్టితుడైన శ్రీ మహావిష్ణువు.

ఫొటో : టి. సూర్యనారాయణ, న్యూఢిల్లీ.

## మూడవ కవరు

తెలుగు కళాకారుల ప్రతిభకు అపూర్వ తార్కాణంగా నిలిచిన 'హంపి'లోని అసంఖ్యాక శిలా శిల్పాలలో ఒకటి. అశ్వారూఢుడైన యోధుని రూప శిల్పం.

ఫొటో : గీతాదత్తా, సికిందరాబాద్.

చతుర

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ,

హైదరాబాద్–500 004



## మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణిహారం
## మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించీ సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'
- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'
- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో, ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

# సితార

సమగ్ర సినీ వారపత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

# అన్నదాత

వ్యవసాయదారుల
సచిత్ర మాస పత్రిక

* పచ్చని పైరు విప్లవానికి...
* పాడి పరిశ్రమాభివృద్ధికి...
* గ్రామసీమల సౌభాగ్యానికి...

మార్గదర్శి

సాలు చందా రూ 18లు మాత్రమే
పోస్టేజి ఉచితం!
విడి ప్రతి రూ 1-50లు

వివరాలకు:-
మేనేజరు, అన్నదాత ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాదు-500 004
ఫోన్: 223422

# విపుల ప్రపంచ పర్యటన.!

ఈ విపుల విశ్వంలోని వివిధ ప్రాంతాల, జాతుల, భాషల ప్రజలను అందర్నీ కలుసుకోవటం, అందరికీ సాధ్యం కాదు... నిజమే...కాని, 'విపుల' మీ చేతుల్లో ఉందంటే దాని అర్థం ఆ ప్రపంచమంతా మీ ముందు ఉందనే...వారందరూ మీతో ఆత్మీయంగా సంభాషిస్తున్నారనే. ఏ జాతినయినా మీకు సన్నిహితం చేయగలిగేది వారి సాహిత్యమే. వారి జీవన విధులను మీకు కథా సారథమే.

వివిధ భాషల ఉత్తమ కథలను తేట తెలుగులో అందరికీ అందుబాటులోకి తేవటం 'విపుల' లక్ష్యం. మీరెన్నడూ విని ఉండని ప్రాంతాల వారి, భాషలవారి కథలు సైతం సేకరించి అందజేస్తోంది విపుల.

ఇప్పటికే దాదాపు 40 విభిన్న భాషలకు చెందిన దాదాపు 300 కథలను తెలుగులో అందించింది 'విపుల'.

కథలుగాక అదనంగా విచిత్ర విశ్వ విజ్ఞానం, కార్టూన్లు, జోకులు, ప్రతి కథకూ రెండు రంగుల్లో చిత్రాలు 'విపుల' ప్రత్యేకతలు...ఇవన్నీ కూడా కంటికి ఇంపైన రంగుల ఆఫ్ సెట్ ముద్రణలోనే.

విశ్వ కథా విపంచి

## విపుల



Marketed By
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

132 పేజీలు 125 పైసలే.

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

## చతుర

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# సర్వర్ సాహసం

రష్యన్ నాయకుడు మికోయాన్ ఇటీవల చనిపోయిన వార్త విని ఢిల్లీ అశోకా హోటల్లో పనిచేస్తున్న ఒక బేరరుకి గతస్మృతులు జ్ఞాపకం వచ్చాయి.

గతంలో ఢిల్లీ వచ్చినపుడాయన అశోకా హోటల్లోనే బస చేశాడు. మికోయాన్ ఒక రోజున కార్యక్రమం ప్రకారం ఉదయాన్నే రాజ్ ఘాట్ లో మహాత్ముని సమాధి వద్ద శ్రద్ధాంజలి ఘటించాలి. మికోయాన్ గారికి గడ్డం గీయందే దినచర్య



మొదలవదు. కానీ ఆ హోటల్ మంగలిగారు ఉదయం తొమ్మిదిగంటలకు గాని డ్యూటీకి రాడు. ఏం తోచని ఆఫీసర్లు మంగలి కోసం ఇతరత్రా వెదకడం ప్రారంభించారు.

అయితే ఈ హడావిడి చూసిన ఆ హోటల్లోని ఓ సర్వరు 'ఓస్ ఇంతేనా నేన్జేస్తాను గడ్డం' అంటూ ముందుకి వచ్చాడు. అతను ఈ హోటల్లో చేరకముందు ఢిల్లీలోని ఓ పెద్ద క్షౌరశాలలో పని చేసినవాడే. అంతలో ఇంకో సమస్య వచ్చి పడింది. మికోయాన్‌గారు క్షవరం చేయించుకునేటప్పుడు వేసుకోడానికి తెల్లటి ఓవర్ కోటు కావాలి. ఎలా?

వెంటనే ఆ దగ్గర్లో ఉన్న క్లినిక్‌లోని ఓ డాక్టర్‌ని బతిమాలి ఆయనగారి యూనిఫారం కోటుతెచ్చి ఆ గండం కూడా గట్టెక్కించారు.

అశోకా హోటల్ మంగలిగారు తనకు గడ్డం చేసిన విధానం, సున్నితత్వం మికోయాన్ గారికి మహా నచ్చింది.

ఢిల్లీలో ఉన్నంతకాలం నా గడ్డం నువ్వే చేయాలని కూడా అడిగారు. ఈ రోజుకు మాత్రమే నేను, రేపట్నించీ మరో మంగలి వస్తాడని సర్వరు చెప్పినపుడు మికోయాన్‌గారు అర్థంకాక ఊరుకున్నారు.

అయితే ఆ సాయంత్రం భోజనాల సమయంలో పొద్దుట తన గడ్డం గీసిన మంగలే వడ్డన చేస్తుండటం చూసి మికోయాన్‌గారు నిర్ఘాంతపోయి 'అశోకా హోటల్లోని సర్వర్లు అన్ని పనుల్లోనూ నిపుణులే' అని ఓ సర్టిఫికేటు కూడా ఇచ్చారు.

# లాభయాత్ర

మాల్దీవులనుంచి వచ్చే విమానం కేరళ రాజధాని త్రివేంద్రం విమానాశ్రయంలో దిగగానే బడా బడా సేట్లు విమానం నుంచి దిగిన యువకుల్ని ఆనందంగా ఆహ్వానించి తీసుకుపోతుండటం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. మాల్దీవులు వ్యాపార కేంద్రంకాదు సరిగదా అక్కడ ఎండు చేపలు తప్ప మరేమీ దొరకవు. ఎండు చేపలైనా కేరళ కోస్తాలోనూ, త్రివేంద్రంలోనూ కావలసినన్ని దొరుకుతాయి.

అయినా మాల్దీవులకి జనం విరగబడి వెళ్తున్నారు. వారానికి రెండు సార్లు నడుస్తున్న విమానాల్లో టిక్కెట్లే దొరకడం లేదు.

అయితే ఈ ప్రయాణికుల రద్దీని తట్టుకోవడానికి ఎయిర్ ఇండియా విమాన సంస్థ వారు బోయింగ్ విమానాలు నడపడానికి ప్రయత్నించారు. కాని మాల్దీవుల ముఖ్య పట్టణమైన 'మేల్'లో భారీ విమానాలు దిగేందుకు సరైన రన్‌వేలు లేకపోవడం వల్ల ఆ ఉద్దేశం మానుకుని 42 సీట్లుండే ఆవ్రో విమానాలు నడపడం తప్ప గత్యంతరం లేకపోయింది. మాల్దీవులకి టిక్కెట్లు దొరకడం బ్రహ్మ ప్రళయమే. దీనికంతకూ కారణం 'మేల్' కస్టమ్స్ నిబంధనల్లేని ఓడరేవు.

అక్కడ విదేశీ వస్తువులు విపరీతంగా దొరుకుతాయన్నమాట. విదేశీ వస్తువులకి మన దేశంలో గొప్పడిమాండు ఉండటం మూలంగా అక్కణ్ణించి తెచ్చిన వస్తువులు రెట్టింపు ధరకి అమ్ముకోవచ్చు.

కాని కేరళలోని పాస్‌పోర్టు ఉన్న నిరుద్యోగ యువకుల్ని ఉపయోగించుకుని బొంబాయి సేట్లు తమ వ్యాపారాన్ని జోరుగా సాగిస్తున్నారు. ఈ పనికి ఉపయోగపడే వాళ్ళని 'కెరీర్లు' అంటారు. ఈ కెరీర్లకి రానుపోను చార్జీలిచ్చి పైన కొంత ఈనాము కూడా ఇస్తారు సేట్‌లు. మాల్దీవులకి రానుపోను చార్జీ 850 రూపాయలు మాత్రమే.

ఆవిధంగా చట్టప్రకారం ఒక్కో మనిషి 4,000రూపాయల వరకూ విలువ




గల సరకు తెచ్చుకోవచ్చు. అవి మన దేశంలో కనీసం 8 వేలకు అమ్ముడవుతాయి మరి!

# అదృష్టదేవత

మన సైన్యంలో మేజర్ హోదాగల వారిని అదృష్టదేవత వరించిందను కోవచ్చు. 1962, 1965, 1971 సంవత్సరాల్లో జరిగిన సరిహద్దు యుద్ధాల కాలంలో కొత్తగా మిలిటరీ ఆఫీసర్లని అధిక సంఖ్యలో నియమించటం జరిగింది. వీరికి ప్రమోషన్లు మేజర్ హోదా వరకూ వచ్చి ఆగిపోతున్నాయి. కారణం ఆపై మెట్టయిన లెఫ్టినెంట్ కల్నల్ పోస్టుల్లో ఖాళీలు తక్కువగా ఉండటమే!



దీనికి ప్రత్యామ్నాయంగా ఇటీవల లెఫ్టినెంట్ కల్నల్స్ ఖాళీలు పెంచడం, మేజర్లు స్వచ్ఛందంగా పదవీ విరమణ చేసే పక్షంలో ఏక మొత్తంగా ఒక లక్ష రూపాయలిచ్చి సాగనంపటం.

ఈ పద్ధతి వచ్చాక రిటైరవుదామను కుంటున్న మేజర్ల సంఖ్య విపరీతం కావటంచేత కోట్లాది రూపాయలు ఒక్కసారిగా ఖర్చు చేయాల్సిన పరిస్థితి ఎదురయింది. అందుకని ఈ పథకాన్ని అంచెలు అంచెలుగా జరపాలనుకుంటున్నారు.

అయితే ఇలా చేయడంవల్ల సైన్యంలో ఉన్నతోద్యోగుల సంఖ్య తగ్గుతుందేమోనన్న కొత్త భయం పట్టుకుంది. ఈ కొరత తీర్చడానికి కొత్తగా ఆఫీసర్లని రిక్రూట్ చేసుకుంటారు. ఇప్పుడు చేర్చు కోబడిన కొత్త ఆఫీసర్లు 18 ఏళ్ళలోగా, లెఫ్టినెంట్ కల్నల్స్ అవడమేగాక ఆ తరువాత కూడ ప్రమోషన్ అవకాశాలు కూడా వీరికి హెచ్చుగానే ఉండవచ్చు.

# మాయప్రచారం

**2,500** అడుగుల ఎత్తున ఎగిరే విమానం నుండి దూకి హాయిగా గాలిలో తేలుతానని పార్ గోల్డ్విన్ అనే పెద్దమనిషి ప్రచారం చేసుకొని అందుకు సర్వసన్నాహాలూ చేసుకున్నాడు. మృత్యువుని కౌగిలించు కునే ఈ వ్యక్తి యొక్క ముఖార విందమూ, ఆయనగారి సాహసకార్యమూ కళ్ళారా చూద్దామని సుమారు వెయ్యి మంది ప్రేక్షకులు ఇప్స్విచ్ విమానాశ్రయం వద్ద గుమికూడారు. కానీ, ఎంతో మంచి పేరూ, బుద్ధిమంతులైన సభ్యులూ గల మా క్లబ్‌లో ఇలాంటి పిచ్చి వేషాలు పనికిరావని ఈస్ట్‌కోస్ట్ పేరాచూట్ క్లబ్ మేనేజర్ గారయిన రాబర్ట్ పాస్కో అడ్డు తగలటంతో సదరు సాహస కార్యక్రమం వాయిదా పడింది.



"ఇక్కడ కాకపోతే మరో చోట నా విద్యని ప్రదర్శిస్తాను. అంతేగాని నేనేం వెనుకంజవేస్తా ననుకుంటున్నా రేమో"నని గోల్డ్విన్ బుకాయించబోయేసరికి పోలీసుల్ని పిలిచి అతన్ని బయటికి గెంటించాల్సి వచ్చిందట కూడా. ఈ సాహసాన్ని ఆసక్తితో చూడ్డానికి వచ్చిన వేలాది ప్రజలు, ఈ కార్యక్రమం వాయిదా పడటం ఇది రెండోసారి కావటంతో డబుల్ నిరాశతో ఇళ్ళకు మళ్లారు. అంతకు ముందు విపరీతమైన గాలి వీస్తోందన్న కారణంతో ఈ కార్యక్రమం ఓసారి వాయిదాపడిందట!

# జీవ సమాధి

గబ్బిలాలు, పీతలు, తేళ్ళు, సాలీళ్ళు, పాములు, కప్పలు, తాబేళ్ళు మొదలైనవన్నీ శీతాకాలం గడిచే వరకూ జీవసమాధి నుంచి బయటకు రావు.

వాటి శరీరంలోని కొవ్వు పదార్థం కరిగి ఆ సమయంలో ఆహారంగా ఉపయోగపడుతుంది.

జీవ సమాధి పొందిన కొన్ని జంతువుల అలవాట్లు విచిత్రంగా ఉంటాయి. ఎలుగు బంట్లు ఆ సమయంలో నాలుగైదు నిమిషాలకో సారి మాత్రమే శ్వాస తీసుకుంటాయి.

ఆఫ్రికాలోని బారు చేప మట్టిలో 17-18అంగుళాల గొయ్యి తవ్వుకుని అందులో నిద్రిస్తుంది. ఆ సమయంలో అది బతికి ఉందా,చచ్చిందా అంటే చెప్పడం కష్టమే! ఉడ్ చక్ అనే ఉడుతకి సంవత్సరంలో ఆర్నెల్లు నిద్రలోనే గడుస్తాయి. అది నిద్రించేటప్పుడు చెవి పక్కన ఎంత పెద్ద హోరు చేసినా సరే మేలుకోదు. అమెరికా



లోని ఒకరకం చిట్టెలుక శరీరం నిద్రించేప్పుడు కర్రలా బిగుసుకు పోతుంది.

అదలా ఉండగా చచ్చిపోయిందనుకున్న ఓ నత్తని బ్రిటిష్ మ్యూజియంలో ప్రదర్శిస్తున్నారు. నాలుగేళ్ళు గడచిన తరువాత దానిలోనుంచి ఏదో ద్రవ పదార్థం ఊరుతుండడం గమనించి పరిశీలిస్తే ఏముంది? ఇన్నాళ్ళుగా అది దీర్ఘ నిద్రలో ఉందని, చనిపోలేదని వెల్లడయింది.

# ప్రేమ పావురాలు

పూర్వం ప్రేమికులకు పావురాలు బాగా ఉపయోగపడేవి. ఇప్పుడున్న టెలిగ్రాఫ్ సంకేతాల కన్నా అవే ఎంతో సౌకర్యంగా ఉండేవనిపిస్తుంది. మొగల్ చక్రవర్తుల కాలంలో పావురాలతో సంకేతాలు పంపడం ఉన్నత స్థాయిలో అభివృద్ధి చెందింది. పావురాలు సహాయం చెయ్యకపోతే జహంగీరు నూర్జహాన్ హృదయం తెలుసుకునేవాడు కాదేమో! రెండవ ప్రపంచ యుద్ధకాలంలో వార్తాహరులుగా పత్రికా ప్రతినిధులకు సహకరించింది పావురాలే.



క్రీ.పూ. 43వ శతాబ్దం నాటికే ఈ పద్ధతి అమలులో ఉన్నట్టుగా దాఖలాలున్నాయి. పావురాలందించిన సమాచారం ఆధారంగా, మార్క్ ఏంటనీ బ్రూటస్‌ని హత్యచేయడం జరిగింది.

పావురాలు నియమించిన మార్గంలో ముక్కుసూటిగా ప్రయాణించడం నిజంగా ఆశ్చర్యమే.

పావురాలకి పంచేంద్రియాలే కాక ఏదో ఆరో జ్ఞానం ఉండి తీరాలని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. బీహారు పోలీసులు పావురాలనుపయోగించి వార్తలు పంపడంపై ప్రయోగాలు చేస్తున్నారు. పాకిస్తాన్‌లో స్మగ్లర్లని పట్టుకోవడానికి పావురాలు తప్ప గత్యంతరం లేదు.

# మత్తు

మత్తు ఇంజక్షన్ కనిపెట్టక పూర్వం శస్త్రచికిత్స చేయడానికి రోగిని నలుగురైదుగురు కదలకుండా పట్టుకునే వారట. బాధ భరించలేని రోగి చేసే ఆర్తనాదాలు రెండు మైళ్ళ దూరం వరకూ వినిపించేవంటే అతిశయోక్తి కాదు. శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితంగా ఈ నాడు అంత బాధ పడవలసిన అవసరం లేకుండా పోయింది. మత్తు ఇంజక్షన్ ఇవ్వగానే రోగి కదలకుండా శవంలా పడుంటాడు. ఏ భాగానికి శస్త్ర చికిత్స చేయాలో ఆ భాగానికి మత్తు ఇచ్చే పద్ధతులు కూడా కొన్ని చోట్ల అమల్లో ఉన్నాయి.

మాండ్రేక్ చెట్టు వేళ్ళు సారాలో ఉడికించి తాగితే స్పృహకోల్పోతారని క్రీ.శ. 50వ శతాబ్దానికి పూర్వమే ఓ గ్రీకు వైద్యుడు సూచించాడు. కాలం గడుస్తున్న కొద్దీ మత్తు మందుల మీద పరిశోధనలు విపరీతం కాసాగాయి. స్త్రీత్వం కోల్పోని కన్య వెంట్రుకలు బూడిద చేసి తాగడం, పన్నెండు చీమ గుడ్లుని ఎర్ర ఆవుపాలుతో కలిపి ఉడికించి తాగడం వంటి వెర్రి పనులు కూడా చేసే వారట. స్పృహ కోల్పోవటం కోసం



ద్రాక్ష సారాయి తాగడం కూడా ప్రాచీనులకు తెలుసు. చివరకు 1842 లో అమెరికాలోని, జార్జియా హాస్పిటల్లోని ఓ డాక్టర్, ఈథర్‌ని మత్తు పదార్థంగా వాడే సరికి పరిశోధన రసాయన పదార్థాల వైపు మళ్ళింది. ఇది జరిగిన కొద్ది సంవత్సరాలకే సింప్సన్ మత్తు మందును తయారు చేశాడు. ఈ మందునే ఇప్పటికీ ఉపయోగిస్తున్నారు. మత్తుమందు మొదటి సారిగా ఉపయోగించిన ఘనత అమెరికాలోని మాసాచుసెట్స్ జనరల్ హాస్పిటల్ వారికి దక్కింది.

# అపూర్వ శిలానిధి

చీమలు పర్వతాన్ని తినగలవా? ఎందుకు తినలేవు అంటున్నారు చైనీయులు. తామే అందుకు నిదర్శనమని చేసే చూపిస్తున్నారు. దాదాపు రెండు లక్షల చదరపు గజాల ప్రాంతంలో నిక్షిప్తమై ఉన్న 2,000 సంవత్సరాల నాటి ఓ నిధిని బయటకు తీసే ప్రయత్నంలో ఇప్పుడు చైనీయులు తల మునకలుగా ఉన్నారు. ఇప్పటికే 22 అడుగుల లోతు తవ్వారు.

నిధి అంటే బంగారమో, అపూర్వ రత్నరాసులో అనుకుంటే పొరపాటు పడ్డట్టే! అవి కేవలం శిలా విగ్రహాలు. అవి కూడా మనుషులవీ, గుర్రాలవీ! అవి క్రీ.పూ 2వ శతాబ్దానికి చెందిన మొట్టమొదటి సంయుక్త చైనా చక్రవర్తి చిన్-షి-హువాంగ్ కాలం నాటివని పురావస్తు పరిశోధకులు నమ్ముతున్నారు.

1974లో సియాంగ్ గ్రామంలో రైతులు బావి తవ్వుతుండగా కొన్ని చేతులు, తలల శిల్ప భాగాలు కన్పించాయి. దానితో ఈ తవ్వకం ప్రారంభమైంది. బయల్పడిన శిల్పభాగాలు పరిమాణాన్ని బట్టి అవి మనిషెత్తు విగ్రహా



లని పరిశోధకుల అంచనా.

ఈ శిల్ప నిధిలో రథ, తురగ, పదాతి సైన్యాల విగ్రహాలుండవచ్చునని వారు భావిస్తున్నారు. ఆ సైనిక విగ్రహాలు ఆరడుగుల పొడవున ఉండి ఉండవచ్చు. కాని గడిచిన శతాబ్దాలలో సంభవించిన భూకంపాల వల్ల అవి శకలాలుగా చిన్నా

భిన్నమైపోయాయి. బయల్పడుతున్న శిల్ప శకలాలను ఓచోట చేర్చి వాటికి విగ్రహ స్వరూపం కల్పించాలని అక్కడి నిపుణులు శతధా కృషి చేస్తున్నారు.

అలా జతచేసి ఓ ఆకారం తీసుకు రాబడిన శిల్పాలను కొన్నింటిని అమెరికా, జపాన్, హాంకాంగ్‌లలో ప్రదర్శించడానికి పంపారు. అవి అన్నీ ఎప్పటికైనా సేమాన్‌కు చేరవలసినవే. అక్కడే చైనా నాగరికత ఆవిర్భవించింది. యాత్రికులకు, పర్యాటకులకు ఆ ప్రాంతం సందర్శించటానికి అనుమతిస్తున్నారు. కాకపోతే ఫొటోలు తీసుకోరాదు. ప్రస్తుతం శ్రామికులకు నీడ నివ్వటానికి నిర్మించిన ఓ బ్రహ్మాండమయిన ఆచ్ఛాదన తర్వాతి కాలంలో శాశ్వత వస్తు ప్రదర్శనశాలగా రూపు సంతరించుకొంటుంది. విరిగిన కాళ్ళూ, చేతులూ తెగి పడిన మొండేలతో ఆ ప్రాంతం యుద్ధభూమిని తలపింప చేస్తున్నప్పటికీ తవ్వకాలు మాత్రం వచ్చే శతాబ్దంలో కూడా కొనసాగుతాయని అక్కడి అధికారులు సెలవిచ్చారు!

# గుండెపోటు ఖరీదు

రామేశ్వరం వెళ్ళినా శనీశ్వరుడు తప్పలేదని మన సామెత. దీన్ని ఆంగ్లేయుల పరంగా శనీశ్వరుని బదులు సైతాన్ అని చెప్పుకోవచ్చు. ఇంగ్లాండ్‌లోని ఫిలిప్స్ దంపతులు అమెరికా వెళ్ళినా సైతాన్ దృష్టిని తప్పించుకోలేకపోయారు.

సరదాగా విహార యాత్ర కోసం అమెరికా వెళ్ళిన ఫిలిప్స్ దంపతులు హఠాత్తుగా 45 వేల పౌండ్లు అప్పులో కూరుకుపోయారు. ఆ మొత్తం దాదాపు 7 లక్షల 65 వేల రూపాయలు. అక్కడికీ వారు తమతోపాటు 48 వేల రూపాయలు పట్టుకెళ్ళారు. కాని, ఫిలిప్స్‌కి అమాంతంగా గుండె పోటు రావడంతో విహార యాత్ర కాస్తా విషాద యాత్రగా మారిపోయింది.

గుండెపోటుకి అమెరికాలో లభించే చికిత్స అత్యుత్తమమైనదిగా ప్రపంచం మొత్తం మీద మంచిపేరుంది. ఇంకా నయం! మేం అమెరికా వచ్చాం కనుక



సరిపోయింది. ఇంకెక్కడికయినా వెళ్ళినపుడు మా ఆయనకి గుండెపోటు వస్తే.. అమ్మో ఊహించటానికే భయంగా ఉంది. అంటోంది ఫిలిప్స్‌గారి శ్రీమతి.

ఇంచుమించు చనిపోయాడనుకున్న ఫిలిప్స్‌ని అమెరికన్ డాక్టర్లు పదకొండున్నర గంటల పాటు హోరా హోరీగా వైద్యం చేసి బతికించారు. అక్కడే మరో నెలైనా ఉండకపోతే ఫిలిప్స్ మీద ఆశ వదులుకోవల్సిందే అంటున్నారు లెనాక్స్ ఆసుపత్రి అధికారులు.

# కోతి లంచం

మీరట్‌లోని ఒక పంచదార మిల్లుని నమ్ముకుని గత పది సంవత్సరాలుగా అక్కడే బ్రతుకుతున్న కోతుల గుంపు చాలా తెలివైనది. ఆ మిల్లులో పనిచేసే కార్మికుల వస్తువులు ఎతుకుపోయి ఏదైనా లంచం ఆశ పెడితేనేగాని ఆ వస్తువులు తిరిగి ఇవ్వావవి.

ఓరోజు పొద్దున్నే ఓకోతి ఆరు నెలల పసిపాపని ఎతుకుపోయి, మూడంతసుల మేడమీద కూర్చుంది. దిక్కుతోచని



పసిపాప తలిదండ్రులు కోతులుపట్టేవాడ్ని పిలుచుకొచ్చారు. ఆ వచ్చిన పెద్దమనిషి, కోతిని బెదరగొడితే అసలుకే ముప్పు. దాని సంగతి నేను కనుక్కుంటాను అని పళ్ళికిలించి కోతితో ఏదో మాట్లాడి, ఓ డజను అరటిపళ్ళు తెప్పిస్తే ఫలితం ఉండొచ్చని సెలవిచ్చాడు.

వెంటనే ఓ డజను అరటిపళ్ళు అక్కడ ప్రత్యక్షం. కోతికి ఆ లంచం చాలలేదు. చివరకు మూడు డజన్ల అరటిపళ్ళు తెచ్చాక గాని కోతి ప్రసన్నంకాలేదు. ఒకచేతితో బిడ్డను పొదివి పట్టుకుని ఇంకో చేత్తో మూడు డజన్ల అరటిపళ్ళు పైకి చేరవేసుకుని, ఆ తర్వాత బిడ్డని తెచ్చి జాగ్రత్తగా నేలమీదదించి ఒక్క ఉదుటన పైకెళ్ళి అరటిపళ్ళు తినడం మొదలు పెట్టిందట.

# ప్రేమసాహసం

అమెరికాలోని అర్లండో ఫ్లొరిడా అనే ఊళ్ళో గల విలియం అనే 19 ఏళ్ళ యువకుడు, రాబిన్ అనే అమ్మాయిని ప్రేమించాడు.రాబిన్‌తన ప్రేమని నిర్లక్ష్యం చేస్తోందని తెలిసి ఏదో ఒక ఘన కార్యం చేసి ఆమె ప్రేమని చూరగొనాలని విలియం తీవ్రంగా ఆలోచించాడు. రాబిన్ ఇంటి వరకూ మోకాళ్ళ మీద పాకుతూ వెళ్ళాలని నిశ్చయంచుకుని బయలు దేరాడు. మధ్యలో కొంత మంది, "మా కార్లో దిగబెడతాం, రా?" అన్నా విలియం వినిపించుకోలేదు.

చివరకి తన ప్రియురాలు ఇల్లు చేరుకునే సరికి చేతితొడుగులు, జీన్స్‌పాంటు కన్నాలుపడి చూట్టానికి అసహ్యంగా తయారయాడు. ఈ అవతారాన్ని చూసే సరికి రాబిన్‌కి అరికాలిమంటనెత్తికెక్కింది. ప్రేమ మాట అలా ఉంచి, "ఛీ! వెధవా" అని తిట్టి కొట్టబోయి చివరకి "ఇక్కడో పిచ్చివాడున్నాడు మీరు వెంటనే రావల సిందని" పోలీసులకి ఫోను చేసిందట. పాపం విలియం ప్రేమ ఫలించక పోయినా పేపర్లో మాత్రం అతని పేరు మార్మోగి పోయిందట.

గంట నుంచీ ఆమె అలా ఎదురు చూస్తోంది. సీసాకోసం వెళ్ళిన అతనింకా తిరిగిరాలేదు. ఎప్పుడూ అర్ధ గంటలోగా వచ్చేసే వాడు. ఈరోజెందుకో ఇంత ఆలస్యం చేస్తున్నాడు.

అసహనంగా నిట్టూర్చి మేజా దగ్గరికి నడిచింది. గత దినాల వైభవానికి చిహ్నంగా మిగిలిన గాజు కూజాలోంచి నీళ్ళు వంపుకొంటున్నప్పుడు ఆమె చేతి వేళ్ళు వణికాయి.

గ్లాసు పైకెత్తి గొంతు తడుపుకొనే ప్రయత్నంలో నీళ్ళు తొణికి గుండెలమీద పమిట తడిసింది.

కొంత కాలంగా రోజూ వుదయం పది దాటిం తరువాత చేతుల్లో ఈ వణుకు ప్రారంభమవుతోంది. కిటికీలోంచి రోడ్డు మీదికి చూసింది. సిటీ బస్ ఆ స్టాపులో ఒక్క నిమిషం ఆగి బయల్దేరింది. అందు లోంచి కూడా దిగలేదు అతను. "ఎక్కడ అఘోరిస్తున్నాడో ఈ ముసలాడు" చిరాగ్గా ఖాళీ గ్లాసుని మేజామీద గట్టిగా చప్పుడయ్యేలా పెట్టి పక్కనే వున్న పాత సినిమా పత్రిక తిరగేసింది.

ఎవరెవరో కొత్త కొత్త ముఖాలు... వయ్యారి జాణలు...ఏవేవో సినిమాలు... విసుగ్గా పత్రికని నేలమీదికి విసిరేసింది.

"అమ్మగారూ!"గుమ్మంలోంచి కుప్పుసామి పిలుపు. ఒక్క వుదుటున లేచి వెళ్ళింది గుమ్మం దగ్గరికి.

తలుపు గడియ వెంటనే తెరుచుకోవటం లేదు. వేళ్ళు వొణుకుతున్నాయి. "ఛీ. పాడు తలుపులు! కొంచెం వుండు" అంటూ కొంత ప్రయాస పడిం తరువాత గడియ తీయగలిగింది. లోపలికొస్తోన్న తాత చేతిలోని సంచీమీద దృష్టి నిలిపింది. 'ఫరవాలేదు పెద్దబాటిలే పట్టుకొచ్చినట్టు న్నాడు!' అనుకుంటూనే అడిగింది–

"ఎందుకింతాలస్యం?"అని చిరాగ్గా.

"ఎవరో పెద్ద పార్టీ వచ్చేడమ్మా. కొంచెం సేపు ఆగమన్నారు. వాళ్ళకి ఇరవై బుడ్లదాకా సప్లయి చేసిం తరువాత నా వంతు వచ్చేసరికి ఆలస్యమైపోయింది" అంటూ సంచీలోంచి బాటిల్‌ని పైకి తీసి మేజా మీద పెట్టాడు కుప్పుసామి.

వంట గదిలోంచి గ్లాసులు కడిగి తెచ్చి మేజామీద పెట్టగానే సీసామూత తీసి గ్లాసులోకి పంపుకొంది. అప్పటిదాకా ఆమె నావహించిన చికాకు మాయమైంది. కాసేపటికల్లా వుత్సాహాన్ని పుంజుకుంది ఆమె.

"చూడు కుప్పుసామీ! నా వొణుకంతా టకీమని ఎట్లా మాయమైపోయిందో" చేతివేళ్ళని తాత ముఖానికెదురుగా చాచి అన్నది.

"అప్పటికీ కొంచెంగానే తీసుకున్నాను. అయిదు నిమిషాల్లో వేళ్ళు నా స్వాధీనం లోకి వచ్చేశాయి. సారాకి ఎంత మహిమ ఉందో చూశావా?"

జాలిగా ఆమె వంక చూశాడు కుప్పుసామి.

'ఈ పాడు అలవాటే కదమ్మా మీకీ వణుకుని తెప్పించింది' తనలో తనే గొణుక్కున్నాడు.

"తినటానికేమైనా వుందా?" అడిగింది ముంజేతితో పెదాలని తుడుచుకుని.

"చేపల పులుసు ఉంది. వేయించినవి రెండు ముక్కలు కూడా వున్నాయి" అంటూ ఆ గది నానుకుని వున్న చిన్న వంటింట్లోంచి ఒక ప్లేటులో చేప ముక్కలతో తిరిగొచ్చాడు అతను.

"చేపలు కొంటానిక్కూడా ఇంకా డబ్బులున్నాయా?" అంటూ ఆశ్చర్యంగా అతనికేసి చూసింది.

కొడుకు నెల నెలా మూడొందలు భత్యం ఏర్పాటు చేశాడు. కుప్పుసామే స్వయంగా ప్రతి నెలా రెండో తారీఖున వెళ్ళి డబ్బు పట్టుకొస్తున్నాడు. ఆ డబ్బులోనే అంతా నెట్టుకొస్తున్నాడు. భోజనం పెడుతున్నాడు. 'మందు' తెచ్చిస్తున్నాడు.

తన కొడుకు పంపుతున్న డబ్బే అయినా ఒక విధంగా కుప్పుసామే తనని పోషిస్తున్నట్టు లెక్క అనుకొని చిన్నగా నవ్వుకుంది ఆమె.

ఈ మూడొందలతో ఇంటి బాడుగ, భోజనం, మందు అన్నిటికీ ఎలా సరిపెడుతున్నాడో ఏమిటో! అప్పు చేస్తున్నాడా?లేక తన గతకాలపు గొప్పలు చెప్పి వాళ్ళదగ్గరా, వీళ్ళదగ్గరా డబ్బు అడుగుతున్నాడా? చీపురు తీసుకుని గదిని శుభ్రం చేస్తున్న అతనికేసి చూసింది.

'వీడి ఋణం ఎప్పటికి తీర్చుకోగలనో? జీతమిచ్చి అయిదారేళ్ళు కావస్తోంది' అనుకుంది.

"ఈ పత్రిక చూశావా అమ్మా! నిన్ననే కొట్టువాడినడిగి తీసుకొచ్చాను" నేలమీద పడివున్న పత్రికని ఆమె చేతి కందించాడు కుప్పుసామి

"మీగురించి ఏదో రాశారని చెప్పాడు"

అతను చూపించిన పేజీమీదికి చూపు నిలిపింది ఆమె. లోపలి పేజీలో బాక్సుకట్టి ప్రచురించారు తనని గురించిన ఆవార్తని :

"సవితాదేవి పునఃప్రవేశం—

వందకు పైగా చిత్రాల్లో నాయిక పాత్రలు పోషించి ప్రేక్షకులచేత మహానటిగా కొనియాడబడిన ప్రముఖ మాజీనటి సవితాదేవి పదకొండు సంవత్సరాల తెరమరుగు జీవితం తరువాత మళ్ళీ వెండి తెరమీద కనిపించబోతోందన్న వార్తని మా పాఠకులకు తెలుపడానికి ఆనందిస్తున్నాము. కొత్తదనాన్ని కాంక్షించే నందలాల్ బ్రదర్స్‌వారు నవతా ఆర్ట్స్ పతాకం కింద 'వసంతంలో ఒక రోజు' చిత్ర నిర్మాణం తలపెట్టారు. ఇందులో శోభారాణి సరసన తల్లిగా సవితాదేవి నటించబోతున్నారు. హిట్ చిత్రాల దర్శకునిగా పేరొందిన దశరథరామయ్యగారు సారథ్యం వహిస్తున్నారు. ప్రకాష్‌బాబు హీరోగా నటించే ఈ చిత్రంలో ఇంకా కృష్ణమోహన్, విజయ తిలకం, లక్ష్మీప్రభ, నాగరాజు తదితరులు ఇతర తారాగణం. త్వరలో సెట్స్‌మీదికి వెళ్ళబోయే ఈ చిత్రం సినిమా చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించగలదని, ఆరు వారాల్లో పూర్తి చెయ్యాలనుకుంటున్నామని స్టార్ డైరెక్టర్ దశరథ రామయ్య పత్రికా విలేకరులకు తెలియజేశారు"—చదవడం ముగించి పత్రికను నేలమీదికి జారవిడిచింది. తూలుకుంటూ వెళ్ళి అద్దం ముందు నిలబడి పిచ్చిగా అరిచింది :

"అమ్మట...అమ్మ ... ముసలోడా! నన్నుచూడు. బాగా చూడు. తల్లివేషం కట్టే ముసలమ్మలా వున్నానా నేను? చెప్పరా"

కుప్పుసామి దీనంగా ఆమెకేసి చూస్తున్నాడు. ఈ ప్రశ్నకి అతని దగ్గర సమాధానం దొరకదు.

"అమ్మ వేషమని వాడు నాతో మాటమాత్రమైనా చెప్పలేదు దొంగ వెధవ. 'నాలుగు సీన్లే అయినా మంచి కేరెక్టర్

రోల్' అని ఒప్పించి ముష్టి నూట పదహార్లు అడ్వాన్సు నా మొహానకొట్టి వెళ్ళాడు. దుక్కలా వుండే ఆ శోభారాణిక నేను అమ్మనా?"

బావురుమని ఎక్కడ ఏడుస్తుందోనని భయపడ్డాడు కుప్పుసామి. ఆమె యేడ్వటం ప్రారంభించిందంటే ఒక పట్టాన ఆపటం సాధ్యం కాదు - అందునా కాపుసారా నిషామీద వున్నపుడు. తలని గోడకేసి బాదుకుంటూ, జుత్తు పీక్కుంటూ, ఒక్కోసారి నేలమీదపడి దొర్లుతూ—కొంత కాలంగా ఆమెకిది ఒకరకమైన మానసిక జాడ్యంగా తయారైంది. ఆమెకేసి జాలిగా చూస్తూ వుండటంకంటే ఏమీ చేయలేక పోయాడు కుప్పుసామి.

చివాలున మంచం మీంచి లేచి నిలబడింది. పదిహేనేళ్ళ క్రితం అడయారులో, బ్రహ్మాండమైన నౌకలాంటి సొంత భవంతిలో, రాణిలా వెలిగిన రోజుల్లో ధ్వనించే కంఠంతో ఆజ్ఞాపిస్తున్నట్టుగా పలికింది :

''కిందికి వెళ్ళి ఫోన్ చేసిరా కుప్పు. ఆ దశరథరామయ్యని వెంటనే పిలిపించు అమ్మగారు వున్న పళంగా వెంటనే రమ్మంటున్నారని చెప్పిరా, వెళ్ళు"

మౌనంగా కిందికి దిగి వెళ్ళాడు కుప్పుసామి. అయిదు నిమిషాల్లో తిరిగొచ్చి ఫోన్ చేసినట్టు అబద్ధం చెప్పాడు. ఆ స్థితిలో నిజాన్ని ఆమె అర్థం చేసుకోలేదు. అర్థం చేసుకున్నా భరించలేదు. ఆ క్షణంలో పదిహేనేళ్ళ గతంలోకి వెళ్ళిపోయింది. ఇప్పుడు ఆమె ఆజ్ఞలని పాటించేవాళ్ళు తను తప్ప మరెవరూ లేరని ఆమెకెలా చెప్పగలడు?

''రానీవాణ్ణి! కాంట్రాక్టుని చింపి వాడి ముఖంమీదే విసిరికొడతాను. ఏమనుకున్నాడో రాస్కెల్"

ఆ రాత్రి ఏమీ తినకుండా మరో రెండు గ్లాసులు సారా తాగి మంచంమీద వాలి అలాగే నిద్రపోయింది సవితాదేవి. ఆమెతోబాటు తనూ పస్తున్నాడు కుప్పుసామి. అది అతనికి అలవాటు. గదిబయట బాల్కనీలాంటి చిన్న స్థలంలో చాప పరిచి గది తలుపులకి తాళంవేసి, తాళంచెవిని భద్రంగా పంచెలో దోపుకొని మేను వాల్చాడు. చాలా సేపటిదాకా నిద్రపట్టలేదతనికి.

తెల్లవారింది. ఎవరో లేపుతోంటే బద్ధకంగా కళ్ళు తెరిచాడు. ఎదురుగా ఇంటి యజమాని రాఘవన్ నిలబడి వున్నాడు.

"ఏం కుప్పుసామి! కొత్తగా ఏదో పిక్చర్‌లో బుక్కయిందంటనే మీ అమ్మగారు" అంటూ పళ్ళికిలిస్తున్నాడు

ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుని "అవును బాబూ" అన్నాడు కుప్పుసామి.

"దేవుడి దయవల్ల ఇకనుంచైనా ఆయమ్మ బతుకు బాగుపడనీ" అన్నాడు రాఘవన్ దీవిస్తున్నట్టుగా.

రాఘవన్ కింది పోర్షన్‌లో వుంటున్నాడు. రెండేళ్ళ కిందట కొత్తగా కట్టుకున్న ఆ యింట్లోకి దిగినప్పుడు మేడమీద ఖాళీగా వున్న పోర్షన్‌ని అద్దెకిమ్మని అడగడానికొచ్చాడు కుప్పుసామి. ఆ వాటాలో అద్దెకి దిగబోయేది సవితాదేవి అని విన్నప్పుడు నిర్ఘాంతపోయాడు రాఘవన్.

"ఏమిటీ! సినిమా నటి సవితాదేవికా ఈ పోర్షన్ అద్దెకడుగుతున్నావు! నిజంగానా లేక తమాషా చేస్తున్నావా కుప్పుసామీ?" అని పదే పదే అడిగాడు.

"అడయారులో అంతఃపురంలాంటి బంగళా, టి. నగర్‌లో మరో రెండు మిద్దెలు, వడపళనిలో ఒక లైను లైను అద్దెకిచ్చిన ఇళ్ళు — ఇవన్నీ వదిలేసి నా యింట్లో, ఈ చిన్న పోర్షన్‌లో సవితాదేవి అద్దెకుండబోవటం ఏమిటి! నేన్నమ్మను" అన్నాడు ఆశ్చర్యంగా కుప్పుసామికేసే తేరిపార జూస్తూ.

"అవన్నీ అమ్మేసి చాలా కాలమైంది. ఇప్పుడు 'అన్నానగర్'లో వుంటున్నాము. ఇంటాయనకీ మాకూ సరిపడక వేరే యిల్లు వెతుక్కోవాల్సి వచ్చింది" అని చిన్నగా నవ్వేడు కుప్పుసామి.

"సవితాదేవి మునుపట్లాలేదనీ, చాలా నష్టపోయిందనీ తెలుసనుకో. కాని మరీ ఇంత ఇదిగా వుందన్న సంగతి మాత్రం నేనూహించను కూడా లేదు. ఆవిడ సినిమాలన్నీ ఒక్కటీ విడవకుండా చూసే వాడ్ని కుప్పుసామీ. ఆమె అభిమానుల్లో నేనూ ఒకడ్నని చెప్పుకోవచ్చనుకో" అని సగర్వంగా ప్రకటించుకున్నాడు రాఘవన్. మేడమీద పోర్షన్‌ని ఏ షరతులూ లేకుండా సవితాదేవికి అద్దెకొదిలాడు. ఈ రెండేళ్ళలో ఏనాడూ తానై వచ్చి అద్దె డబ్బులిమ్మని అడిగిన పాపాన పోలేదు. అటువంటిది మొదటిసారిగా ఈ రోజు మెట్లెక్కి వచ్చాడు.

"సినిమా వాళ్ళు అడ్వాన్సుగా ఏదో కొంత ముట్టజెప్పి వుంటారే ... తొమ్మిది నెలలుగా అద్దె బాకీ వుంది కుప్పుసామి!" మెల్లగా అసలు విషయం కదిపాడు.

"అమ్మాయికి సంబంధం కుదిరేట్టు వుంది. వరుడు మంచి ఉద్యోగంలో వున్నాడు. మా చుట్టాలబ్బాయే! పెళ్ళి చీరలూ అవీ ముందే కొనిపెట్టుకోవాలి గదా" కుప్పుసామి మౌనంగా వింటున్నాడు.

"మరి నే వస్తా కుప్పుసామీ! అద్దె బాకీ అడగటానికి వచ్చినట్టు మాత్రం మీ అమ్మగారితో చెప్పొద్దు సుమా" అని మెట్లు దిగి వెళ్ళిపోయాడు రాఘవన్.

అభిమాన తారమీద అతనిలో ఇంకా మిగిలివున్న గౌరవాన్ని తలుచుకుని తృప్తిగా నవ్వుకున్నాడు కుప్పుసామి. అన్నానగర్‌లోని ఆ పాత ఇంటాయనకీ, ఈయనకీ ఎంత వ్యత్యాసం!

తాళం తీసి గదిలోకి అడుగు పెట్టిన అతను విస్మయంతో అలా చూస్తూ నిలబడి పోయాడు. ఎప్పుడు లేచిందో శుభ్రంగా స్నానంచేసి తల దువ్వుకుంటోంది సవితాదేవి. అంత నిర్మలంగా, ప్రశాంతంగా ఆవేళప్పుడు ఆమెని చూచి ఎరుగడు.

"నీకెన్నిసార్లు చెప్పాలి కుప్పుసామీ తలుపులకి బయట తాళం పెట్టొద్దని" అంది ఇంకా పల్చబడని పొడవాటి కురుల చిక్కు విడదీసుకుంటూ. "తలుపుకి తాళం వెయ్యకపోతే నిబ్బరంగా నిద్రపోలేనమ్మా. ఈ అశోక్‌నగర్‌లో అసలే దొంగతనాలెక్కువగా వున్నాయి"

అతని మాటలకి నవ్వొచ్చిందామెకు.

"ఇక్కడేం మిగిలిందని దోచుకుపోడానికి? వచ్చిన దొంగైనా మనల్ని తిట్టుకుంటూ పోతాడేగాని ఎత్తుకు పోటానికేమీ వుండదే పాపం"

గదిలో ఒక మూలగా వున్న షెల్ఫు కేసి చూస్తున్నాడు కుప్పుసామి.

బాగా బతికిన రోజుల్లో సవితాదేవి అందుకున్న బహుమతుల తాలూకు ప్రతిమలు, షీల్డులు, మరికొన్ని పతకాలు

వున్నాయి ఆ అరలో అప్పుడప్పుడూ వాటికి దుమ్ము దులిపి, తృప్తిగా తడిమి చూసుకుంటూ ఆనందించటం అలవాటు అతనికి.

"ఓహో! ఇవన్నీ దొంగలెత్తుకుపోతారనా నీ భయం. పది రూపాయల విలువ కూడా చెయ్యవు అవన్నీ కలిపి. లేకపోతే నేనెప్పుడో వీటిని డబ్బు చేసుకుని వుండే దాన్ని కుప్పూ" అంటూ అలక్ష్యంగా నవ్వుతూ వాటికేసి చూసింది సవితాదేవి. ఘనవిజయాలు సాధించిన కొన్ని చిత్రాల్లోని తన నటనని ప్రశంసిస్తూ అభిమాన సంఘాలు, పత్రికలు, వంద రోజులు ప్రదర్శించిన సందర్భంగా, థియేటర్ యజమానులు, పంపిణీదారులు బహూకరించిన, అందంగా తన పేరు చెక్కబడిన రకరకాల ఆకృతిగల ఆ షీల్డులు గత కాలపు చరిత్రను చాటిచెప్పే మ్యూజియం లోని వస్తువుల్లా కనిపించేయి ఆమెకి.

డ్రాయింగు రూము, డైనింగు హాలు, బెడ్‌రూము అన్నీ అయిన ఆ గది గోడల చుట్టూ రకరకాల ఫొటోలు... ఆమె నటించిన చిత్రాల స్టిల్స్... జాలిగా ఆమెకేసి చూస్తున్నాయి.

చేతులు పట్టుకుని తన కళ్ళలోకి ప్రేమగా చూస్తూ.....పొదివి పట్టుకుని చిలిపిగా కవ్విస్తూ...కలిపిన అన్నం ముద్దను ఆప్యాయంగా తన నోటికందిస్తూ, తనతో నటించిన ఎందరో హీరోలు ఆ ఫొటో ఫ్రేముల్లో బంధించబడి వున్నారు. మరో గోడకి బహుమతులందుకుంటూ తీయించుకున్న ఫొటోలు...వాటిలో రాష్ట్రపతులు, ముఖ్యమంత్రులు, జడ్జీలు, పుర ప్రముఖులు, రాజకీయ నాయకులు, మతాధిపతులు, బాబాలు, సంఘ సేవకులు, సాహిత్య మేధావులు ఇంకా ఎందరెందరో పెద్దమనుషులు తన సరసన నిలబడి కరచాలనం చేస్తూ, చిరునవ్వులు చిందిస్తూ, గాంభీర్యం వెలగబెడుతూ, ఆశీర్వాదాలు చేస్తూ, దీవనలిస్తూ...

"లోపలికి రావచ్చా పిన్నీ" గది బయట తలుపు దగ్గర నిలబడి అడిగింది ఇంటాయన రాఘవన్‌గారి పెద్దమ్మాయి శ్యామల.

"రామ్మా!" అంటూ ఆహ్వానించింది.

"ఇది చూశారా పిన్నీ?" అంటూ ఓ దిన పత్రికని ఆమె చేతికిచ్చి మంచం మీద ఆమె పక్కనే కూర్చుంది శ్యామల.

"మీరు మళ్ళీ సినిమాల్లో నటిస్తున్నారా పిన్నీ?" ఎంతో కుతూహలంతో అడిగింది.

"అవునమ్మా"

'సినిమాల్లో వేషాలు వేసే దానితో నీకేమిటే ముచ్చట్లు' అని అదిలించే తల్లిని తప్పించుకుని తనతో మాట్లాట్టానికి వుబలాటపడే ఆ అమ్మాయంటే ఆమెకెంతో ఇష్టం. తననొక అపూర్వమయిన వ్యక్తిగా, ఆదర్శజీవిగా భావించుకుని తన సాన్నిహిత్యంలో ఏదో ఆనందాన్ని అనుభవించే ఆ పిల్లని చూస్తూంటే తనలో ఏదో అభిమానం, ఆప్యాయతా పుట్టుకొస్తుంది.

"మతిచెడి సంసారులుండే ఇల్లనికూడా చూడకుండా సినిమాల దాన్ని తెచ్చి నెత్తిన పెట్టుకున్నాడు మీ నాన్న! సరే- మరి నీకేం పోయేకాలమొచ్చిందని మాటిమాటికీ దాని దగ్గరకు పరుగెత్తుతున్నావు?" తనకి వినబడేలా కూతురు మీద మండి పడుతూ వుంటుంది శ్యామల తల్లి. అయినా ఆవిడమీద కోపం కలగదు తనకి.

"శ్యామూ నీకు పెళ్ళని విన్నానే! చదువయిపోయాకనా లేక ఈ లోపలేనా?"

"పరీక్షలై పోయాకే పిన్నీ" సిగ్గు పడుతూ చెప్పింది శ్యామల.

"మీ ఆయన బావుంటారా?"

"చాలా బావుంటారు పిన్నీ" అంటూ చూపులు తప్పించుకుని ఆ గది గోడలకు వున్న ఫొటోలని చూడసాగింది శ్యామల.

ఆ గదికి వచ్చినప్పుడల్లా చూస్తూనే వున్నా ప్రతిసారీ కొత్తగానే వుంటుంది ఆ అమ్మాయికి వాటిని చూస్తూ వుంటే. ఆ అమాయకతే సవితాదేవికి ఎంతో ముచ్చటేస్తుంది.

ఈ శ్యామలలా తనకో జీవితం ఏర్పడకుండా పోయింది ఎందుకని?

శ్యామల వెళ్ళిపోయిం తరువాత చాలా సేపటిదాకా ఆలోచిస్తూ కూర్చుంది సవితాదేవి.

సగటు ఆడపిల్ల జీవితంలా కాకుండా విభిన్నమైన వ్యక్తిగా తన గమ్యాన్ని మార్చిందెవరు?

తన జీవితాన్ని మబ్బుల్లోకి మళ్ళించి అక్కడినుంచి చీకటి కూపంలోకి తోసిం దెవరు?

మసి మరకలు పడిన ఫొటోలోని బొమ్మల్లా గతకాలపు దృశ్యాలు సవితా దేవి మదిలో కదులుతున్నాయి...

పదమూడేళ్ళ అమ్మాయి బెరుగ్గా తండ్రిచేయి పట్టుకుని కదిలే రైలు పెట్టెలోకి ఎక్కుతోంది. కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుతురు మధ్య మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో దిగి విభ్రాంతురాలై చుట్టూ వింతగా కలయజూస్తోంది.

కాళ్ళకు గజ్జెలు కట్టుకుని నిలబడింది.

'తతతై... తాతై... తతతై... తా..' డాన్సు మాస్టర్ దరువేస్తున్నాడు. పదములేస్తోంది ఆ పాప.

కూతురి భవిష్యత్తుని గురించిన కలల్లో తేలిపోతూ కూర్చుని వున్నాడు ఆ తండ్రి.

ఎర్రగా గారపట్టిన పళ్ళతో అడంగి లాంటి డాన్సు మాస్టర్ నవ్వు.

లయ తప్పినప్పుడు అతను పెట్టే తొడపాశం.

మద్రాసు బీచి ఇసుకలో కట్టుకున్న పిచ్చుక గూళ్ళు.

సినీ తారలు రాజకుమారి, అంజలీదేవి, భానుమతుల ఆటలు, పాటలు........ వాళ్ళ ప్రియులు సినిమా అయిపోగానే తెరమీద 'శుభం' అంటూ కనిపించే అక్షరాలు సవితాదేవికి మిగిలిపోయిన మధురమైన జ్ఞాపకాలు.



మూడేళ్ళ కొకసారి కారు మారుస్తూ ఖరీదైన కాడిలాకుల్లో, ప్లిమోతుల్లో, చెవర్లెట్లలో విలాసంగా, హుందాగా తిరిగిన ఆ రోజులు తలుచుకుంటూ ఇరుకైన కంపెనీ కారులో ఒదిగి కూర్చుంది సవితా దేవి.

రోడ్డుమీద పూలరథంలా సాగిపోయే తన పచ్చరంగు ప్లిమత్ కారు వేపు ఆనాడు కళ్ళింతలు చేసుకుని చూసిన జనమంతా కంపెనీ డొక్కు కారులో ఇరుక్కుని కూర్చున్న తనకేసి హేళనగా




చూస్తూ గుసగుసలాడుకొంటున్నట్లుగా భావించి ముఖం పక్కకి తిప్పుకుంది.

పదకొండేళ్ళ క్రితం తనను దేవతలా ఆరాధించిన ఈ సినీ ప్రేక్షక జనమంతా ఒక్కసారిగా తనకు దూరమైనట్టని పించింది. లేక తనే వాళ్ళకి దూరమైందా? తిరిగి ఈ ప్రేక్షక ప్రపంచం తనని దగ్గరకు తీసుకుబోతున్నదా? తను ఈ ప్రపంచంలో మళ్ళీ ఐక్యం కావడం సంభవమా? స్టూడియోలో 'బి' ఫ్లోరు ముందాగింది కం.పె.నీ కారు.

డ్రైవర్ తనకోసం డోర్ తెరవ కుండా వెళ్ళిపోతే తనకేర్పడే భంగపాటుని ఊహించుకుని వణికే చేతివేళ్ళని స్వాధీనం లోకి తెచ్చుకుంటూ హడావుడిగా తలుపు తెరుచుకుని కారు దిగింది సవితాదేవి.

ఈ స్టూడియో ఆవరణలో మునుపు ఎన్నిసార్లు హుందాగా, గర్వంగా, గంభీ రంగా తన ఖరీదైనా కార్లోంచి దిగింది! లైట్ బాయ్ దగ్గర్నుంచి స్టూడియో ప్రొప్రయిటర్ దాకా, ప్రొడక్షన్

మేనేజర్ల నుంచీ ప్రొడ్యూసర్ల దాకా, మేకప్ మన్‌లు, అసిస్టెంటు డైరక్టర్లు, రచయితలు, సహ నటీనటులు-భక్తితో, భయంతో, గౌరవంతో, అభిమానంతో చేసే సలాములు, నమస్కారాలు, హల్లోలు, గుడ్‌మార్నింగ్ గుడీవినింగులు చిరునవ్వుతో అందుకుంటూ ఫ్లోర్‌లోకి అడుగు పెట్టేది. తన ప్రవేశంతో అక్కడి వాతావరణంలో ఎంత మార్పు? అంతా క్షణకాలం మాటలు మానేసి తన కభివాదం చేసేవారు.

ఈ సెట్లమీద ఎన్ని పాత్రలు పోషించిందో! మహారాణిగా, మాతృదేవతగా, ఉత్తమ ఇల్లాలుగా, ప్రేమస్వరూపిణిగా, త్యాగమూర్తిగా రాజసౌధాల్లో, సంపన్నుల భవంతుల్లో, పెంకుటిళ్ళలో, పూరి గుడిసెల్లో ఎన్నెన్ని కథలు, ఎన్నెన్ని నటనానుభూతులు!

ఏమైనాయి అవన్నీ ఈనాడు? ఆ మనుషులు లేరా? తనలో మిగిలిన జ్ఞాపకాలు వాటిలో అంతరించాయా? లేక తనని విస్మరిస్తున్నారా? గుర్తుపట్టి కూడా అలక్ష్యం చేస్తున్నారా?

ఎవరూ తనను గుర్తుపట్టక ముందే మేకప్ రూంలోకి జొరబడాలని తొందర పడిందామె. ఎక్కడుంది మేకప్ రూం? చుట్టుపక్కల వెతుకుతున్నాయి ఆమె చూపులు. జమాఖర్చుల సర్దుబాటుకని, ఇన్‌కమ్‌టాక్సు లెక్కల్లో నష్టం చూపటం కోసమని మేకప్ గదుల్ని అప్పుడప్పుడూ నేలమట్టం చేసి కొత్తవి కడుతూ వుండటం చేస్తూ వుంటారు స్టూడియో యజమానులు అనే సంగతి గుర్తొచ్చి-

"కుప్పుసామీ! మేకప్ రూం ఎక్కడుందో చూడు?" అంది వద్దంటున్నా వినకుండా తనతో బయలుదేరిన ముసలాడితో.

"నమస్కారం అమ్మా!" అన్న గొంతు విని విస్తుపోయి తిరిగి చూసింది. తనకి నమస్కారం చేసే వాళ్ళని గుర్తించే అవకాశమో, అవసరమో వుండేది కాదు ఆ రోజుల్లో. ఒకరా ఇద్దరా తెలుసుకోవటానికి, విచారించటానికి! ఇప్పుడు తన పక్కనే చేతులు జోడించి నిలబడి వున్న ఆ మనిషిని గురించి తెలుసుకోవటానికి కుతూహల పడింది.

"నేనెవరినో మీకు తెలిసుండదులేమ్మా! ఈ ఫ్లోర్‌లో పైన కర్రలమీద చీకట్లో ఓ మూలగా కూర్చునుండేవాణ్ని" అని చిన్నగా నవ్వేడు. నల్లగా మాసిన కాకీ షర్టూ, అదేరంగు అర నిక్కరూ వేసుకుని వున్న ఆ నలభైయేళ్ళ వ్యక్తిని లైట్ బాయ్ అంటారు స్టూడియో పరిభాషలో.

"నమస్తే" అప్రయత్నంగా వెలువడింది తన గొంతులోంచి. అంతలో మేకప్‌తోటే హడావుడిగా అక్కడికొచ్చింది శోభారాణి. సవితాదేవి కాళ్ళకు సాష్టాంగపడి నమస్కారం చేసింది.

ఫీల్డులో బాగా పైకొస్తున్న ఓ ప్రముఖ నటి మాజీ తారకు అంత గౌరవాన్నివ్వటం అక్కడ చేరినవాళ్ళందరినీ దిగ్భ్రాంతుల్ని చేసింది.

ఏ మూలనుంచో ఓ కెమేరా ఆ దృశ్యాన్ని ఫ్లాష్ చేసింది.

"నేను మీ అభిమానిని. శిష్యురాలిని కూడా" ఎంతో వినయంగా అంటోంది శోభారాణి.

"మీరు నటించిన చిత్రాలని మళ్ళీ మళ్ళీ చూశాను. నా నటనలో చాలావరకు మిమ్మల్నే అనుకరిస్తున్నాను. గమనించే

వుంటారు"

"లేదమ్మా! నేను సినిమాలు చూసి చాలా కాలమైంది" అంటూ తన ముందు నిలబడిన వర్ధమాన నటిని పరీక్షగా చూసింది సవితాదేవి. రూపంలో కొంత వరకు తనని పోలి వుంది. అంతేకాదు శిరోజాలంకరణ, చీర కట్టిన తీరు, ప్రదర్శించే హావభావాలూ కూడా తనవే! ప్రేక్షకులు మెచ్చుకుని ఆమోదించిన తన నటనా విధానాన్ని అనుకరిస్తూ 'మరో సవితాదేవి'గా ప్రశంసలందుకుంటోంది. తన స్థానాన్ని భర్తీ చేయటానికి పథకం వేసి ఈ శోభారాణిని రూపొందించినట్లుంది సినీ మేధావులు.

"మీ సరసన, అందునా మీ కూతురుగా ఈ పిక్చర్‌లో నటించే అవకాశం రావటం నా అదృష్టంగా భావిస్తున్నాను. నన్ను ఆశీర్వదించక్కా!" అంది శోభారాణి కళ్ళనిండా కృతజ్ఞతా భావాన్ని నింపుకుని.

"నటనలో మాత్రం నన్ననుకరించమ్మా. జీవితంలో కాదు" చివరి మాట అనాలనుకుని మింగేసింది.

చుట్టూ కళ్ళుచెదిరేలా ప్రకాశవంతంగా వెలిగే లైట్ల మధ్య మేకప్ రూంలో కూర్చుంది సవితాదేవి. ఎదురుగా వున్న పెద్ద నిలువుటద్దంలోంచి తన శరీరంలో ఏర్పడిన మార్పుల్ని గమనించగలుగుతోంది.

ముఖానికి వేసుకునే రంగు కలిపి ఆమె ముందుంచాడు మేకప్మన్.

"బొట్టు పెట్టుకోండమ్మా"

ప్లేటులోంచి గ్రీన్ తీసి నొసట అద్దుకుని దానిమీద బొట్టు దిద్దుకుంది సవితాదేవి.

దీర్ఘకాలపు తెరమరుగు జీవితం తరువాత మళ్ళీ సవితాదేవి నటిస్తోందన్న వార్త విని పక్క ఫ్లోర్లలోంచి టెక్నీషియన్లు, వర్కర్లు బిలబిలమంటూ వచ్చి ఆమెను చుట్టుకున్నారు. గౌరవ తీసుకొని కొందరామెని అభినందించారు. మరి కొందరు జాలిగా చూశారు. విలేకరుల గుంపొకటి వచ్చిపడింది. ఓ ప్రముఖ దినపత్రికకి సంబంధించిన సినిమా విలేకరికి దారి ఇచ్చారు ఛోటా విలేకర్లు.

"మళ్ళీ మీరు ఈ సినిమా రంగంలో ప్రవేశించటానికి గల కారణాలేమిటో వివరించగలరా?" బడా విలేకరి మొదటి ప్రశ్న.

కడుపులో మంటని రేకెత్తించినట్లయింది సవితాదేవికి.

"ఇంతకాలం పరిశ్రమ నన్ను దూరంగా నెట్టిపేసిందే-కారణం ఏమిటో తెలుసుకోవాలని నాకూ వుంది. చెప్పగలరా" అద్దంలో మేకప్ సరిచూసుకుంటూ అడగాలనుకుంది. స్పాంజికి అద్దినరంగు ఎక్కడ ఆరిపోతుందోననే బెంగతో మౌనంగా నిలబడి వున్నాడు మేకప్మన్.

మౌనానికి తమకి తోచిన అర్థాలూ, అనుకూలమైన వ్యాఖ్యానాలూ కల్పించుకోవటంలో సిద్ధహస్తులైన విలేకర్లు ఆమె సమాధానం కోసం చూస్తూ కూర్చోలేదు.

"చలనచిత్ర రంగానికి నటిగా చేతనైన మేరకు సేవ చెయ్యాలనే లక్ష్యంతో మళ్ళీ నటిస్తున్నట్టు రాసుకోమంటారా?" అడిగాడు విలేకరి.

"మీకు అలవాటేగా. అలాగే రాసుకోండి" అంది కోపాన్ని ఆపుకుంటూ చిన్నగా నవ్వి. అంతా తలో ప్రశ్న అడిగారు. చిలిపిగా కొన్ని, నిజమైన అభిమానంతో కొన్ని, అర్థం లేకుండా కొన్ని

ప్రశ్నలు వేసి పావుగంటకి పైగా విసిగించి నిష్క్రమించారు. అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలు చెప్పింది.

"శోభారాణి మీ కాళ్ళకి నమస్కరించినప్పుడు మీరెలా ఫీలయ్యారు?"

"ఏమీ ఫీల్ కాలేదు"

"మరో సవితాదేవిగా ప్రసిద్ధిగాంచిన శోభారాణికి మాజీ నటి సవితాదేవి ఆశీస్సులు!

"'నాలాగే వంద చిత్రాల్లో నటించి అభివృద్ధిలోకి రామ్మా' అంటూ దీవించారని రాసుకోమంటారా?"

"రాసుకోండి. కాని ఆ 'మాజీ' అనే మాటని మాత్రం తీసేయండి దయచేసి. మళ్ళీ నటిస్తున్నాను కదా ఇంక ఆ'మాజీ' అనవసరం" అన్నది సవితాదేవి సూటిగా ఆ విలేకరిని చూస్తూ.

చిన్నబుచ్చుకున్న ఆ విలేకరి ''సారీ మేడమ్'' అని గబగబా ఏదో రాసుకున్నాడు.

కొంచెం దూరంగా నిలబడి ఈ తతంగమంతా గమనిస్తోన్న డైరెక్టర్ దశరథ రామయ్య-నిర్మాత నందలాల్‌తో మెల్లగా అంటున్నాడు

"చూశారా సార్! సవితాదేవిని మన పిక్చర్‌లో బుక్ చేసుకుంటే పబ్లిసిటీ వేల్యూ పెరుగుతుందని, పిక్చర్ బ్రహ్మాండంగా బిజినెస్ అవుతుందని అంటే మీరు నమ్మలేదు. ఇప్పుడు గమనిస్తున్నారా పత్రికల వాళ్ళెలా పోటీలు పడి రాసుకుంటున్నారో మన సినిమా గురించి?"

"అది సరేగాని శోభారాణి సవితాదేవి కాళ్ళకి నమస్కరించటం చిత్రంగా లేదూ!" అన్నాడు నందలాల్. లేని మీసం మెలేస్తున్నట్టుగా నవ్వేడు దశరథ రామయ్య.

"అంతా నటనండీ బాబూ! అసల శోభారాణికి ఆ అయిడియా ఇచ్చిందే నేను. స్టిల్ ఫొటోగ్రాఫర్‌ని ముందుగానే ఏర్పాటు చేసి ఫొటో తీయించింది నేనే. ఈ చిట్కాలు మనకు ముందు ముందు చాలా ఉపయోగపడతాయండీ"

మేకప్ పూర్తి చేయబోతూ అన్నాడు శేఖర్ "తల్లి వేషం. కొద్దిగా ముడతలూ, జుత్తుకి అక్కడక్కడా తెల్ల రంగు అవసరం అవుతుంది"

"తెల్ల రంగా!వద్దు"అన్నది కంగారుగా సవితాదేవి.

"డైరెక్టర్‌గారు వెయ్యమని చెప్పారమ్మా" సందేహిస్తూ అన్నాడు మేకప్ మన్.

"ఎవరు చెప్పినా సరే. తెల్ల రంగు వేసుకోటానికి మాత్రం నేనొప్పుకోను. నేనేం ముసలిదాన్నా?" కటువుగా అంది,

దశరథరామయ్య గారు స్వయంగా వచ్చి చెప్పినా లాభం లేకపోయింది.

"నెరిసిన జుత్తుతోనే నేను నటించి తీరాలని మీరు పట్టుబడితే నేనసలు నటించేది లేదు.

"లోకేశ్వరావుకి పెళ్ళికెదిగిన కొడుకులూ, మనవరాళ్ళూ వున్నారు. అయినా ఆయన కాలేజీ కుర్రాడి వేషాలు వేస్తూనే వున్నాడు, జనం చూస్తూనే వున్నారు. ఇంకా నలభై దాటని నేను మాత్రం జుత్తుకి తెల్ల రంగేసుకోవాలా?"

"ఏదో మీకు సహాయ పడదామనే సదుద్దేశంతో ఈ రోల్‌కి మిమ్మల్ని రికమెండ్ చేశాను. అర్థం చేసుకుని సహకరిస్తారనుకుంటే మీరిలా..."

అలనాడు తన కాల్‌షీట్ల కోసం

బంగళా చుట్టూ పదిసార్లు తిరిగిన అసో సియేట్ డైరెక్టర్ దశరథరామయ్య కళ్ళ ముందు మెదిలాడు.

ఆ రోజుల్లో ఓ ప్రముఖ దర్శకుడి కింద అసోసియేట్‌గా వుండేవాడు దశరథ రామయ్య. మొదటిసారిగా ఒక చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం చిక్కింది. అప్పుడు తనకి వూపిరి సలపని కాల్‌షీట్లు. తన మొదటి చిత్రంలో నటించాల్సిందని కాళ్ళావేళ్ళా పడి బ్రతిమాలాడు.

'నన్ను దర్శకుణ్ణిగా నిలబెట్టటం మీ చేతుల్లో వుంది. మిమ్మల్ని దృష్టిలో పెట్టుకునే ఈ కథ తయారు చేశాను. దయచేసి అంగీకరించండి' అంటూ కాళ్ళు పట్టుకున్నంత పని చేశాడు. తను కరిగి పోయింది. అతని అదృష్టం బావుండి ఆ చిత్రం వందరోజు లాడింది. దశరథ రామయ్య బాక్సాఫీసు డైరెక్టరై పోయాడు.

"ఈ కబుర్లన్నీ ఎందుకులెండి డైరెక్టర్ గారూ! ఈ సినీ మాయా ప్రపంచంలో మంచి, మమత, ప్రేమ, గౌరవం అనే మాటలకి అర్థాలేమిటో, విలువెంతో నాకు బాగా తెలుసు. ఆ సంగతి మీకూ తెలుసు" ఆవేశాన్ని అణుచుకుంటూ అన్నది సవితా దేవి. దశరథరామయ్య మారుమాట్లాడ కుండా వెనక్కి తిరిగాడు.

హీరోయిన్‌కి వేసినట్టే ఆమె తల్లికి అందమైన మేకప్ చేశాడు శేఖర్ చివరికి.

"నేను నటించే ఆ రోజుల్లో నాకు తల్లి వేషం కట్టిన తారలింకా అమ్మ వేషాలు వేస్తూనే వున్నారు. వాళ్లెవరూ తెల్లరంగేసు కోవటం లేదు. ఎందుకని? గ్లామర్ పోతుందనే భయం. అదిపోతే ఈ చిత్ర రంగంలో మరి ఏనాటికీ పుట్టగతు లుండవ్. ఏమంటావు?" అంటూ మేకప్ మాన్ ముఖంలోకి చూసింది సవితాదేవి

చిన్నగా నవ్వి వూరుకున్నాడు శేఖర్.

"మీరే స్వయంగా డై పూసుకుంటు న్నారా అమ్మా?" మెరుపు తగ్గి అట్టలు కట్టినట్లున్న శిరోజాలని గమనిస్తూ అడి గాడు.

"లేదయ్యా! నా పాత మేకప్‌మాన్ గిరిబాబు–నీకూ తెలుసనుకుంటాను. పాపం అతనికీ నీలాగే మార్కెట్ లేదు. అతనే వారం రోజులకోసారి వచ్చి నాకు హేర్ డై చేసి పోతుంటాడు. ఒక్కరోజు ఆలస్యమైతే ఎంత చికాగ్గా వుంటుందను కున్నావు? వారం రోజుల్లో అంగుళం మేరకు పెరిగిన తెల్ల వెంట్రుకలు, ఆ తరువాత వాటి మీద పాతబడిన నలుపు రంగు డై... బ్లాక్ అండ్ వైట్" నవ్వుతూ చెబుతోంది–

"ఎనిమిదో రోజు అద్దంలో చూసు కుంటున్నప్పుడు నాకేమనిపిస్తుందో తెలుసా? నాకు మాత్రం వారం వారం వయసవుతూన్నట్టుగా వుంటుంది" అని పకపక నవ్వింది.

నిలువుటద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటోంది సవితాదేవి. పాతికేళ్ళ క్రితం పదహారేళ్ళ అమ్మాయిగా, బెదురు చూపులతో మేకప్ టెస్టు కోసమని ఈ స్టూడియోలోకి అడుగు పెట్టిన సంఘటన స్మృతిపథంలో మెదిలింది!

విజయవాడ నుంచి తండ్రితో మద్రాసు రావటం, డాన్సు నేర్చుకుని కొన్ని ఎమె చ్యూర్ నాటకాల్లో వేషాలు వెయ్యటం, తనతో నటించిన రాంప్రభు, తను ఒక్క సారే ప్రొడక్షన్ మేనేజరు సిఫారసుతో ఈ స్టూడియోకి రావటం అన్నీ చకచకా సినిమా దృశ్యాల్లా కళ్ళముందు కదులు

తున్నాయి. తనకీ, రాంప్రభుకీ ఒక్కసారే మేకప్ టెస్టు జరిగింది. తను సెలెక్ట యింది. ఫొటోజెనిక్ ఫేస్ లేదని రాంప్రభుని సెలెక్టు చెయ్యలేదు. అప్పుడు అతని మీద జాలేసింది తనకి.

"సార్! మీ అమ్మాయికి మంచి భవిష్యత్తు వుంది. కెమేరాకు తగ్గ గుండ్రటి ముఖం. మంచి ఎక్స్‌ప్రెషన్సు. చూస్తూ వుండండి. అవకాశం రావాలేగాని తొందర్లోనే తారాపథాన్ని చేరుకుంటుంది మీ అమ్మాయి'' తన మేకప్ స్టిల్సు చూస్తూ అన్నాడు రాంప్రభు. అతని పొగడలు ఆనాడు అతిగా అనిపించినా లోలోపల వుప్పొంగిపోయింది తను.

టి. ఆర్. రాజకుమారి మెల్లగా తప్పుకుంటున్న రోజులవి. కన్నాంబ తల్లి వేషాలకి దిగుతోంది.అంజలీదేవి,భానుమతి అభిమాన తారలుగా వెలుగుతున్నారు. మొదటి పిక్చర్‌లోనే కథానాయకి పాత్ర దొరికింది సవితాదేవికి. ఆ సినిమా తెలుగు, తమిళ భాషల్లో అఖండ విజయం సాధించింది. శరత్ చంద్రుడు సృష్టించిన ఆ పాత్రకి అనుభవంలేని అమ్మాయిని తీసుకోవటం తెలిసి తెలిసీ చేతులు కాల్చుకోవటమేనని కూసిన నోళ్ళే ఆ పాత్రలో సవితాదేవి జీవించిందని పొగిడేయి.

సవితాదేవితోబాటు కొంచెం వెనకముందులుగా వెండితెరకు పరిచయమైన నటీమణుల్లో వసంతమాల కొన్ని మంచి తమిళ చిత్రాల్లో నటించి, బాగా పేరు సంపాదించి హిందీ చిత్రాల్లో స్థిరపడ్డానికి బొంబాయి వెళ్ళిపోయింది. సవితాదేవి, ప్రియదర్శిని ఇద్దరూ వందకు మించిన చిత్రాల్లో కథానాయకి పాత్రలు ధరించి బ్రహ్మాండంగా రాణించారు. ప్రియదర్శిని మంచి నాట్యతార కూడా—

డైరెక్టర్, కెమేరామాన్, సౌండ్ రికార్డిస్టు, హీరోయిన్, ఆమె తల్లి, విలన్ అంతా రెడీ అయ్యారు. ఆఫీసు గదికీ, సెట్‌కీ మధ్య హడావుడిగా తిరుగుతున్నాడు ప్రొడ్యూసర్ నందలాల్. అంతా హీరో కోసం ఎదురు చూస్తున్నారు. కృష్ణమోహన్ అందరితోటీ చాలా వుత్సాహంగా, కలుపుగోలుగా మాట్లాడేస్తున్నాడు. చాలా మంచివాడని చిత్ర పరిశ్రమలో పేరుంది అతనికి. ముప్ఫై యేళ్ళగా సినిమాల్లో విలన్‌గా నటిస్తున్నాడు. సవితాదేవి సరసన విలన్‌గా చాలా చిత్రాల్లో పాత్రలు ధరించాడు.

తల్లి వేషంలో సెట్లోకి ప్రవేశించిన సవితాదేవిని చూడగానే అప్రయత్నంగా అతని కళ్ళు చెమర్చాయి. రెండు గంటల మేకప్‌కీ, పాన్‌కేక్‌లకీ, రోజ్ పవుడర్‌కీ, గ్రీస్‌లకీ వేటికీ లొంగకుండా ఆమె కళ్ళ కింద నల్లటి చారల ముడుతలు కనిపిస్తున్నాయి.

''పాల బుగ్గలతో పసిడి బొమ్మలా వుండేదానివి. ఎట్లాగయిపోయావు!" అనేసీ వెంటనే అలా అన్నందుకు నొచ్చుకుంటూ "కూర్చోమ్మా సవితా" అని సాదరంగా కుర్చీ చూపించాడు కృష్ణమోహన్.

''ఎన్నో యేళ్ళయింది బాబాయ్ మిమ్మల్ని చూసి. అప్పుడూ ఇప్పుడూ ఒకేలా వున్నారు" అన్నది అతనికేసి చూస్తూ ఆప్యాయంగా.

"ఏళ్ళు గడిచినా వయసు గడిచినట్టు అనిపించటంలేదు మిమ్మల్ని చూస్తుంటే"

"మనిషికి దిగులు, విచారం అనేవి వుంటున్నప్పుడు నిమిష నిమిషానికీ వయసు ముదురుతున్నట్టే వుంటుంది. నీ కష్టాల గురించి వింటూనే వున్నానమ్మా''

"పోనీలే బాబాయ్" అని కొద్ది క్షణాల మౌనం తరువాత "మీకు కష్టాలే లేవా బాబాయ్ ?" అనడిగింది.

"లేకేమమ్మా. వున్నాయి. అయితే నా పరిమితులేమిటో, హద్దులేమిటో నేను గ్రహించగలిగాను. అంచేత నా జీవితాన్ని అతి జాగ్రత్తగా కొలిచి మలుచుకున్నాను. నీకు తెలుసుగా - విలన్‌గా నేనీ రంగ ప్రవేశం చేశాను.

"విలన్‌గానే-తెరమీదే అనుకో-జీవిసున్నాను. విలన్‌గానే నిష్క్రమిస్తానేమో ! కాని ఈ ప్రపంచాన్ని వదిలేటప్పుడు మాత్రం నేను విలన్ కాకుండా వుండాలని కోరుకుంటూ వుంటాను. తెరమీద నన్ను చూచి తిట్టుకునే ప్రేక్షకులు, నా చితిమీద కన్నీళ్ళు కారుస్తూ వుంటే చూడాలని ఓ పిచ్చి కోరిక కలుగుతూ వుంటుంది అప్పుడప్పుడూ" ఎంతో లోతైన విషయాల్ని కూడా తేలిగ్గా తమాషా చేసి చెప్పటం అతనిలోని ప్రత్యేకత.

"నేను కోరికల్ని పెంచుకుని కష్టాల్ని కొని తెచ్చుకున్నాను బాబాయ్" అంది సవితాదేవి విషాదంగా నవ్వి.

"నో..నో...కోరికలకూ, కష్టాలకూ సంబంధంలేదు సవితా. న్యాయమైన కోరికలు పెంచుకోవటం తప్పులేదు."

"అలవికాని కోరికలు కోరటం తప్పుకాదా బాబాయ్ ?"

"నీవి గొంతెమ్మ కోరికలని నేననుకోను సవితా. మన కష్టాలకీ, దురదృష్టాలకీ మనమే కరలం అనుకోవటం పొరపాటు. బాహ్యశక్తులు కొన్ని మన జీవితాల్ని వంచనకూ, విషాదానికీ గురి చేస్తున్నాయి. మన చుట్టూ వున్న సమాజం, మనతో మసిలే మనుషులు, మన జీవితాల్ని శాసిస్తూ వుంటారు. మెలకువ వుండకపోతే ఓటమి తప్పదు. ఒక రకంగా మనమింకా ఆటవిక దశలోంచి బయట పడలేకపోతున్నామని అనిపిస్తూ వుంటుంది నాకు. 'జంగిల్‌లా' ఇంకా ప్రివైల్ అవుతూనే వుంది మనమధ్య"

"పెద్దపెద్ద మాటలు వాడేస్తున్నారు" అంది సవితాదేవి. నిజంగా ఆమెకు అతడు చెప్పింది కొంత అర్థం కాలేదు.

"మచ్చుకి ఈ చిన్న విషయం తీసుకుందాం. ఉదయం ఎనిమిదికల్లా సెట్స్ మీద రెడీగా వుండమన్నారు మనల్ని. గంట ముందుగానే తయారై వచ్చేశాం. ఇప్పుడు గంట పదకొండు. మూడుగంటల్నించీ ఈ వుక్కలో, ఈ విగ్గులతో చెమటలు కారుకుంటూ హీరో రాక కోసం పడిగాపులు కాస్తున్నాం. అతనెప్పుడు ఎంత ఆలస్యంగా వచ్చినా ఎవరూ అతన్ని పల్లెత్తు మాట అనలేరు. అదే చిన్న ఆర్టిస్టులు అయిదు నిమిషాలు లేటుగా వచ్చినా బూతులు తిడతారు. ఈ పరిస్థితికి కారణం ఎవరంటావు ?"

ఉన్నట్టుండి సెట్ వాతావరణంలో మార్పొచ్చింది. హీరో ప్రకాష్ వేంచేశాడు. హీరోయిన్ శోభారాణితో సహా అంతా లేచి నిలబడి నమస్కారం చేశారు.

సవితాదేవి, కృష్ణమోహన్‌లు మాత్రం ఇది గమనించకుండా వాళ్ళ సంభాషణలో మునిగి వుండటాన్ని ఓర కంటితో చూచి ముఖం చిట్లించాడు ప్రకాష్.

వినయంగా అతని దగ్గరకెళ్ళి నిలబడ్డాడు దశరథరామయ్య.

"ప్రారంభిద్దామంటారా ?"

"ఓ.కే. అయామ్ రెడీ. నామూలంగా ఆలస్యం కాకూడదనే ఇంటిదగ్గరే మేకప్ ముగించుకుని వచ్చేశాను" అంటూపక్కనే



చేతిలో స్క్రిప్టు కాయితాలతో నిలబడి వున్న మూర్తికేసి చూసి "డైలాగ్సు నువ్వేనా ?" అని అడిగాడు. అవునన్నట్లు బెరుగ్గా తలాడించాడు మూర్తి.

"ఓకె...ఓకె...అన్నట్టు ఇప్పుడు నేనేం చేయాలి ? డైలాగ్సేమిటి ?"

"మరండీ...మరండీ..." నీళ్ళు నములుతూ డైరెక్టరుకేసి చూశాడు మూర్తి.

దశరధరామయ్య ముందుకొచ్చి షాట్ వివరించేడు.

"మీరిప్పుడు బెరుగ్గా, సంకోచంతో అత్తగారింట్లోకి ప్రవేశిస్తారు"

"ఎవరిల్లు ?"

"మీ అత్తగారిల్లు. అంటే ఆమె కూతురినే మీరు ప్రేమిస్తున్నారు. పెళ్ళి చేసుకుంటానని అడగటానికి వస్తున్నారు. అక్కడితో మొదటిషాట్ అయిపోతుంది"

"ఓకే. ప్రారంభించండి" గ్రీన్ సిగ్నలిచ్చేడు హీరో.

"సైలెన్స్...లైట్సాన్..సౌండ్ రెడీ"

ప్రకాష్ ముఖంమీద పడే వెలుతురుని వెలుగు కొలిచే సాధనంతో సరి చూసుకున్నాడు కెమేరామాన్. పైన చెక్కల మీద నిలబడిన లైట్‌బాయ్‌కి సూచనలిచ్చేడు కెమేరా అసిస్టెంటు.

"నెంబరు ట్వంటీటూ ఆన్"

పైనుండి ప్రకాశవంతమైన వెలుతురు హీరో నిలబడిన స్థలంమీద పరుచుకుంది.

"రెడీ, సైలెన్స్" పెద్దగా అరిచాడు దశరథరామయ్య.

"వన్ మానిటర్ ప్లీస్"

బయటినించి ప్రకాష్ సంకోచిస్తూ, దిక్కులు చూస్తూ అత్తగారింట్లోకి ప్రవేశిస్తున్నాడు.

"దట్స్ రైట్ అలాగే చెయ్యండి. టేక్ చేద్దాం" అన్నాడు డైరక్టర్.

"స్టార్ట్...క్లాప్"

"షాట్ వన్...టేక్ వన్ కెమేరా" ముందు క్లాప్ కొట్టి వేగంగా పక్కకి తప్పుకున్నాడు అసిస్టెంటు.

"యాక్షన్"

ప్రకాష్ ఈసారి ఫైనల్‌గా బయటనించి దిక్కులు చూస్తూ సంకోచిస్తూ సెట్ లోపలికొస్తున్నాడు.

"కట్...కట్..." తృప్తిగా ఘన విజయం సాధించిన వానిలా ప్రకాష్‌వేపు చూశాడు దశరథరామయ్య.

"ఎక్సెలెంట్ సార్" అని షాట్ వన్ టేక్ వన్ ఓకే" అన్నాడు మైకులో విన బడేలా బిగ్గరగా.

"గుమ్మంలోంచి హాల్లోకి వస్తున్నప్పుడు మీరు చూపించిన ఆ ఎక్స్‌ప్రెషన్స్ వున్నాయి చూశారూ...ఈ షాట్‌లో చప్పట్లతో థియేటర్ మోగిపోతుందనుకోండి" వంత పాడేడు డయలాగ్ రైటర్ మూర్తి, చిర్నవ్వుతో ఆ పొగడ్తని అందుకున్నాడు ప్రకాష్.

చిత్రరంగంలో చిత్రమేమిటంటే ఈ రకమైన భట్రాజు పొగడ్తలు కేవలం ముఖస్తుతికే అనే విషయం పొగిడేవాళ్ళకీ, పొగిడించుకునే వాళ్ళకీ ఇద్దరికీ తెలుసు, అయినా పొగిడించుకోవటం పెద్ద వాళ్ళకి ఆనందం, పొగడకుండా వుండటం చిన్న వాళ్ళకి అనివార్యం.

ఆ సీన్‌లోహీరో మొదటిసారిగా తన మేనత్తను కలుసుకుంటున్నాడు. అత్తగా సవితా దేవి. ఆమె కూతురుగా శోభా రాణి.

ప్రేయసీ ప్రియులుగా, భార్యాభర్తలుగా ప్రకాష్, సవిత దాదాపు పాతిక చిత్రాల దాకా నటించి వున్నారు. ఇద్దరూ రెండు మూడేళ్ళ తేడాతో తెరకి పరిచయమైన వాళ్ళే అయినా ప్రకాష్‌కన్న సవితా దేవి రంగంలో ముందుగా స్థిరపడింది. నటిగా మంచి పేరు తెచ్చుకుంది.

ఇద్దరూ జంటగా నటించిన మొట్టమొదటి చిత్రం అఖండ విజయం సాధించటంతో ఇద్దరి కాంబినేషన్‌తో వరసగా పాతిక చిత్రాలు... చివరి చిత్రం మాత్రం ఏ కారణంచేతో మూడు వారాల

కంటే ఎక్కువ పోలేదు.

ఆ దెబ్బతో ప్రకాష్ తన జంటని మార్చేసుకున్నాడు. సవితాదేవి స్థానంలో ప్రియదర్శినిని ఎంచుకున్నాడు. ఎవరో ప్రముఖ జ్యోతిష్కుణ్ణి సంప్రదించి ఈ నిర్ణయం తీసుకున్నట్టు కొందరు సినీ వార్తాహరులు గుసగుసలు కూడా పోయారు ఆ రోజుల్లో.

సొంతంగా నిర్మించిన సవితాదేవి చిత్రం విజయవంతం కాలేదు. బాగా నష్ట పోయింది ఆమె. అయినా జంక లేదు. పట్టుదలతో రెండో చిత్రం తీసింది. అందులో ప్రకాష్‌నే హీరోగా తీసుకుంది. భారీ యెత్తున నిర్మించాలనే ప్రయత్నంలో విపరీతమైన వడ్డీలకి లక్షలు అప్పు తెచ్చింది. తెలుగులో సిల్వర్ జూబిలీ హిట్ అయి చిన్న చిన్న వూళ్ళలో సైతం వందరోజు లాడి నిర్మాతలకు లక్షలార్జించి పెట్టిన ఓ చిత్రాన్నే తమిళంలో నిర్మించటానికి తలపెట్టింది రెండు కారణాలు ఆమెని అందుకు పురి కొల్పినయ్. తనకి బాగా నచ్చిన బల మైన కథ. చాలా కాలం తర్వాత తన నటనా కౌశలాన్నంతటినీ ప్రదర్శించటానికి అనువైన, బరువైన పాత్ర. తెలుగు చిత్రంలో జమీందారుగారి అమ్మాయిగా తన నటన వున్నత శిఖరాలను అందుకుంది. కొన్ని దృశ్యాల్లో నటిస్తున్న ప్పుడు తను నిజంగా కదిలిపోయింది. పరిసరాలను మరిచి ఎమోషన్సులోకి వెళ్ళిపోయి నటించటానికి బదులు పాత్రలో ఐక్యమైపోయేది. షాట్‌కీ షాట్‌కీ మధ్య తనని మామూలు మూడ్‌లోకి రప్పించ టానికి డైరక్టరూ, కెమేరామాన్ చాలా ఇబ్బంది పడిపోయేవారు. తెలుగుచిత్రంలో తనతో హీరోగా లోకేశ్వరరావు నటిం చాడు. తెలుగులో అతను పోషించిన పాత్రల్ని తమిళంలో ప్రకాష్ నటించటం రివాజు. అలాంటి తమిళ చిత్రాలు చాలా విజయవంతమైనాయి. అంచేత తమిళ చిత్రానికి అతన్నే హీరోగా తీసుకుంది సవితాదేవి. కాని ఆమె అంచనాలన్నీ తారుమారైనయ్. ఫైనాన్స్ సకాలంలో అందకుండా పోయింది. ఫలితంగా యేడాదిలోగా పూర్తి చెయ్యాలనుకున్న చిత్రం విడుదలయ్యేసరికి అయిదేళ్ళు పట్టింది. గోదావరి లంకలు, తెరచాప పడవలు, ఆ కొబ్బరి తోటలు—— తెలుగు దేశానికే పరిమితమైన ఆ అందమైన సజీవ వాతావరణం తమిళ చిత్రానికెక్కడా అతకలేదు. తెలుగు ప్రేక్షకులచేత బ్రహ్మాండంగా ఆదరింపబడిన ఆ చిత్రం తమిళ ప్రేక్షకుల తిరస్కారానికిగురైంది. అయిదేళ్ళలో ప్రేక్షకుల అభిరుచుల్లో ఏర్పడిన మార్పులు కూడా ఆ చిత్ర అపజయానికి కొంత దోహదం చేశాయి.

రెండో చిత్రం కూడా ఘోరంగా దెబ్బ తినడంతో ఆర్థికంగా, మానసికంగా కుంగిపోయింది సవితాదేవి. పిక్చర్ రిలీజు కావటానికి ముందే తనకి రావలసిన మొత్తాన్ని పైసా తగ్గకుండా వసూలు చేసుకోగలిగాడు ప్రకాష్ తన పవరాఫ్ అటార్నీ అయిన కోటిలింగం ద్వారా. కోటిలింగం ప్రకాష్ బాబుకి స్వయానా బావమరిది.

"ఓ! అయామ్ సో సారీ సవితా! ఈ కోటిలింగం ఇంత పనిచేసాడనుకోలేదు అయామ్ హెల్ప్‌లెస్. పవరాఫ్ అటార్నీ ఇచ్చేసినప్పట్నుంచి అన్నీ వాడి చేతి మీదుగా జరిగిపోతున్నాయి. ఎనీవే,

విష్ యు ఆల్ ది బెస్ట్ నెక్స్ టైం" అంటూ మొసలి కన్నీళ్ళు కార్చేడు ప్రకాష్ అప్పుడు.

ఈ సినిమాలో విజయ్ తన అత్త కూతుర్ని ప్రేమించాడు. ఇద్దరూ పెళ్ళాడా లని తీర్మానించుకున్నారు. కాని వాళ్ళ ప్రేమకి ఆమె అడ్డుగా నిలిచింది. ఈ రోజు షూటింగులో హీరోయిన్ ఇంట్లోకి ప్రవేశించిన విజయ్ జేవురించిన ముఖంతో హాల్లో సోఫా పక్కన నిలబడి వున్నాడు. అతనికి కొంచెం దూరంలో హీరోయిన్ దిగులుగా గోడ నానుకుని నిలుచుంది. హీరోయిన్ తల్లి వేషంలో సవితాదేవి మేడమెట్లు దిగుతూ విజయ్‌ని చూస్తుంది.

"ఆగు" గర్జించింది ఆమె.

నివ్వెర పోయి తల్లి ముఖంలోకి చూస్తోంది హీరోయిన్.

"ఆనాడు తను చేయని నేరానికి ఆయన జైలు పాలై నేనూ,నా కూతురూదిక్కులేని వాళ్ళమైనప్పుడు ఏమైనాయి బాబూ ఈ అభిమానాలన్నీ? మీ అమ్మా, నాన్నా ఆనాడు మమ్మల్నెంత అవమానించింటీ అప్పుడే మర్చిపోయావా? ఈనాడు పరి స్థితులు మారినాయి. ధన, మదాంధతతో ఆనాడు కళ్ళు కానకుండా ప్రవర్తించిన మీ నాన్నకి ఇప్పుడు మా సంబంధం కావాల్సి వచ్చిందా?" అంటూ ఒక్కొక్క మెట్టే దిగుతోంది సవితాదేవి. మూడు ముఖ్యమైన పాత్రల్ని ఫ్రేం చెయ్యా ల్సిన మిడ్ లాంగ్ షాట్ అది. కెమేరా క్రేన్ మీద వుంచబడింది. సవితాదేవి సంభాషణలు చెబుతూ మెట్లు దిగుతున్న ప్పుడు క్రేన్ మెల్లగా కిందికి జరుగుతూ



షాట్ తీయాలి. రెండుసార్లు రిహార్సల్స్ చేయించాపు. సవితాదేవి బహు చక్కగా చేసింది. డైలాగ్ డెలివరీ, ఫేషియల్ ఎక్స్‌ప్రెషన్సు పాత సవితాదేవిని తల పింపజేశాయి. గతించిన కాలం గాని, అనుభవించే పేదరికంగాని సవితాదేవి లోని నటనా నైపుణ్యానికి ఏ విధమైన భంగాన్ని కలిగించలేదన్న సంగతి గమ నించి చకితుడైనాడు ప్రకాష్.



కెమేరాలో ఫిలిం రోలు తిరగటం ప్రారంభమైంది. టోన్ మాడ్యులేషన్సుతో సంభాషణలు చెబుతూ మెట్లు దిగుతోంది సవితాదేవి. అయిదారు మెట్లు దిగిందో లేదో కాళ్ళు తడబడినాయి. కళ్ళు తిరిగి నట్లయింది. మెట్ల మీద పడిపోయింది సవితాదేవి.

"కట్ ...కట్ ..." కేక పెట్టాడు దశరధరామయ్య.

కెమెరా తిరగటం ఆగిపోయింది. ఫోకస్ లైట్లు ఆరిపోయినాయి. ఒక్క టాప్ లైటు మాత్రమే వెలుగుతోంది. వేగంగా మెట్లెక్కి వెళ్ళాడు ప్రకాష్. సవితాదేవి భుజం కిందుగా చేయివేసి లేపి కూర్చోబెట్టాడు.

"కాలు జారింది. క్షమించండి" హీన స్వరంతో రొప్పుతూ పలికింది సవితా దేవి.

"ఎందుకిలా తాగొచ్చి రసాభాస చేస్తున్నావు సవితా?" మృదువుగా మందలిస్తూ అన్నాడు ప్రకాష్‌బాబు.

దీనంగా అతని ముఖంలోకి చూసింది సవితాదేవి. "ఇంత కాలం తర్వాత మళ్ళీ వేషం కడుతున్నాను కదా అని ఎంతో జాగ్రత్తపడి, తాక్కుండావచ్చాను ప్రకాష్. తాగి వుంటే ఇలా తడబడి వుండేదాన్ని కాదు. నా మాట నమ్ము"

"అయితే నేను విన్నది నిజమేనన్న మాట. తాగుబోతువైపోయావా సవితా?"

సవితాదేవి మౌనంగా అతనికేసి చూస్తోంది. కొడైకెనల్‌లో అవుట్‌డోర్ షూటింగు. ఒక పెద్ద బంగళాలో ఆర్టిస్టులంతా విడిది చేసి వున్నారు. ఆ రాత్రి డైరక్టర్ పార్టీ ఇస్తున్నాడు షూటింగు విజయవంతంగా ముగిసిన సందర్భాన్ని పురస్కరించుకుని. స్కాచ్ విస్కీలో ఐస్ ముక్కల్ని జారవిడిచి సవితాదేవి కళ్ళల్లోకి చూస్తూ ఆమె చేతికి గ్లాసు అందిస్తున్నాడు ప్రకాష్.

"అబ్బే వద్దండీ! నా కలవాటు లేదు" అన్నది సవితాదేవి చేతిని అడ్డంపెట్టి.

"ఏమిటి బ్రదర్? సవితాదేవిని మరీ ఇంత కండిషన్‌లో పెట్టేశావు?" రాంప్రభుని కొంటెగా చూస్తూ అన్నాడు ప్రకాష్.

"ఆర్టిస్టంటే డైవర్షన్ కావాలి కదా! లేకపోతే లైఫ్ స్టేలయిపోదూ! మితిమీరిన సంతోషం కలిగినా, భరించరాని దుఃఖం ముంచుకొచ్చినా మనిషిని స్థిరంగా వుంచడానికి ఈ మందుతో సమానమైంది మరోటి లేదు. యామై రైట్?" అని రాంప్రభుకేసి చూశాడు.

"కొంచెం తీసుకో సవితా. ఏమీ కాదులే" ప్రోత్సహించాడు రాంప్రభు.

"చీర్స్ ఫర్ ది హెల్త్ ఆఫ్ ది ప్రొడ్యూసర్ అండ్ ది డైరక్టర్ అండ్ ఆల్సో మిస్-అయామ్ సారీ మిసెస్ సవితాదేవి" అంటూ గ్లాసు పైకెత్తి పట్టుకున్నాడు ప్రకాష్-తన తాగుడు అలవాటుకి జరిగిన ఆనాటి ప్రారంభోత్సవాన్ని తల్చుకుని చిన్నగా నవ్వుకుంది సవితాదేవి.

"నీ దగ్గర ఇప్పుడేమైనా డ్రింక్స్ వున్నాయా ప్రకాష్?" అని మెల్లగా అడిగింది.

"ప్లీజ్! తాగితే గాని ఇప్పుడు లేచి నిలబడ లేని స్థితిలో వున్నాను ప్రకాష్. ఇలా చూడు" అంటూ వొణికే చేతి వేళ్ళని ముందుకి చాచింది. ఆ చేతి వేళ్ళని కళ్ళ కద్దుకుని ప్రేమ డైలాగులు పలికిన చిత్రాల్లోని దృశ్యాలు గుర్తుకి తెచ్చుకున్నాడు ప్రకాష్.

అంతటి వరకూ ఒక మూలగా ఒదిగి దిగులుగా నిలబడివున్న కుప్పుసామి ఫ్లాస్కుతో యజమానురాలి దగ్గరకొచ్చి నిలబడ్డాడు. మూత తీసి అందులో కొద్దిగా పోసి ఆమె చేతికిచ్చాడు. గుప్పుమని కొట్టిన వాసనకి చీదరించుకుంటూ ముఖం పక్కకి తిప్పుకున్నాడు ప్రకాష్‌బాబు.

"ఏమిటి! కాపు సారానా?"

"ఏం చెయ్యను చెప్పు? మంచిది దొరకటంలేదే?"

అంతటి విషాదంలోనూ తమాషాగా నవ్వింది సవితాదేవి.

"మీ అందరికీ నేను వయసు ముదిరిన దాన్ని. అమ్మ వేషాలూ, అత్త వేషాలూ మాత్రమే వెయ్యటానికి పనికొచ్చే వయసు నాది. కాని గవర్నమెంటు లెక్కల ప్రకారం నా కింకా నలభై అయిదు నిండలేదు. పర్మిట్ ఎలా వస్తుంది. ప్రకాష్?" అంటూ లేచి నిలబడింది.

"డైరక్టర్ సార్! నేను రెడీ. ఇబ్బందికి క్షమించండి"

"ఆల్ రైట్... సైలెన్స్..."

"స్టార్ట్"

"షాట్ సిక్స్, టేక్ టూ"

మధ్యాహ్నం భోజనాల టైం. కాసేపు విరామం. తనకోసం ప్రత్యేకించబడిన ఏ.సి. గదిలోకి వెళ్ళిపోయాడు ప్రకాష్. అతనికీ, శోభారాణికీ, కృష్ణమోహన్‌కీ వాళ్ళ వాళ్ళ ఇళ్ళ నుంచి భోజనాలు వచ్చాయి. సవితాదేవికి కంపెనీ వాళ్ళేర్పాటు చేసిన క్యారీయర్ భోజనం వచ్చింది.

భోజనాలైం తరువాత అంతా లాన్‌లో చెట్టుకింద నీడలో కూర్చున్నారు. బ్రీఫ్ కేసులోంచి విస్కీ సీసా తీసి కొద్దిగా గ్లాసులో పోసి సవితాదేవికిచ్చాడు ప్రకాష్. కృష్ణ మోహన్‌కి తాగే అలవాటులేదు. సినిమాల్లో తాగుబోతుగా నటించడంతో సరి. నిజ జీవితంలో సిగరెట్ కూడా కాల్చడు అతను.

"ఏదైనా ఒక లిమిట్‌లో వుంచుకుంటేనే మర్యాదని నిలుపుకోగలుగుతాం" అన్నాడు ప్రకాష్ గ్లాసుని ఆమె చేతికిస్తూ.

"నిలుపుకోడానికి నా దగ్గర ఏం మిగిలిందని" ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీచేసి అన్నది సవితాదేవి. తన గ్లాసు కూడా పూర్తిచేసి, అందంగా వంపులు తిరిగివున్న ఆ విదేశీ విస్కీ బాటిల్‌ని ముచ్చటగా ముద్దులాడి పెట్టెలో పెట్టి డ్రైవర్ చేతికిచ్చాడు ప్రకాష్.

"నేనిప్పుడు మీకో ముఖ్యమైన విషయం చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు వుపన్యాస ధోరణిలో.

"సవితాదేవిని కలుసుకునే సందర్భం కోసం నేను చాలాకాలం నించీ ఎదురు చూస్తున్నాను. ఈనాడు ఆ అవకాశం లభించింది. మనసు విప్పి కొన్ని సంగతులు ఇప్పుడు చెప్పాలనిపిస్తోంది. అది నా బాధ్యత కూడా! ఈ ఫీల్డులో నా తోబుట్టువులుగా నేను భావించే వాళ్ళలో సవితాదేవికూడా ఒకతె. ఇప్పుడామె చాలా కష్టాల్లో మునిగి వుందని నాకు తెలుసు. ఆమెకి సహాయపట్టం ఆర్టిస్టుగా నా కర్తవ్యం. కాని...కాని...నేను ఆశక్తుడ్ని అయామ్ ఇనె హెల్ప్‌లెస్ సిట్యుయేషన్. కారణం మీ కందరికీ తెల్సు నేనిప్పుడు పూర్తిగా మా బామ్మర్ది కోటిలింగంగాడి అధీనంలో వున్నాను. వాడు నా పవర్ ఆఫ్ అటార్నీ హోల్డరు. ఏం చెయ్యను? వాడి దగ్గర నెల జీతం తీసుకుంటూ వుండే పరిస్థితి నాది."

"నేను మిమ్మల్నిగానీ, మరెవరినిగానీ సహాయం కోరలేదే" అన్నది సవితాదేవి అభిమానంతో.

"నువ్వు కోరేవని నేననటంలేదు సవితా!అయినా సహాయపట్టం నా బాధ్యత కాదంటావా? అడక్కుండా చేసేదే అసలైన సహాయం అవుతుంది. కాని నా పరిస్థితులు అందుకు అనుకూలంగా లేవనేదే నా విచారం" అతని సంభాషణ చిరాకు కలిగించింది కృష్ణమోహన్‌కి.

"ఈ శోభారాణికో ధర్మ సందేహం వచ్చి పడిందండీ. నా నటనను మాత్రమే అనుకరించమ్మా అని సవితాదేవి దీవించిందట.అసలు దీని వెనుక దాగిన గూఢార్థమేమిటో పాపం ఈ పిల్లకి అంతు చిక్కటంలేదు" అంటూ శోభారాణికేసే చూస్తూ నవ్వాడు కృష్ణమోహన్.

"చూడమ్మాయ్! ఎందుకైనా మంచిది నువ్వుకూడా వెంటనే ఓ పవరాఫ్ అటార్నీని ఏర్పాటు చేసుకో. తమ్ముడో, అన్నో, బాబాయో, బామ్మరిదో ఎవరో ఒకరు వుండకుండా పోరు. వాళ్ళలో ఒకడ్ని కొంచెం నమ్మకంగా వుండే వాడిని చూసి నియమించుకో. వాడి దగ్గర నెల జీతం తీసుకుంటూ వుండు. నీ తరఫున అగ్రిమెంట్లు చెయ్యటం, లక్షల లక్షలు వసూలు చేసుకోవటం, నలుపుని తెలుపు చెయ్యటం, అన్నీ అతనే చూసుకుంటాడు. నీకు మాత్రం నెలనెలా వెయ్యో, రెండు వేలో జీతం పారేస్తాడు. మిగిలిందంతా భద్రంగా ఆస్తుల రూపంలో నీ పేర, మీ వాళ్ళ పేర జాగ్రత్త చేస్తాడు. ఈ తెలివితేటలు లేకే వంద చిత్రాల్లో నటించిన ఈ మెద్దు ఈనాడిలా బికారిగా తయారైంది."

"బికారిగా తయారైనా ఎవర్నీ బిచ్చమడగటం లేదు బాబాయ్! నన్ను గురించి చర్చించకండి దయచేసి"

"ఏమిటి మిస్టర్ కృష్ణమోహన్! నా మీద పట్టిస్తున్నారు ?" నవ్వటానికి ప్రయత్నిస్తూనే మందలింపు ధ్వనించేలా అన్నాడు ప్రకాష్.

"ఎవర్నీ కించపరచాలన్నది నా వుద్దేశం కాదు. నిజం చెపుతున్నాను. దీపముండగా ఇల్లు చక్కబెట్టుకోవటంలో తప్పులేదు. ముఖ్యంగా పి.ఎఫ్‌లూ, పెంక్షన్‌లూ లేని మనలాంటి ఆర్టిస్టులు. సవితాదేవి కేర్పడిన విపరీతం ఈ రోజుల్లో జరగాల్సింది కాదు. కాని జరిగింది. ప్రసిద్ధిగాంచిన నటుడుగాని, నటిగాని చివరి రోజుల్లో దారిద్ర్యానికి గురి కావటమనేది పాతకథ. త్యాగరాజ భాగవతార్, కాంచనమాల, ఎస్. ఎస్. కృష్ణన్‌ల కథలు పునరావృతం కావడానికి వీల్లేని కాలమిది. వాళ్ళ జీవితాలని గుణపాఠంగా తీసుకుని చాలా తెలివిగా జాగ్రత్త పడుతున్నారు ఇప్పటి నటీనటులు. నన్ను కూడా కలుపుకునే అంటున్నాను. చంద్రబాబు, సవితాదేవి మాత్రం మినహాయింపులుగా మిగిలిపోయారు" అని కొంచెం ఆగి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు కృష్ణమోహన్.

"ఇప్పుడు ఆర్టిస్టులు నటన మీద మాత్రమే ఆధారపట్టంలేదు. నటనద్వారా సంపాయించే ధనాన్ని పరిశ్రమల్లో పెట్టుబడిగా పెడుతున్నారు. వ్యాపారాల్లో భాగస్తులవుతున్నారు. మరి కొందరు బుద్ధిమంతులు రాజకీయాలకి కూడా మూలధనంగా వాడుతున్నారు. ఈ మాత్రం జాగ్రత్తపడటం తెలీని చంద్రబాబు పైసా కూడా మిగుల్చుకోలేక చచ్చిపోయాడు. సవితాదేవి చావుకీ బతుక్కీ మధ్య నలిగిపోతూ వుంది" అందరిమధ్యా కాసేపు విషాద వాతావరణం అలుముకున్నట్లయింది.

"కళాకారుని జీవితానికి రక్షణ లేకుండా పోయింది" అన్నాడు ప్రకాష్.

"కళాకారులకేనేమిటి ? ఈ సమాజంలో ఏ మనిషికీ రక్షణలేదు. అంచేతే దొరికినంతవరకూ చేజిక్కించుకోమని

దీపం వుండగానే ఇల్లు సర్దుకోవాలనే సామెతని కూడా పుట్టించారు మనవాళ్ళు. మొన్నీమధ్య రష్యాకి వెళ్ళి వచ్చిన విశ్వనాథ్ అంటూ వుంటే విన్నాను. అక్కడి కళాకారులగ్గాని, ఇతర వృత్తుల వాళ్ళకిగానీ బ్రతుకుమీద భయం లేదు. వాళ్ళకి దీపం వుండగానే ఇల్లు సర్దుకోవాల్సిన అవసరమూ లేదు. ఎంచేతంటే వాళ్ళ జీవితాల్లో చీకటి ప్రవేశించే అవకాశం లేదు"

"కాని అక్కడి కళాకారులకి భావ స్వాతంత్ర్యం వుండదు" అంటూ అడ్డొచ్చాడు ప్రకాష్.

"నిజమే! డిమాండ్ వుంది కదా అని ఒక పిక్చర్‌కి లక్షలిమ్మని అడిగే స్వాతంత్ర్యం వాళ్ళకి లేదు. అన్ని సినిమాల్లోనూ హీరో వేషాలే వేస్తానని చెప్పే అధికారంగాని, తన ఇష్టాయిష్టాలని బట్టి కథనీ, ఆర్టిస్టుల్ని మార్చమని చెప్పే స్వాతంత్ర్యంగాని అక్కడి వాళ్ళకి లేదు మరి. మనకిక్కడ బోలెడు స్వాతంత్ర్యం వుంది. కాని అది కొందర్ని ఆకాశాని కెత్తేస్తూ, మరి చాలామందిని అధః పాతాళానికి తొక్కేస్తూ వుంది. అసలు చిక్కంతా ఇక్కడే" అన్నాడు కృష్ణమోహన్.



సవితాదేవి అడయారు బంగళాలో ఎప్పుడూ ముప్ఫై నలభై మందికి తక్కువగాకుండా వుండేవారు. కాల్‌షీట్లు నిర్ణయించటానికి, వాటికి సంబంధించిన డైరీ వగైరాలు మెయింటైన్ చెయ్యటానికీ వెంకట్రాఘవన్; జమా ఖర్చులు, ఇన్‌కమ్‌టాక్సు విషయాలు చూసుకోవటానికి రామస్వామి బికాం.; ఆస్తిపాస్తుల వివరాలు గమనించటానికి రామలింగం; వంటావార్పుకి ఒక ఆడమనిషి, ఇద్దరు నాయకులు; బజారుకి వెళ్ళి సామాన్లు అవి తేవడానికి ఓ కుర్రాడు; గార్డెనింగ్‌లో డిప్లొమా పొందిన ఒక తోట మనిషి, అతనికి ఇద్దరు అసిస్టెంట్లు; కాపలాకి గేటు దగ్గర ముగ్గురు నేపాలీ గూర్ఖాలు; షూటింగులప్పుడు తన పక్కనే వుండి మేకప్ సామానులు, అద్దం వగైరాలు అందివ్వటానికి ఒక అందమైనఅమ్మాయి; చిన్న చిన్న పనులు చేసిపెట్టడానికి పిలిస్తే పలికే ఒక పసివాడు– వీళ్ళందరి చేతా పనులు చేయించడానికి మేనేజర్ లింగమూర్తి; షెవర్‌లెట్‌కి ఒక డ్రైవరు, ప్లిమౌతుకి ఒక డ్రైవరు, కొడుకు స్కూల్‌కి వెళ్ళిరావటానికి ఫియట్‌కి ఒక డ్రైవరు, ఈ మూడు కార్లని తుడవడానికి ఒక క్లీనరు, రిపేర్లకి ఓ మెకానిక్కు, ఇల్లు తుడవడానికి, చిమ్మటానికి ఇద్దరు ఆడపిల్లలు...వీరుగాక తండ్రి, తండ్రి తోబుట్టువె ఎవరికో ఇల్లాలై ఏ కారణం చేతో భర్తచేత వదలి వేయబడి తండ్రితో బాటు తన పంచన జేరిన మేనత్త.

ఆమె సంతానం అడయారు బంగళాలో గృహప్రవేశం చేసింది మొదలు ఓ దురదృష్ట ఘడియలో ఆ భవంతిని వదిలి వచ్చేసిన నాటిదాకా అందరికీ తను ఆశ్రయమిచ్చింది.

ఎవరెవరు బంధువులు, ఎవరు దాసీ

జనం ఏం పన్లు చేస్తున్నారు, ఎంత జీతం పుచ్చుకుంటున్నారు మొదలైన వివరాలన్ని సవితాదేవికి తెలియవు. తెలుసుకోవాలనే ప్రయత్నం చేయలేదు. మేనేజరు, సెక్రటరీ, అకౌంటెంటు, షూటింగులకు తనతో వచ్చే రాజి, పిలిస్తే చాలు 'వస్తున్నానమ్మా' అని పరుగెత్తుకుంటూ వచ్చే కుర్రాడు రాము పేళ్ళు తప్ప తక్కిన వారి పేర్లు కూడా ఆమెకి తెలియవు.

తన స్వంత తమిళ చిత్రం విడుదల కావటానికి ముందే పరిశ్రమ నాడిని పరిశీలించి జోస్యం చెప్పగలిగిన ప్రముఖులు కొందరు ఆ చిత్రం ఆమె ప్రథమ చిత్రంలాగే ఫ్లాప్ అవుతుందని అంచనా వేసి తెలుసుకున్నారు. 'ఫలితంగా మీకు ఫైనాన్సా? ఎంత కావాలో తీసుకోండి'అని అడిగిందే తడవుగా పోటీలు పడివచ్చే ఫైనాన్సియర్లలో ఒకరైన రామచెట్టియార్ తను అంతకుముందే ఇచ్చి వున్న ఆరు లక్షల అప్పుని సెటిల్ చేసేనేగాని పిక్చరు రిలీజు కావడానికి వీల్లేదని లాయర్ నోటీసు పంపించాడు. మొదటి చిత్రం ద్వారా ఆమె కేర్పడిన నష్టాన్ని రెండో చిత్రంలో ఫ్రీగా నటించి భర్తీ చేసానని చిలక పలుకులు పలికిన ప్రకాష్ పవర్ ఆఫ్ అటార్నీని అడ్డుపెట్టుకుని తప్పుకొన్నాడు. అతని బావమరిది కోటిలింగం తన 'ప్రకాష్ పిక్చర్స్'లో కాంట్రాక్టు నటుడైన ప్రకాష్‌కి ముట్టవలసిన మొత్తాన్ని సెటిల్ చేయకుండా చిత్రం విడుదల చేయడానికి వీలులేదని కోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేశాడు. యాభై చిత్రాల్లో నటించి సంపాదించిన అడయార్ బంగళాని, టీనగర్‌లోని రెండంతస్తుల భవంతిని అమ్ముకోవటం తప్పగత్యంతరం లేకపోయింది సవితాదేవికి. మొదటి చిత్రానికే కొంత ఆస్తి హరించుకపోయింది. దిగులుతో క్రుంగిపోయాడు తండ్రి.

"సొంతంగా సినిమా తీయమని పోరు పెట్టింది మీరేగద నాన్నా. పాత నీళ్ళు కొట్టుకు పోతున్నాయి. ఇండస్ట్రీలోకి కొత్త కొత్తగా అమ్మాయిలు పదహారేళ్ళ జవ్వనులు ప్రవేశించి ప్రేక్షకుల చేత 'శభాష్' అనిపించుకుంటుంటే ప్రొడ్యూసర్లు క్రమంగా నన్ను మరచి పోవటం ప్రారంభించారు. మూడేళ్లుగా పిక్చర్లు లేవు. కూర్చుని తింటూ కొంత కరిగి పోయింది. మీ చేతుల్లో డబ్బు లాడడం లేదు. సొంతంగా ప్రొడక్షన్ ప్రారంభించాలనే కోరికతో తహతహ లాడటం మొదలు పెట్టారు" అంది సవితాదేవి అప్పుడు.

"ఇలా పరిణమిస్తుందని అనుకోలేదు తల్లీ! ఇప్పుడంతా సర్వనాశన మయి పోయింది గదమ్మా" అంటూ బావురుమన్నాడు తండ్రి.

"మీకు జ్ఞాపకముందా నాన్నా! మొట్ట మొదట కట్టుబట్టలతోనే మద్రాసులో దిగాము. ఆ తర్వాతే ఈ బంగళా, కారు, భర్త, బిడ్డ అంతా వచ్చింది. ఊరునుంచి వస్తూ ఇవన్నీ తెచ్చుకొన్నామా చెప్పండి"

"ఇప్పుడెలాగమ్మా మన జీవితం?"

మనస్సు అట్టడుగు పొరల్లో రగులు కుంటున్న ఆవేదనా జ్వాలలు ఒక్కసారిగా ప్రజ్వరిల్లినాయి.

"అందరి తండ్రుల్లా నా జీవితాన్ని తీర్చిదిద్దలేక పోయారు మీరు. ధన వ్యామోహం మిమ్మల్ని తిన్నగా ఉండ నీయలేదు. కన్న కూతుర్నే పణంగా పెట్టి



కోటలు నిర్మించాలనుకొన్నారు. నా కోరికలేమిటో, భావి జీవితాన్ని గురించి నేను కనే కలలేమిటో ఒక్కనాడైనా తెలుసుకోవాలని ప్రయత్నించారా? అందరిలా నన్ను చదివించి మంచి వరుణ్ని చూసి పెళ్ళి చేసి నాకో కుటుంబ జీవితాన్ని ఏర్పరచాలనే ఉద్దేశం మీకుండి ఉంటే ఎంత బావుండేది. ఈనాడు నా జీవితమిలా నికృష్టంగా తయారై వుండేదేనా? మీకెప్పుడూ జేబుల్లో డబ్బులు గలగలలాడుతుండాలి. అది ఎలా వచ్చినా

ఫరవాలేదు. ఇప్పుడు మీరెంత ప్రయత్నిం చినా నన్ను మూలధనంగా పెట్టి సంపాదించటం ఇహ సాధ్యం కాదు. నేనిప్పుడు చెల్లని కాసుని. అంతా అయిపోయింది. సర్వనాశన మైంది" తన తీర్పు చెప్పేసింది సవితాదేవి.

మనోవేదనతో మంచం పట్టి కన్ను మూశాడు తండ్రి. కర్మకాండ ముగిసిం తర్వాత ఎనిమిదోరోజు తన బంగళాని కొన్నవాళ్ళకి అప్పగించి ఖాళీ చేయడానికి తీర్మానించుకొన్నది సవితాదేవి. అప్పులన్నీ పోగా మిగిలిన దాంట్లో ఎవరెవరికి ఎంతెంత ముట్టజెప్పాలో లిస్టు తయారు చేశాడు అక్కౌంటెంటు రామస్వామి. మొదటిసారిగా ఆ లిస్టుని పరిశీలించిన సవితాదేవి తృప్తిగా, గర్వంగా నిట్టూర్చింది. తన ఒక్క సంపాదనతో వీరందరినీ ఇంత కాలం పోషిస్తూ వచ్చింది తను. రేపటితో తనకి, వీళ్ళకి రుణం తీరిపోతుంది. తన లాగే వీరందరూ కూడా భవిష్యత్తును గురించిన ఆలోచనలతో భయపడటం ప్రారంభిస్తారు. సవితాదేవి కనులు చెమ్మగిల్లినాయి. వారివారి సర్వీసుకు తగినట్లు లెక్కచూసి చేరాల్సిన మొత్తాన్ని భాగాలు వేసింది. రామస్వామి వరుసగా ఒక్కొక్కరి పేరే పిలుస్తున్నాడు. సజల నయనాలతో, తడబడే అడుగులతో ముందుకు వచ్చి చెయ్యెత్తి నమస్కరించి సవితాదేవి చేతిలోంచి కవర్లని అందుకుంటున్నారు వారు.

"గార్డెనింగ్ అసిస్టెంటు నూట ఎనభై రూపాయలు"

చేతులెత్తి దండం పెడ్తూ కవరందు కొన్నాడు ఆ వృద్ధుడు. అందుకొన్న కవర్ని అక్కడే మేజా మీదే ఉంచి మౌనంగ నిలబడ్డాడు. ఏమిటన్నట్టు ప్రశ్నార్థకంగ చూసింది సవితాదేవి అతనివైపు.

"నేను మీతోనే ఉండిపోతా!" అన్నాడు బొంగురు గొంతుతో. విస్తుపోయి చూసింది అతని ముఖంలోకి.

"నీ పేరేమిటి?"

"కుప్పుసామి"

"ఏం పని చేస్తుంటావు"

"మొక్కలకి నీళ్ళు పోసేవాడి నమ్మా"

"నాతోనే ఉండిపోతానంటున్నావే! నా అభిమాన ప్రేక్షకుడివా నీవు?" నవ్వుతూ అడిగింది.

ఆ మాటలు అర్థంగాక అయోమయంగా చూశాడు వృద్ధుడు. రామస్వామి వివరించి చెప్పాడు అర్థమయ్యేలా. మాసిన గడ్డంలోంచి చిన్నగా నవ్వాడు కుప్పుసామి.

"నేనసలు సినిమాలు చూసిందే లేదమ్మా"

చకితురాలైంది సవితాదేవి.

"నన్ను విడిచి పోవటానికి మనసు రావడం లేదా?"

"వెళ్ళడానికి నాకు మరో చోటు లేదండమ్మా" అంటూ అక్కడే కూలబడిపోయాడు కుప్పుసామి. 'అన్నాచెల్లి అనుబంధం' సినిమాలో ప్రేక్షకులందరి చేత కంటతడి పెట్టించిన ఒక దృశ్యం కళ్ళముందు మెదిలింది సవితాదేవికి.

అయినవాళ్ళని ఆత్మీయతతో చేరదీసిన వాళ్ళే ద్రోహం చేసారు తనకి. వాళ్ళ కుట్రలో అన్నీ పోగొట్టుకుని భర్తకి కూడ దూరమయ్యే సన్నివేశం అది. తనని అవమానించి అందరూ వెళ్ళిపోగా మెట్ల

మీద ఒంటరిగా పిచ్చిదానిలా నిలబడింది. అప్పుడు ముసలి నౌకరు రంగన్న తాత తనని ఓదార్చే ప్రయత్నం చేస్తాడు.

"ఇంకా నువ్వెందుకున్నావయ్యా ఇక్కడ. వెళ్ళిపో"

పెళ్ళగిల వచ్చే దుఃఖాన్ని ఆపు కుంటూ అరుస్తుంది తను.

"మిమ్మల్ని వదిలి ఎక్కడికెళ్ళ మంటారమ్మా!"

"రేపట్నించి నన్ను నేనే పోషించు కోలేని స్థితిలో ఉన్నానయ్యా నీకు జీత మిచ్చుకోలేను. వెళ్ళిపో"

"అమ్మా!" అని బావురుమంటాడు నౌకరు.

"చిన్నప్పటినుంచి చేతుల్లో ఎత్తుకొని పెంచాను తల్లీ నిన్ను. ఇప్పుడెలా వదలి పొమ్మంటావు. మీతోబాటు నేనూ పస్తు లుంటాను. అంతేగాని నన్ను మాత్రం తరిమెయ్యకు తల్లీ!"

"రంగన్నా!" అంటూ అతన్ని కౌగ లించుకొని బావురుమంది తను.

ఇప్పుడు కుప్పుసామిని చూస్తుంటే అవే భావాలు మెదులుతున్నాయి తనలో. కాని ఇది జీవితం. బావురుమని ఏడుస్తూ అతన్ని కౌగలించుకోవడం సాధ్యం కాదు సంఘంచేత, విధిచేత వంచింపబడి చితికి పోయిన ఇల్లాలి పాత్రలు చాలా ధరిం చింది. ఆమె నటించిన చిత్రాల్లో బాగా విజయం సాధించినవన్నీ విషాదాంతాలే. "శోక పాత్రల్ని పోషించడంలో శిఖరా గ్రాన్ని చేరుకొన్న నటి సవితాదేవి" అని పత్రికలు పొగిడాయి.

"అవును నేను మహానటినే" అని గొణుక్కొని ఒక్కసారిగా పెద్దపెట్టున నవ్వింది. నిషాలో ఉన్నప్పుడు నవ్వటం ప్రారంభించిందంటే ఆ రోజంతా నవ్వు తూనే ఉంటుంది ఆమె.

మొదటిరోజు షూటింగు అయిపోగానే చేతికందిన డబ్బులో బకాయి పడిన ఆర్నెల్ల అద్దెకు పోను డెబ్బయి రూపా యలు మిగిలాయి. ఇంటికి తిరిగి వచ్చిన వెంటనే కుప్పుసామి చేతికి పది రూపాయ లిచ్చి 'మందు' తెప్పించుకొంది.

యజమానురాలి అసాధారణమైన నవ్వుకు గాని, ఏడ్పులకు గాని కారణ మడుగడు కుప్పుసామి. ఆమె నవ్వుకి, శోకాలకి వెయ్యి కారణాలుంటాయనే విషయం కూడ తెలియదతనికి. అతని స్వభావమంతే.

"నేనెందుకిలా నవ్వుతున్నానో అడగవా కుప్పా?"

అవసరమైతే మీరే చెపుతారు కదమ్మా"

అయితే విను. మొదట్లో నాట కాల్లో వేషాలు వేస్తుండేదాన్ని. తొలి నాటకంలోనే నాది ఏడుపు మొహం పాత్ర. డబ్బుకాశపడి నన్నొక ముస లోడికి కట్టబెట్టాడు నా తండ్రి. కొట్టినా, తిట్టినా మొగుడే దిక్కని పడివుంటు న్నాను. నన్ను ప్రేమించిన యువకుడు నన్ను మర్చిపోలేక త్రాగుడికి బానిసై పోయాడు. రోజురోజుకి క్షీణించిపోతు న్నాడు. నేను స్వయంగా వెళ్ళి నచ్చ చెప్పితే తప్ప అతను ఆ అలవాటుని మానుకొనేలా లేడు. ధైర్యంచేసి ఒక రాత్రి అతని గదికెళ్ళాను.

'నన్నిక మర్చిపొమ్మని, త్రాగుడు మానమని ఏడుస్తూ బతిమాలాను'" అని బిగ్గరగ నవ్వి గ్లాసులో మిగిలిన సారాని గొంతులో పోసుకొంది.

"కాని నిజ జీవితంలో కోరకుండానే

అంతా మర్చిపోయారు నన్ను. తమా షాగా లేదూ!"

అందులోని తమాషా ఏంటో అర్థం కాలేదు కుప్పుసామికి.

"తర్వాత ఆ నాటకం సినిమాగా వచ్చింది. బ్రహ్మాండంగా హిట్టయింది. ఆ దెబ్బతో నేను గొప్ప హీరోయిన్నై పోయాను"

"చెలిమి లేదూ చెలియ లేదూ" ఎంత మంచి పాట. తాగుడు మానమని చెప్ప



గలిగానే గాని అది ఎంత కష్టమో ఇప్పుడు తెలుస్తోంది.

"బాధే సౌఖ్యమనే భావన రానీ
వోయ్
ఆ ఎరుకే నిశ్చలానందమోయ్"

నిజమే! వేదనలో, బాధలో, దుఃఖంలో ఏదో సుఖం, శాంతి ఉన్నాయి. లేకపోతే మనిషి ఇన్ని కష్టాల్ని కన్నీళ్ళని ఎలా భరిస్తున్నాడు. ఏమంటావు తాతా?"

అతడేమీ అనలేదు. ఆమెకేసి దీనంగా జాలిగా చూట్టం తప్ప.

"ఏదన్నా ఇంత ఎంగిలి పడండమ్మా. ఈమధ్య మీరు సరిగ్గా భోజనం కూడా చేయడం లేదు. రోజురోజుకీ ఎంతగా చిక్కిపోతున్నారో గమనించండి" తాత మాటలకు పకపక నవ్వింది.

"బాగా బ్రతికిన రోజుల్లో నా లావు తగ్గాలని ఎన్ని మందులు వాడానో, ఎంత ప్రయాస పడ్డానో తెలుసా నీకు? ఒక పూట మాత్రమే భోజనం చేసేదాన్ని. అయినా పిక్చర్లు తగ్గుతూ వచ్చాయేకాని ఒళ్ళు మాత్రం తగ్గలేదు"

కుప్పుసామికేం మాట్లాడాలో తెలియక మౌనంగా నిలబడ్డాడు. ఇలాంటప్పుడు తనతో ఎవరైనా వాదించాలని, ప్రశ్నలు వేసి తనచేత ఇంకా ఇంకా మాట్లాడించుకొనేవాళ్ళుంటే బాగుంటుందని అనిపిస్తుంటుంది సవితాదేవికి.

"నీతో మహా బోరుగా ఉంది కుప్పూ. వెళ్ళి ఆ కుర్రాడు విశ్వమూర్తిగాని తీరిగ్గా ఉంటే ఒకసారి రమ్మని చెప్పు"

"సరే అమ్మా" అంటూ అక్కణ్ణుంచి కదిలాడు కుప్పుసామి.

వరుసగా ఆమె నిర్మించిన రెండు చిత్రాలు బాక్సాఫీసు దగ్గర ఘోరంగా దెబ్బతినడంతో సినిమారంగం సవితా దేవిని తిరస్కరించడం ఆరంభించింది. నిర్మాతలు ఆమెను చూట్టమే అపశకునంగా భావిస్తున్నట్టు మసలుకొనేవారు. ఆమెను పట్టుకున్న శనిదేవత తమ దగ్గరికి కూడా వస్తుందేమోననే భయం వాళ్ళకి. మూఢనమ్మకాలకి నిలయమైన ఈ ఫీల్డులో ఇదేమీ వింతకాదు.

ఇక్కడ సినిమా తీయడమన్నది జూదంలా తయారైంది. ఒక చిత్రం విజయవంతం కావడమనేది కళాకారుల సామర్థ్యాన్ని బట్టి, వారి కళానైపుణ్యాన్ని బట్టి కాకుండా కేవలం నిర్మాత అదృష్టం మీద ఆధారపడి ఉందన్న అభిప్రాయం చాలా మందిలో బలంగా నాటుకు పోయింది, తనని హీరోయిన్‌గా పెట్టి తొమ్మిది శతదినోత్సవ చిత్రాలు నిర్మించి, లక్షలార్జించిన ఒక నిర్మాతను స్వయంగా వెళ్ళి కలుసుకొంది సవితాదేవి.

"చూడమ్మా తప్పుగా అనుకోకు, ఇప్పుడు నీకు టైం బాగాలేదు. కొంత కాలం పోయాక చూద్దాం" అంటూ మొహం తప్పించాడు ఆ నిర్మాత.

"నీవు రెండు చిత్రాలు నిర్మించి దర్శకత్వం కూడా చేశావు. నీ హూదాకి తగిన పాత్ర నా పిక్చర్‌లో లేదే. ఏం చెయ్యాను చెప్పు" అని తప్పించుకున్నారు కొందరు.

కళ్ళు మిరుమిట్లు గొలిపే స్టూడియో లైట్లు, ఖరీదైన కార్లు, ఎయిర్ కండిషన్ పడగ్గదులు అభిమానుల పొగడ్తలు పత్రికల మీద కవరు పేజీ ఫొటోగ్రాపులు వీటి మధ్య విలాసంగ గడిపేసిన సవితా దేవి అన్నిటినీకోల్పోయి ఏకాకిగా రెండేళ్ళ క్రిందట ఈ ఇంట్లో అద్దెకి దిగిన తొలి రోజుల్లో తనని కలుసుకున్నాడతను. ఒకప్పుడు ఓహో అనిపించుకున్న సంభాషణల

రచయిత, సినిమాల్లో ఉపన్యాసాల్లాంటి సుదీర్ఘమైన సంభాషణలకి కాలం చెల్లిపోగా అవకాశాల్లేక అలమటించే రచయితగా మిగిలి పోయినాడు.

"చూడు సవితా ఎవరెవరో కుర్ర కుంకలంతా నాటకాల్రాసి అంతో ఇంతో పేరు సంపాయించి సినిమాల కెగబ్రాకుతున్నారు. అంచేత నేనో మంచి నాటకం తయారు చేస్తున్నాను. ఈ దెబ్బతో మళ్ళీ సినిమా మార్కెట్టుని పట్టుకుంటానో లేదో చూస్తు ఉండు అన్నాడు యోగ బ్రహ్మ.

"ఇంతకీ నేనేం చేయాలంటావు?"

"నాలాగే నిన్నూ ఈ సినిమా రంగం దూరంగా నెట్టేసింది. నానాటకంలో నీవు హీరోయిన్‌గా వేసే తప్పకుండా హిట్టవుతుందనే నమ్మకం నా కుంది. సినీ ఫీల్డు మనల్ని మళ్ళీ ఆహ్వానించక తప్పదు. ఏమంటావు" అన్నాడు ఉత్సాహంగా.

"నీకు ఈ ఒంటరి జీవితంలోంచి కాస్త రిలీఫ్ దొరికినట్టుంటుంది. అంతో ఇంతో రాబడి ఉంటుంది"

'సరే'నంది సవితాదేవి.

నాటక రంగస్థలమెక్కింది కాని మూసపోసినట్లుండే చవుకబారు హాస్యానికి అలవాటు పడిపోయిన మద్రాసు ప్రేక్షకులకు ఆ నాటకం నచ్చలేదు. నాటకం ముగిసింది. గ్రీన్‌రూంలో కూర్చుని వేషం విప్పుకుంటుంది సవితాదేవి.

"మే ఐకమిన్?" అంటూ లోపలికి ప్రవేశించాడు పాతికేళ్ళ యువకుడు.

"నా పేరు విశ్వమూర్తి, నేనొక కళాభిమానిని, ఫ్రీలాన్సు జర్నలిస్టుని. ఈ నాటకాన్ని గూర్చి మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని వచ్చాను" అంటూ తనని తాను పరిచయం చేసుకున్నాడు. అతన్ని పరీక్షగా చూసింది. చెదిరినా అందంగా కనుపించే క్రాపు, కాఫీరంగు పైజమా, దానిమీద కాకిరంగు షర్టు వేసుకొని ఉన్నాడు. భుజానికి వ్రేలాడుతూ పొడవైన గుడ్డ సంచి, దళసరి కళ్ళద్దాల ఫ్రేములో చురుగ్గ కదిలే నేత్రాలు. కొంచెమాసినట్టున్నా అందంగా కనిపించే గడ్డం.

"నాటకం పూర్తిగా చూశావా?" ప్రశ్నించింది.

"ఈ సిటిలో జరిగే ప్రతినాటకం, విడుదలయ్యే ప్రతి సినిమా చూస్తుంటాను చూచి ఆలోచిస్తాను. ఆవేదన పడతాను"

"చకచక మాట్లాడేస్తున్నాడు.

"సినిమాలు . నాటకాలూ చూస్తూ సరదాపడటం పోయి ఆవేదన పడటం దేనికో" నవ్వుతూ అంది.

"కళల విషయంలో మన అభిరుచులు ఎంతో దిగజారి పోతున్నాయన్నదే నా విచారం"

"ఇంతకీ ఈ నాటకాన్ని గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

ఈనాటకం మాత్రమేకాదు. మిమ్మల్ని కూడా చూచి నేను జాలిపడుతున్నాను" అంటూ సవితాదేవికేసి చూశాడు.

"ఎవరయ్యా నువ్వు? మేకప్ గదిలోకి జొరబడి ఏమిటా వాగుడు?" అంటూ విసుగ్గా అక్కడి కొచ్చాడు నాటక రచయిత యోగబ్రహ్మ.

విశ్వమూర్తి వాలకం, చిత్రమైన అతని మాటల ధోరణి సవితాదేవికి బాగా నచ్చింది.

"ఫరవాలేదు నువ్వుచెప్పు తమ్ముడూ" ప్రోత్సహించింది. యోగబ్రహ్మ వైపొక

సారి చూసి మళ్ళీ చెప్పడం ప్రారంభిం చాడు విశ్వమూర్తి.

"నాటకం అనేది మహోన్నతమైన ఒక కళా ప్రక్రియ. మీ చేతుల్లో పడి నలిగి పోతుందే అని బాధగా ఉంది. అలాగే నటిగా మీలో మంచి టేలెంటుంది. అది ఇలా వృధా అయిపోతోందే అని విచారంగానూ ఉంది"

యోగబ్రహ్మ ఉక్రోషం పట్టలేక పోతున్నాడు. "ఈ నాటకాన్ని గురించి ఏమిటి నీ ఉద్దేశం" కొంచం కటువుగా ప్రశ్నించాడు. సవితాదేవి ముఖం చూచి ఊరుకున్నాడేగానిలేకపోతే విశ్వమూర్తిని ఈపాటికి గెంటేసి ఉండేవాడే.

"ప్రేక్షకుల్ని మెప్పించాలని నాటకం తయారు చేసినట్టు తెలుస్తూనే ఉంది. కాని రెంటికీ చెడ్డ రేవడిలా తయారైంది.

శిల్పంలో నాటకానికి, సినిమాకి తేడా ఉంది. అది గుర్తించ లేక సినిమా ధోరణుల్ని నాటకంలో చొప్పించడానికి ప్రయత్నించి బోల్తా పడ్డారు."

అతని అభిప్రాయం సవితాదేవికి బాగా నచ్చింది. దాదాపు ఇలాంటి అభి ప్రాయమే నాటకం రిహార్సలు చేస్తున్న ప్పుడే ఆమెకు కలిగింది. కాని ఎంచేతో తన అభిప్రాయాన్ని యోగబ్రహ్మకి చెప్పలేక పోయింది. ఓ వేళ చెప్పినా ప్రయోజనం ఉండేది కాదన్న సంగతి కూడా ఆమెకు తెలుసు.

"స్టాపిట్" పెద్దగా అరిచాడు యోగ బ్రహ్మ. "ఎవరయ్యా నువ్వు? పిలవని పేరంటంగా జొరబడి ఇష్టమొచ్చినట్లు వాగుతున్నావు. నీ బోడి సలహాలు, అభి ప్రాయాలు మాకెవరికీ అక్కర్లేదు, గెటవుట్"

"ఆవేశ పడకండి సార్! విమర్శని స్వీకరించని కళాకారులు రాణించలేరు. మిమ్మల్ని కించపరచాలన్నది నా ఉద్దేశం కాదు. విమర్శకునిగా నా అభిప్రాయం చెప్పాను. సవితాదేవిగారి మీద నాకు చాలా గౌరవం ఉంది. ముందు ముందు మంచి నాటకాల్లో ఆమె నటించాలని నా కోరిక" అన్నాడు విశ్వమూర్తి ఏమాత్రం ఆవేశపడకుండా.

"అనవసరంగా ఉద్రేక పడతారెందు కండీ బ్రహ్మంగారూ! మళ్ళీ ఇప్పుడే ఈ రం గంలోకి ప్రవేశిస్తున్నాం మనం.తొందరపడి పత్రికల వాళ్ళని విరోధం చేసుకోవడం తెలివైన పనికాదు. ముందు ముందు వాళ్ళ సహకారం మనకెంతో అవసర మన్న సంగతి మరచిపోతున్నట్లున్నారు. విశ్వమూర్తి అనేక పత్రికలకు ఫ్రీలాన్సు జర్నలిస్టుగా ఉంటున్నాడు" అని వివ రించింది సవితాదేవి. రుసరుస లాడుతూ అక్కడ్నించి నిష్క్రమించాడు యోగ బ్రహ్మ.

"చూడు తమ్ముడూ! నిర్మొహ మాటంగా నువ్వు చేసిన విమర్శ నాకు బాగా నచ్చింది. నీతో ఇంకా చాలా మాట్లాడాలని ఉంది. ఇప్పుడు కాదు. వీలైతే రేపు మా ఇంటికోసారి రాగలవా?" అంది ఆప్యాయంగా చూస్తూ.

ఆ మర్నాడు సాయంత్రమే సవితా దేవిని కలుసుకున్నాడు విశ్వమూర్తి.

"నేను ఈ ప్రాంతంలోనే మూడో వీధిలో ఓ చిన్న గదిలో ఉంటున్నాను" అన్నాడు ఆమె చూపించిన కుర్చీలో కూర్చుంటూ.

"ఏదైనా ఉద్యోగం చేస్తున్నావా?" అడిగింది.

"లేదు నా లాంటి వాడికి ఉద్యోగం

దొరకదు. ఒకవేళ దొరికినా నేనందులో ఇమడలేనేమో" అన్నాడు చిన్నగా నవ్వి.

"ఐనా ఉద్యోగం లేదనే చింత నాకు లేదు. ఎవరికో దాస్యం చేస్తూ కాలాన్ని వృధా చేయడంకన్నా నాకు తృప్తినిచ్చే పనుల్లో నా కాలాన్ని సద్వినియోగం చేసుకుంటున్నాననే ఆత్మ విశ్వాసం నాకుంది."

"ఏవిటో ఆ రాచకార్యాలు?" చిన్నగా నవ్వుతూ ప్రశ్నించింది.

"ఈ సమాజంలోని వైరుధ్యాలని స్టడీ చేస్తున్నాను. సాంస్కృతిక రంగంలో ముఖ్యంగా సాహిత్యం, నాటకం, సినిమా ఈ మూడు ప్రక్రియల ద్వారా బూర్జువా మేధావులు సామాన్యుని ఎంత తెలివిగా జోకొట్టడానికి ప్రయత్నిస్తున్నదీ, వామ పక్షాల రాజకీయ వాదుల నిర్లక్ష్య వైఖరీ, కళారంగంపట్ల విప్లవ మేధావుల బాధ్యత, మొదలైన అంశాల మీద ఒక పెద్ద గ్రంథం రాయాలనే ప్రయత్నంలో ఉన్నాను."

"అబ్బో చాలా పెద్ద ప్రయత్నమే" అంటూ మెచ్చికోలుగా చూసింది సవితాదేవి. తను పదిహేనేళ్ళ అమ్మాయిగా ఉన్నప్పుడు ఒక నాటకంలో రాంప్రభుని తొలిసారిగ చూసినప్పుడు కలిగిన అనుభూతి వంటిది ఇప్పుడు విశ్వమూర్తి సమక్షంలో ఫీలవుతూంది. ఆనాటి అనుభూతి వ్యామోహంతో కూడుకున్నది. నేటి అనుభూతి వాత్సల్యంతో కూడుకొన్నది. అంతే తేడా.

విశ్వమూర్తి అంచనా తప్పు కాలేదు. అతనా రోజే చెప్పినట్లు సవితాదేవి నాటకం మళ్ళీ స్టేజి ఎక్కే అవకాశం రాలేదు.

తరచూ విశ్వమూర్తి సవితాదేవి ఇంటికొచ్చి కాసేపు మాట్లాడి వెళుతున్నాడు. అతను రావడం రెండు మూడు రోజులు ఆలశ్యమైతే ఏమీ తోచనట్లుగా ఉండేది ఆమెకు.

"తీసుకో విశ్వం" గ్లాసుని ముందుకు తోసి "అభ్యంతరం లేదనుకుంటాను" అంది సవితాదేవి. "అలవాటు అంతగా లేదు. ఎవరైనా ఆఫర్ చేస్తే మాత్రం తిరస్కరించను" అంటూ గ్లాసు అందుకున్నాడు.

"విస్కీయో, బ్రాందీయో ఇవ్వక సారా పోసిస్తుందేమిటా అనుకుంటున్నావా?"

"నా మట్టుకు అన్నీ ఒకటే" అన్నాడు విశ్వం గ్లాసందుకుని.

"ఎంచేతో ఈ రోజంతా నీతో మాట్లాడుతూ ఉండిపోవాలనిపిస్తోంది విశ్వం. ఒకప్పుడు నా కడ కంటి చూపు కోసం, నా గొంతులోంచి వెలువడే ఒక్క మాట కోసం, అర్థం లేకుండా నేనేమి వాగినా అదో పెద్ద జోకు అనుకొని విరగబడి నవ్వే గుంపు నా చుట్టూ ఉండేది. ఆ మనుష్యులు ఇప్పుడు నన్ను చూసి తప్పించుకుపోతున్నారు."

"అప్పుడు నాకు పధ్నాలుగేళ్ళనుకుంటాను. మీరు నటించిన సినిమా వస్తే తప్పకుండా వెళ్ళి చూసేవాణ్ని. ముఖ్యంగా మీరు నటించిన 'అన్నా చెల్లి అనుబంధం' ఎన్ని సార్లు చూశానో లెక్కలేదు. ప్రతి సారి నాకు తెలియకుండానే కన్నీళ్ళు కార్చేవాణ్ని. అప్పట్లో మీరంటే నాకో రకమైన పూజ్య భావం. 'అడాలసెంట్ ఇన్ ఫాచ్యుకేషన్' అనుకుంటాను ఉండేది. ఇన్నేళ్ళ తర్వాత ఇప్పుడు మీ ఎదురుగా కూర్చుని మీ విషాద జీవి

తాన్ని గురించి వింటూ ఉంటే నాకే చిత్రంగా అనిపిస్తూంది".

"విషాద జీవితం" అంటూ గల గల నవ్వింది సవితాదేవి. "దాదాపు ప్రతి చిత్రంలోను నేను ధరించిన పాత్ర విషాద మైనదే. తెర మీద నేను విషాదం నటిస్తుంటే ప్రొడ్యూసర్లు, డైరక్టర్లు, ప్రేక్షకులు ఆహా ఎంత గొప్పగా చేస్తూంది అనుకొని ఆనందించే వారో తెలుసా ?" రెండో గ్లాసు నింపింది.



"ప్రజలు ట్రాజడీలనెందుకు లైక్ చేసారో తెలుసా ?" ఖాళీ గ్లాసుని స్టూలు మీద పెడుతూ అన్నాడు విశ్వమూర్తి.

"చెప్పు. వింటాను"

"మనిషి జీవితంలో ఆనందంకంటే విషాదం పాలే హెచ్చు. సీసుకి, సీసుకి మధ్య ఉండే విరామ సమయంలాంటిది మనిషి తన జీవితంలో పొందే ఆనందం అంటాడు థామస్‌హార్డీ. తెరమీద కనిపించే విషాదాన్ని తన జీవితంలోని విషాదంతో పోల్చుకొని ఓ విధమైన సంతృప్తిని పొంద గలుగుతున్నాడు ప్రేక్షకుడు. అందుకే గొప్ప ట్రాజిడీలన్నీ విజయవంతం అవుతున్నాయి"

చీకటి పడింది. అంతవరకు బయట వసారాలో కూర్చుని ఉన్న కుప్పుసామి వచ్చి లైటు వేశాడు.

ఆ రాత్రి సవితాదేవితో కూర్చుని అక్కడే భోజనం చేశాడు విశ్వమూర్తి.

"చాలా కాలం తర్వాత మళ్ళీ ఈ రోజు నేను షూటింగులో పాల్గొన్నాను తెలుసా" అడిగింది.

"కుప్పుసామి చెప్పాడు"

"విలన్ కృష్ణ మోహన్ నీకు తెలుసనుకుంటాను. లంచవర్‌లో నాతో బాతాఖానీ వేసుకున్నాడు. నా జీవితం ఈనాడిలా దిగజారి పోవడానికి కేవలం నేను మాత్రమే కారణం కాదని, ఈ సమాజపు బాధ్యత కూడా ఉందని నీవన్నట్లే ఏదేదో చెప్పాడు. నాకు కొన్ని పూర్తిగా అర్థం కాలేదు"

"కష్టాలకి గురి అవుతున్న వాళ్ళలో చాలామంది అందుకు సరైన కారణాలు గ్రహించలేని స్థితిలో ఉన్నారు. కారణాలు తెలుసుకోకుండా పరిష్కారం సాధ్యం కాదు. సినిమా ప్రపంచాన్నే తీసుకొంటే చాలమంది ఆర్టిస్టుల జీవితాలు దయనీయమైన స్థితిలో ఉంటున్నాయి. ఎవరో కొందరు సమర్థులు మాత్రం హాయిగా బ్రతగ్గలుగుతుంటే తక్కిన వాళ్ళంతా చావలేక బ్రతుకుతుండడం చూస్తున్నాం. ముప్ఫై చిత్రాలకు పైగా నటించి, ఎన్నో బహుమతులందుకొని, టాప్ హీరోయిన్‌గా ప్రసిద్ధిగాంచిన కన్నడ నటి కల్పన మంచి తెలివి తేటలుండి కూడ ఆత్మహత్య చేసుకొంది. ఆత్మహత్య కాదు, బడా బాబుల కుట్రకి బలైపోయిందని వదంతులు కూడ వినిపిస్తున్నాయి. టేలెంటు ఉండి కూడ అవకాశాలు దొరక్క ప్రముఖులచేత అణగద్రొక్కబడి తనువు చాలించాడు మొన్నటి అరుణకుమార్. ఒక చిత్రంలో హీరోయిన్‌గా వేసి ఆ తరువాత డైరక్టరుగారి వుంపుడు గత్తెగా మార్చబడిన వసంత లక్ష్మి చావబోయి బ్రతికింది. అలనాటి కాంచనమాలని పిచ్చిదాన్ని చేసి వదిలింది ఈ సినీ మాయాలోకం. ఇటీవల ఓ ప్రముఖ హిందీ నటి ఇంటర్‌వ్యూ ఒకటి చదివాను. 'సినిమారంగం కూడా ఈ సమాజంలోని ఒక భాగమే. సమాజంలోని అన్ని అవలక్షణాలతో బాటు పురుషాధిక్యత, జులుం ఇక్కడ కూడా రాజ్యం చేస్తోంది. ఎంత టాప్ హీరోయిన్‌అయినా వ్యక్తిత్వాన్ని చంపుకుని ప్రవర్తించాల్సిన సందర్భాలు కూడా ఎదురవుతుంటాయి" అని ఆమె చెప్పిందాంట్లో ఎంతో నిజముంది. ఈ మాత్రం అవగాహన వున్న వాళ్ళు మన సినిమారంగంలో బహుకొద్ది మంది".

సవితాదేవికి ధర్మ సందేహం ఒకటి కలిగింది.

"విశ్వం! మరైతె నాతోబాటే సినిమా ల్లోకి వచ్చిన ప్రియదర్శిని, వైజయంతి, ఆ తరువాత ప్రవేశించిన లలితాదేవి, కనకలత వీళ్ళంతా నాలా దిగజారిపోలేదు ఎంచేత ?"

"నేనూహించే కారణం ఇది. ప్రియ దర్శిని, వసంతమాల సంపన్నవర్గానికి చెందిన కుటుంబాల్లోంచి వచ్చిన వాళ్ళు. డబ్బు మీద డబ్బు సంపాయించటం, దాన్ని కాపాడుకోవటం వాళ్ళకి పుట్టుకతో అబ్బిన విద్య. అంతే కాదు మీరు వేసిన తప్పటడుగు వాళ్ళు వెయ్యకుండా జాగ్రత్త పడ్డారు"

"ఏమిటో అది" అడిగింది సవితాదేవి భోజనం ముగించి టవల్‌తో చేతులు తుడుచుకుంటూ.

"తనకన్న సంపన్నవర్గానికి చెందిన ఇతర రంగాల్లోని వాళ్ళని పెళ్ళిళ్ళు చేసు కున్నారు ప్రియదర్శిని, వసంతమాలలు. వివాహం కాకపోయినా, సినిమా ఛాన్సులు రాకపోయినా కనకలతకి దిగుల్లేదు.వృత్తి వుండనే వుంది. లలితాదేవి విషయం సరేసరి. ఒక పెద్ద పారిశ్రామిక వేత్తని తగులుకుని బాగుపడింది"

మంచంమీద గోడకానుకుని ఆలో చనల్లో పడిపోయింది సవితాదేవి. పాతి కేళ్ళనాడు రోహిణి స్టూడియోలో తనకు జరిగిన మేకప్ టెస్టు, 'సార్ మీ అమ్మా యికి మంచి భవిష్యత్తుందండీ! కెమేరాకు తగిన రౌండ్ ఫేస్, మంచి ఎక్స్‌ప్రెషన్స్ అవకాశం దొరకాలేగాని చిటికెలో పైకొస్తుంది' అనే పొగడ్తలు, తన మూడవ చిత్రంలో తన సరసన హీరోగా నటించేది ఆ మాటలు అన్న రాంప్రభు వేనని తెలిసి ఆనందాశ్చర్యాలతో తను పులకించి పోవటం. అన్నీ సినిమా షాట్సు వలె ఆమె కళ్ళముందు కదులుతున్నాయి.

ఆ రాత్రికి విశ్వమూర్తి అక్కడే పడు కున్నాడు. తెల్లారి లేచి సెలవు తీసుకుని వెళ్ళబోతున్నప్పుడు "విశ్వం! సుమారు నీ యీడువాడే నాకో కొడుకున్నాడన్న సంగతి నీకు తెలుసా?" అడిగింది సవితా దేవి.

"తెలుసు. పెళ్ళి చేసుకుని వేరుగా వుంటున్నాడు. మిగిలిన ఒక్క ఇంటిని అతని కోసం వదిలేస్తే, కన్నతల్లి గదా అని దయపట్టి నెలనెలా మూడొందలు మీకు పంపుతున్నాడు, అవునా ?" అని నవ్వుతూ మెట్లు దిగాడు విశ్వమూర్తి.



హీరో ప్రకాష్ విదేశాలకు వెళ్ళ బోతున్నాడు-అక్కడ పూర్తి ఔట్ డోర్‌లో నిర్మించే ఒక చిత్రంలో నటించ డానికి. అంచేత నందలాల్ బ్రదర్స్ వారి చిత్రంలో షూటింగ్ రాత్రీ పగలూ ముమ్మరంగా సాగుతోంది. ఉదయం తొమ్మిది నుంచి మళ్ళీ రాత్రి పది దాకా షూటింగు. సవితాదేవి ఈ రెండు షెడ్యూల్సులోనూ నటించాల్సి వుండటం చేత అది ఆమె శక్తికి మించిన పనైంది. షూటింగు సమయాల్లో కంపెనీ వాళ్ళే బ్రాందీ సప్లై చేసేవారు ఆమెకు. ఇంటికి తిరిగి రాగానే మళ్ళీ కాపు సారా. నిన్న రాత్రి ఎక్కడా సారా దొరకలేదు. కుప్పు

సామి ఎక్కడెక్కడో తిరిగి జింజర్ బాటిల్ ఒకటి సంపాయించుకొచ్చాడు.

ఉదయం ఏడింటికల్లా కంపెనీ కారు వచ్చి ఇంటి ముందాగింది.

ఆదమరచిన నిద్రలో వుంది సవితా దేవి.

"అమ్మా....లేవండమ్మా..." అంటూ బిగ్గరగా అరిచి లేపుతున్నాడు కుప్పుసామి.

ఉలిక్కిపడి లేచి హడావుడి గాస్నానం



ముగించుకుని బయలుదేరే సన్నాహంలో వుంది సవితాదేవి.

"పిన్నీ... పిన్నీ" అంటూ మెట్లెక్కి వచ్చింది శ్యామల.

"షూటింగు చూడాలని నాకెంతో ఆశగా వుంది పిన్నీ. మీతో తీసికెళ్ళండి పిన్నీ" అంది వుత్సాహంగా.

"షూటింగు చాలా బోరు కొడుతుందమ్మా"

"ఒక్కసారి చూపించండి పిన్నీ" బతిమాలుతూ అడిగింది శ్యామల.

"సారీ శ్యామలా! ఈ విషయంలో నేనేమీ చెయ్యలేను. నువ్వు నాతో మాట్లాట్టమే మీ అమ్మకి గిట్టదు. ఎన్నోసార్లు నిన్ను తిట్టింది కూడా. దీనికి తోడు ఇప్పుడు నువ్వు నా వెంట వచ్చావని తెలిస్తే ఇంకేమైనా వుందా"

"మా అమ్మకసలేం తెలీదు పిన్నీ"

"కాదమ్మా. ఆమెకు అన్నీ తెలుసు. అంచేతే నిన్ను అతిజాగ్రత్తగా పెంచగలుగుతూంది. నీకో రహస్యం చెప్పనా శ్యామలా! నాకూ నీలాంటి కూతురున్నట్టయితే, సరిగ్గా మీ అమ్మలాగే ఆ అమ్మాయిని పెంచేదాన్ని. పెంచి పెద్దచేసి మంచి మొగుణ్ణి చూసి పెళ్ళి చేసి పంపేదాన్నమ్మా"

"పిన్నీ..." ప్రాధేయ పూర్వకంగా చూసింది శ్యామల.

"ఇంకొద్ది రోజుల్లో పెళ్ళయి ఇక్కడ్నుంచి వెళ్ళిపోతున్నాను పిన్నీ! మళ్ళీ ఎప్పుడొస్తానో ఏమిటో! నా యీ చిన్న కోరిక తీర్చలేవా పిన్నీ"

జాలేసింది సవితాదేవికి.

"సరే! మీ అమ్మతో చెప్పి అనుమతి తీసుకునిరా. వీలైతే ఆమెనీ రమ్మనిపిలు"

శ్యామల సంబరానికి అంతులేదు. లేడి పిల్లలా చెంగు చెంగున మెట్లు దిగింది.

తల దువ్వుకోవటం ముగించి బొట్టుదిద్దుకొని బయలు దేరింది సవితాదేవి. తలుపు మూసి తాళం పెట్టి మెట్లు దిగాడు కుప్పుసామి. కింద స్టూడియో కారు. పక్కన చక్కగా ముస్తాబై తండ్రితో బాటు నిలబడి వుంది శ్యామల.

"నాన్నకూడా వస్తున్నారు పిన్నీ నాతో" అంది వుత్సాహంగా. కారు స్టార్టు కాబోతుండగా కోపంతో రుసరుసలాడుతూ వీధిలో కొచ్చింది శ్యామల తల్లి.

"బుద్ధిలేకపోతే సరి. కూతురు సినిమా దాని వెంబడి పోతానంటే నాలుగు తన్ని కూర్చోబెట్టాల్సింది పోయి తగుదునమ్మా అంటూ తనూ తయారవుతాడా? సిగ్గులేని జన్మలు"

"ఇదుగో విశాలం. ఇప్పుడేం కొంప మునిగిందని ఈ చిందులు ఆఁ..." కార్లోంచి తల బయటకు పెట్టి అరిచాడు రాఘవన్.

"మర్యాదగా అబ్బా, కూతురు దిగొస్తే సరేసరి. లేకపోతే ఈ పసుపు చెడిన కొంపలో నే నొక్క నిమిషం కూడా వుండేది లేదు" అని అల్టిమేటం ఇచ్చేసింది.

తండ్రీ కూతుళ్ళు ఒకరి ముఖాలొకరు చూసుకుని గత్యంతరం లేక కారు దిగారు ఏడుపు ముఖాలతో.

"సినిమాల్లో వేషాలు వేసే వాళ్ళని ఎంత మాటంటే అంత మాటనొచ్చను కుంటారు. సినిమాలు ఎగబడి చూట్టానికి మాత్రం తయారు" కారు స్టార్టుచేస్తూ అన్నాడు డ్రైవర్. కారు వ్యూ ఫైండర్ లోంచి కనిపించే విశాలాన్ని చూస్తూ వుంది సవితాదేవి. కారు బయలుదేరింది. అద్దం లోంచి విశాలం ముఖం డిసాల్వ్ అయి

పోతోంది. ఆ స్థానంలో రంగనాయకి రూపం చోటు చేసుకుంది.

"అమ్మా!" అప్రయత్నంగా వెలువడింది ఆ మాట.

"ఏమైందమ్మా?" అదుర్దాగా అడిగాడు డ్రైవరు పక్కనే కూర్చున్న కుప్పుసామి వెనక్కి తిరిగి.

"ఏం లేదులే"

ఆర్కాటు రోడ్డుమీద ఎదురుగా వచ్చే బస్సుల్నీ, కార్లనీ తప్పించుకుంటూ ముందుకి సాగిపోతూవుంది కంపెనీ కారు. గడిచిపోయిన జీవితపు రహదారుల్లోంచి వెనక్కి ఇంకా వెనక్కి వెళ్ళి ఇరుకు సందుల్లోకి మళ్ళుతున్నాయి ఆమె ఆలోచనలు

"అమ్మా...!" ఆక్రోశించింది సవితాదేవి హృదయం.

'నువ్వు బతికుంటే నా జీవితం ఈనాడింత నికృష్టంగా తయారై వుండేది కాదు కదమ్మా?'

నన్ను కడుపులో దాచుకుని కాపాడుకుని వుండే దానివి కాదూ!

తన జీవితం ఇలా పతనం కావటానికి విశ్వమూర్తి చెప్పిన కారణం ఆమె చెవుల్లో ప్రతిధ్వనించింది.

"అన్నిటికన్న విలువైంది మీకు దక్కకుండా పోయింది. మీ అమ్మే బతికుంటే మీ జీవితం ఇలా మారి వుండేది కాదేమో! కూతురు జీవితాన్ని తీర్చిదిద్ద గలిగే నేర్పు ఒక్క కన్న తల్లికి మాత్రమే వుంటుంది"

నిజమే! తనకి తెలిసిన తారల తల్లులు తమ కూతుళ్ళని వదలకుండా బాడీగార్డుల్లా వెంట తిరగడం తనకి తెలుసు. యాక్టింగ్ కెరీర్‌కి సంబంధించని వాళ్ళతో స్నేహం చేసినా, ఆకర్షణకి లోనయ్యే సూచనలు కనబడినా కళ్ళురిమి చూసేవారు. వారి సంపాదనమీదే ఆధారపడుతున్నా కూతుళ్ళని అనుక్షణం తమ అధీనంలో వుంచుకోటానికి ప్రయత్నించే వాళ్ళు. తమ చెయ్యి దాటి పోతారనే భయం వాళ్ళకి. అప్పుడంతా వాళ్ళని చూసి జాలిపడి, తన స్వేచ్ఛని తల్చుకుని మురిసిపోయింది తను. కాని....కాని ... ఇప్పుడర్థమవుతోంది-ఆ నియమాలూ, నిబంధనలూ జీవితం సక్రమంగా నడవటానికి ఎంత అవసరమైనవనే విషయం.

షూటింగు మొదలైంది. బరువైన సన్నివేశం. ఆవేశంతో డైలాగులు చెబుతోంది సవితాదేవి. మధ్యలో గొంతు పట్టుకున్నట్లయింది. తెరలు తెరలుగా ముంచుకొచ్చిన దగ్గు మూడు నిముషాలదాకా తగ్గలేదు. రెండు మూడు టేక్‌లు వృథా అయినాయి. వేణ్ణీళ్ళలో బ్రాందీ కలిపి తెచ్చిచ్చాడు డైరక్టర్ దశరథరామయ్య.

"ఎలాగోలా ఓపిక పట్టి సముదాయించుకోండి. ఎల్లుండికి ఫారిన్ వెళుతున్నాడు ప్రకాష్‌బాబు. ఆలోగా పిక్చర్ పూర్తి చేసెయ్యాలి" మందలింపు, బతిమిలాట రెండూ ధ్వనించేలా అన్నాడు దశరథరామయ్య. ఆ రాత్రంతా విరామం లేకుండా షూటింగు కొనసాగింది. ప్రాణాలుగ్గబట్టుకుని నటించింది సవితాదేవి.

"ఎంత చెడ్డా ఆవిడా మనిషేనండీ. ఎవరో ఫారిన్ వెళుతున్నారని అమాయకురాలైన ఆడమనిషిని చంపేస్తున్నారు. ఏం మనుషులండీ!" అని మొదటిసారిగా దశరథరామయ్య మీద మండి పడ్డాడు కృష్ణమోహన్.

మరుసటి రోజంతా షూటింగ్ కార్య

క్రమం ఏర్పాటైంది. మధ్యలో ఓ గంట సేపు మాత్రం విరామం. మళ్ళీ తెల్లవారు జామున షూటింగు మొదలైంది.

షుమారు పదిగంటల సమయం. అంత సేపూ బలవంతాన అణిచి పెట్టుకున్న దగ్గుతెరలు పెళ్ళగిలి రాసాగినయ్. రుమాలు నోటికడ్డం పెట్టుకుని ఖంగు ఖంగుమని దగ్గుతోంది సవితాదేవి. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. స్పృహతప్పి అమాంతంగా నేలకొరిగి పోయింది.

ఏరోజు వార్తల్ని ఆరోజే ప్రచురించే ఓ స్థానిక ఈవినింగ్ న్యూస్ పేపర్లో "సవితాదేవికి నెత్తురు వాంతులు" అనే వార్త పతాక శీర్షికలో ప్రచురింపబడింది. మర్నాటి వుదయం మరో పత్రిక "ఆసుపత్రిలో సవితాదేవి" అనే హెడ్డింగుతో ఆమె వ్యాధి గురించి, ముందురోజు షూటింగులో 'ఫెళ్ళు ఫెళ్ళుమని' ఆమె చేసుకున్న నెతురు వాంతుల గురించి వర్ణనలతో అరపేజీ వార్తల్ని నింపేసింది. రెండో రోజునుంచీ 'సంధ్యారాగం' పత్రిక్కీ, 'తొలికిరణాలు' పత్రిక్కీ సవితాదేవిని గురించిన వార్తలందించటంలో పోటీ మొదలైంది.

'ప్రాణాలతో సవితాదేవి పోరాటం' అని ఒక పత్రిక హెడ్డింగు పెడితే 'చావు బతుకుల మధ్య సవితాదేవి' అంటూ మరో పత్రిక.బతుకు పోరాటంలో నలిగిపోతున్న కాలంలో ఆమెని గురించి ఏమాత్రమూ పట్టించుకోని పత్రికలూ, ప్రేక్షకులూ, మృత్యువుతో పోరాడుతున్న ఆమెని గురించిన వార్తల పట్ల అత్యంత కుతూహలం కనబరుస్తున్నారు. ఇలా తొమ్మిది రోజులు గడిచాయి.

పదో రోజు "డాక్టర్ల పెదవి విరుపు. సవితాదేవికి చివరి ఘడియలు" అని మొదటిపేజీలో పతాక శీర్షికలో ప్రచురించి అదే పేజీలో కింద నాలుగు కాలమ్‌లలో "సవితాదేవి పడక మీద ప్రముఖ నటుని కన్నీళ్ళు" అంటూ ఆమెని చూట్టానికి రాంప్రభు వచ్చిన వార్తని గోరంతలు కొండంతలు చేసి ప్రచురించారు. ఆ పక్కనే బాక్సుకట్టి మరో ఫ్లాష్.

"పాఠకులకు గమనిక – ఇరవై రెండేళ్ళ క్రితం మా దీపావళి సంచికలో తన వైవాహిక జీవితం గురించి సవితాదేవి రాసిన ప్రత్యేక వ్యాసాల్ని మా పాఠకుల కోసం ఇదే సంచిక అయిదవ పేజీలో పునర్ముద్రిస్తున్నాము"

అభిమాన పాఠకులు ఆసక్తిగా ఐదో పేజీలోకి వెళ్ళిపోయారు.

"ఇల్లాలిగా నా తొలి దీపావళి" అనే శీర్షికతో మొదలైంది వ్యాసం—

"చాలా కుటుంబ చిత్రాల్లో నటిస్తున్నాను. అంచేత అసంఖ్యాకమైన గృహిణుల అభిమానానికి పాత్రురాలనవుతున్నాను. అభిమానులు నాకు రాసే వుత్తరాలు రోజూ వందల సంఖ్యలో వుంటున్నాయి.

"అక్కయ్యా మిమ్మల్ని నా తోబుట్టువుగా భావించి పూజిస్తూవుంటాను. నాకు ఇటీవలే మావారితో వివాహమైంది. మీరు మీ తొలి దీపావళి పండుగ ఏ విధంగా జరుపుకున్నారో తెలుసుకోవాలని కుతూహలంగా వుంది. నేనూ అలాగే జరుపుకోవాలని అనుకుంటున్నాను. దయచేసి తెలుపుతారా?" ... ఇలాంటి వుత్తరాలెన్నో! అందరికీ విడివిడిగా వుత్తరాలు రాయటం సాధ్యంకాదు గనుక పత్రికా ముఖంగా నా అనుభవాలని

అందిస్తున్నాను.

ముందుగా శ్రీవారితో నా జీవితం ముడిపడిన వైనం గురించి చెప్పాలని వుంది. నా మొదటి రెండు చిత్రాలు బ్రహ్మాండంగా విజయవంతమైనాయని మీకందరికీ తెలుసు. హౌస్‌ఫుల్ కలెక్షన్లతో, శతదినోత్సవాలు జరుపుకున్నాయి. ఆ సందర్భంలో ఒకరోజు శ్యాంప్రసాద్ గారు మా ఇంటి" కొచ్చారు.

"కొత్తగా ఒక చిత్రం తీస్తున్నాము. నువ్వు హీరోయిన్‌వి అన్నారు.

"హీరో ఎవరండి?" అడిగాను.

"హీరో కొత్తవాడు. ఇదే అతనికి 'మొదటి చిత్రం" అని చెప్పారు. ఒప్పేసుకున్నాను. సెట్టుమీద అతన్ని చూసి నిర్ఘాంతపోయాను. ఎంచేతనంటే డైరక్టర్ శ్యాంప్రసాద్‌గారికి అతను కొత్త మొహమేమోగాని నాకు మాత్రం పరిచయమైన ముఖమే! నేను సినిమా రంగానికి రాకముందు కొన్ని నాటకాల్లో నటించి వున్నాను. ఒక నాటకంలో నా సరసన ఒక చిన్న సన్నివేశంలో అతను నటించాడు. కొన్ని నిమిషాల పాటు మాత్రమే స్టేజిమీద అతను కనిపిస్తాడు. కాని ఆకొద్ది నిమిషాల్లోనే అతని రూపం నా హృదయ ఫలకం మీద చెరగని ముద్ర వేసింది. ఆ తరువాత మొదటి సారిగా అతన్ని స్టూడియో సెట్స్‌మీద చూడగానే నాలో ఏదో వర్ణనాతీతమైన మధురానుభూతికి లోనయ్యాను. ఆ చిత్రంలో అతను నా ప్రియుడు. ఆ తరువాత భర్త. చాలా దగ్గరగా, సహజంగా నన్ను నేను మైమరచి అతనితో నటించాను. చిత్రం పూర్తయ్యేలోగా మా ఇద్దరి మధ్య అనురాగ లతలు చిగురించి గాఢంగా పెనవేసుకున్నాయి. కాని తమాషా ఏమిటంటే సినిమా కథల్లోలాగా మా ప్రేమకీ ఎన్నో అడ్డంకులు ఏర్పడ్డాయి. నాలుగేళ్ళు గడిచాకే అంటే గత సంవత్సరమే మేమిద్దరం సాంసారిక జీవితం ప్రారంభించింది. మాది ఆదర్శ వివాహం. గత దీపావళే నా తొలి దీపావళి. కంచి నుంచి వారు ప్రత్యేకంగా నాకో పట్టుచీర కొని తెచ్చారు. రంగు కూడా నాకు చాలా ఇష్టమైన లేతాకు పచ్చరంగు. మా చిరంజీవికి కొత్త బట్టలు కొన్నాము. మేం ముగ్గురం టపాకాయలు కాల్చి ఆనందంగా పండుగ జరుపుకొన్నాము. మా వారికి 'ఢాం' టపాకులంటే భయం. అంచేత వారు కాకర పువ్వొత్తులుమాత్రమే కాల్చారు. మా చిరంజీవికి మూడేళ్ళు నిండి నాలుగో ఏడు అడుగు పెట్టింది. మహా తుంటరి వెధవ. ఆ ముఖం, ఆ నడక, ఆ చిలిపి చూపులు, మాటలతీరు, అంతా అచ్చం వాళ్ళ నాన్న పోలిక. మా వారిలో నాకు బాగా నచ్చిందీ, నన్నాకట్టుకునేదీ వారి సరళమైన స్వభావం. ఎవరితోనైనా ఇట్టే స్నేహం చేయగల మనస్తత్వం వారిది. సరదాకైనా ఎవరినీ పల్లెత్తుమాట అనలేరు. అంచేతే వారంటే అందరికీ ఎంతో అభిమానం, గౌరవం. ఇటువంటి వ్యక్తి నాకు భర్తగా లభించటం నా అదృష్టంగా భావించి వుప్పొంగిపోతూ వుంటాను. నా వంటకాలంటే వారికెంతో ఇష్టం. ముఖ్యంగా బంగాళాదుంప వేపుడు, కాకరకాయ చిప్స్ అంటే ప్రాణం. కొసరి కొసరి వేయించుకుని తింటారు ... ఇలా సాగిపోయిందా వ్యాసం.

* * *



అరవై అయిదు రోజుల తర్వాతే సవితాదేవి మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది. చుట్టూ తెల్లగా మెరిసే గోడలు, ఇనుప మంచంమీద తెల్లటి దుప్పటి పరిచి వున్న పరుపు, పక్కనే చిన్న టేబిలు, దానిమీద ఫ్లాస్కు, గ్లూకోసు పాకెట్టు, మొదలైన సరంజామా కళ్ళు తెరవగానే ముందుగా పక్కనే స్టూలుమీద కూర్చుని వున్న విశ్వమూర్తి కనిపించాడు. ఆ స్పెషల్ వార్డు గదిలో ఓ మూలగా స్టవ్

మీద ఏదో వేడి చేస్తున్నాడు కుప్పుసామి.

"కుమార్ వచ్చాడా ?" కుప్పుసామి కేసి తిరిగి అడిగింది సవితాదేవి.

"మీకు ప్రమాదంగా వున్నప్పుడు ఒకటి రెండుసార్లు వచ్చి వెళ్లాడు. అప్పుడు స్పృహలో లేరు మీరు" చెప్పాడు విశ్వమూర్తి. స్టవ్ మీదనించి పాలగిన్నె దించి పాలు కలుపు కొచ్చాడు కుప్పుసామి.

"పాపం ఈ అబ్బాయి, ఆ క్రిష్ణ మోహనయ్యగారూ ఈళ్లిద్దరేనమ్మా రోజూ వచ్చి మంచీ సెడ్డ కనుక్కుని డాక్టర్లతో మాట్లాడి వెళుతూ వున్నారు" అన్నాడు కుప్పుసామి.

"గుడ్‌మార్నింగ్ సవితాదేవిగారూ" అంటూ వచ్చింది నర్సు చేతిలో సిరంజితో.

"పెద్ద గండం గడిచి బయటపడ్డారు. ఇకనేం భయం లేదు" అని చిరునవ్వుతో ఇంజక్షన్ చేసి వెళ్ళింది.

స్టూడియో సెట్సుమీద ఆరోజు స్పృహ లేకుండా పడిపోయిన సవితాదేవిని వెంటనే ఈ ప్రైవేటు నర్సింగ్ హోమ్‌కి తీసు కొచ్చాడు కృష్ణమోహన్. ఆ రోజే కుమార్‌కి కబురు చేశాడు. అయినా మూడురోజుల తరువాత గాని తల్లిని చూడ్డానికి రాలేదు కుమార్. వచ్చినవాడు అర్ధగంటైనా వుండకుండా వెళ్ళిపోయాడు.

మెల్లమెల్లగా లేచి అటూ ఇటూ తిరగ్గలుగుతోంది సవితాదేవి. ఒళ్ళు పూర్తిగా నయమైందని, మరో అయిదు రోజుల్లో డిశ్చార్జి అయి వెళ్ళిపోవచ్చని చెప్పారు డాక్టర్లు.

"అయితే ఒక్క సంగతి మాత్రం గుర్తుంచుకోండి సవితాదేవిగారూ! మందులు మనిషిని కొంతకాలం మాత్రమే కాపాడగలవు. మా ప్రయత్నం వృథా పోకుండా వుండాలంటే, మీరింకా ఎక్కువ కాలం బతకాలి అనుకుంటే మీరు ఇక నుంచైనా తాగుడు మానాలి" అని గట్టిగా హెచ్చరిక చేశారు.

ఆ సాయంత్రం విశ్వమూర్తి, కృష్ణ మోహన్ ఇద్దరూ కలిసే వచ్చారు నర్సింగ్ హోమ్‌కి.

ఈ రెండు నెలల్లో వారిద్దరికీ బాగా స్నేహం కలిసింది. మంచి మిత్రులయ్యారు. సవితాదేవిని కనిపెట్టుకుని వుండటం కోసమని కృష్ణమోహన్ రెండు మూడు అవుట్‌డోర్ కాల్‌షీట్లని కూడా కేన్సిల్ చేసుకున్నాడు.

"నేను ఇండస్ట్రీకి దూరమయ్యాక నా అనుకున్న వాళ్ళంతా కూడా నాకు దూరమయ్యారు. నా కెవ్వరూ లేరను కున్నాను. నేనెవరి కోసం బతకాలి? బతికి ఏం చేయాలి ? నన్నెందుకు బతికించారు బాబాయ్?" కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ అన్నది సవితాదేవి.

"పోనీ ఎవరికోసం చావాలో, చచ్చి ఏం సాధించాలో అదైనా చెప్పు" అన్నాడు కృష్ణమోహన్ నవ్వుతూ.

"చూడండి సవితాదేవిగారూ! మనిషి పుట్టింది అర్థాంతరంగా చావటానిక్కాదు. మనిషి తనకోసం బతకటమే కాకుండా తన వాళ్ళకోసం కూడా బతకటంలోనే జీవితం విలువని సంతరించుకుంటుంది"

"రక్తం పంచుకుని పుట్టిన వాళ్ళకే నే నక్కర్లేక పోయానే ఇక నావాళ్ళంటూ ఎవరు మిగిలారు నాకు".

"రక్తం పంచుకుని పుట్టిన వాళ్ళే తన వాళ్ళు అనుకునేట్లయితే ఈ ప్రపంచంలో సగం మంది అనాథలనుకోవాలి. ప్రతి మనిషి జీవితానికీ ఓ విలువ వుంటుంది

సవితాదేవిగారూ. ప్రయత్నించాలేగాని. నేనూ, కృష్ణమోహన్ గారూ మీకేమీ కామా. చెప్పండి" అన్నాడు విశ్వమూర్తి.

ఆ ఆత్మీయతని భరించలేక సవితా దేవికి దుఃఖం పొర్లుకొచ్చింది.

"ఇంత ఖరీదైన ట్రీట్‌మెంటు నాకవసరమేనా చెప్పండి. ఇక్కడ వున్న వాళ్ళని చూస్తే అంతా పెద్ద పెద్ద ధనవంతుల్లా వున్నారు? ఎంత ఖర్చయిందో ఏమో? తల్చుకుంటే నాకు భయంగా వుంది"

"నీకొచ్చిన వ్యాధి కూడా ఖరీదైందేనమ్మా" అన్నాడు కృష్ణమోహన్.

"చందాలు వసూలు చేశారా బాబాయ్?"

"ఛీ! ఛీ! అయినా ఫీల్డులో వున్న వాళ్ళంతా స్వార్థపరులే అనుకున్నావా సవితా! సహృదయం,మానవత్వం కలిగిన వాళ్ళింకా కొందరు మిగిలే వున్నారమ్మా. అందుకే ఈ ఇండస్ట్రీ ఈ మాత్రమైనా నిలబడివుంది" అన్నాడు కృష్ణమోహన్.

కళ్ళు మూసుకుని మౌనంగా వుండి పోయింది సవితాదేవి.

"నేనూ, నాతోబాటు కొందరు సపోర్టింగ్ యాక్టర్లు, మధ్య రకం టెక్నీషియన్లు, నాకు తెలిసిన మరి కొందరు మిత్రులు అడిగిందే తడవుగా సహాయపడ్డారు" అన్నాడు కృష్ణమోహన్.

విశ్వమూర్తి తను తెచ్చిన న్యూస్ పేపర్ల కట్టను విప్పుతున్నాడు.

"ఇదేవిఁటయ్యా పత్రికా పారాయణం చేస్తున్నావు ఇప్పుడు?" అన్నాడు కృష్ణమోహన్ నవ్వుతూ.

"ఆ రోజు సవితాదేవి స్పృహతప్పి పడిపోయిం దగ్గర్నుంచి మొన్న మొన్నటి దాకా మన ఘనత వహించిన పత్రికలు ఈవిడ్ని గురించి ఏం కూతలు కూశాయో తెలుసాండి? ఈ రోజు ఛస్తుంది, రేపు ఛస్తుంది అన్నట్టు పతాక శీర్షికలు వేశాయండీ. ఎంత సిగ్గు చేటు జర్నలిజమో చూడండి" అన్నాడు విశ్వమూర్తి ఛీదరించుకుంటూ.

"వాళ్ళూ బతకాలి కదా మరి" బలహీనంగా నవ్వుతూ అంది సవితాదేవి.

"ఆఁ వాళ్ళు బతకాలి. మీరు చావాలి అంతేనా! మొత్తానికి మీ అనారోగ్యంతో బాగా డబ్బు చేసుకున్నాయి ఈ పత్రికలు" అన్నాడు. కృష్ణమోహన్.

"నువ్వా వార్తలన్నీ చదివి వుంటే నిజంగానే చచ్చిపోయి వుండేదానివేమో సవితా"

"ఇటీవల ఇలాగే పైకొస్తూన్న ఓ నటుడ్ని గురించి చిలవలు పలవలు కల్పించి అతనికి మతి భ్రమించిందనీ, దయ్యం పట్టిందనీ రకరకాలుగా రోజుకో వార్త ప్రచురించారు. మీరన్నట్టు అతనవన్నీ చదివి వుంటే నిజంగా పిచ్చివాడై వుండేవాడు" అన్నాడు విశ్వమూర్తి.

"ఎవర్ని గురించి ఇలా రాస్తున్నామో, మళ్ళీ వాళ్ళ దగ్గరికే పళ్ళికిలించుకుంటూ వార్తలకోసం వెళ్ళాల్సి వస్తుందన్న ఇంగితం కూడా లేదు వీళ్ళకి" అన్నాడు కృష్ణమోహన్.

"అవునండీ కృష్ణమోహన్‌గారూ! మీకు ఆర్టిస్టు అసోసియేషన్ ఒకటి వుండాలనుకుంటాను. ఇటువంటి అవకాశవాదులైన విలేకర్లమీద మీ అసోసియేషన్ ఏమీ చర్య తీసుకోలేదా?" అడిగాడు విశ్వమూర్తి.

"అసోసియేషన్‌కేం భేషెగ్గా వుంది.

దానికో ప్రెసిడెంటు, ట్రెజరరూ, కార్యదర్శి వగైరాలంతా కూడా వున్నారు. కాని మీరన్నట్టు పత్రికల్ని కంట్రోల్ చెయ్యడానికో, జూనియర్ ఆర్టిస్టులకి జరిగే అన్యాయాల్ని అరికట్టడానికో మాత్రం కాదు. పత్రికల వాళ్ళకి డిన్నర్ పార్టీలు, మందు పార్టీలు ఇచ్చి ప్రసన్నం చేసుకుని, పత్రికల్లో ఫొటోలు వేయించుకోటానికీ, భట్రాజు పొగడ్తలు పొగిడించుకుని వీలైతే సన్మానాలు చేయించుకోవటం- ఇదే ఈ అసోసి



యేషన్ ప్రధాన లక్ష్యాల కింద మారి పోయినయ్.

నిజమైన కార్యదీక్షతో, ఇండస్ట్రీలోని వర్కర్ల కోసం, తెరమీద గుర్తింపబడని టెక్నీషియన్ల కోసం ఎవరైనా ముందు కొస్తే వాళ్ళని కమ్యూనిస్టులనీ, తీవ్ర వాదులనీ ముద్రలు వేసి తొలగించటం కూడా జరుగుతూ వుంటుంది. ఇదండీ మా అసోసియేషన్ల ఘనత" అంటూ వివరించాడు కృష్ణమోహన్.

అతని పరిచయం వల్ల విశ్వమూర్తికి సినిమా పరిశ్రమని గురించి, అందులోని వ్యక్తుల్ని గురించి, ముఖ్యంగా రాజకీయాల గురించి అంతకు ముందు తెలీని చాలా విషయాలు తెలుస్తున్నాయి. ఈ రంగంలో వున్న వాళ్ళంతా ఒకే మూసలో పోసిన మనుషుల్లా సంచరిస్తారనీ, బయటి ప్రపంచాన్ని గురించి ఏమీ అవగాహనలేని వాళ్ళనీ అనుకునేవాడు. కాని కృష్ణ మోహన్ చెప్పిందాన్నిబట్టి ఇక్కడకూడా తక్కిన రంగాల్లో వలెనే సామాజిక చైతన్యం కలిగిన వాళ్ళు కొందరు వున్నారన్న సంగతి తెలుసుకున్నాడు.

బాగా చీకటి పడింది.

విశ్వమూర్తి, కృష్ణమోహన్ వెళ్ళడానికి లేచారు.

"మొన్న మీ అబ్బాయి కుమార్ కనిపించాడు. డిశ్చార్జి అయిన తరవాత వచ్చి నిన్ను తన ఇంటికి తీసుకెళ్ళడానికి సమ్మతించాడు. ఈ పరిస్థితుల్లో నువ్వు అతని దగ్గర వుండటమే మంచిది సవితా. అనాథలా బతకాల్సిన కర్మ నీ కేమొచ్చింది చెప్పు" అన్నాడు కృష్ణ మోహన్.

అడ్డు చెప్పలేక ఏదో ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయింది సవితాదేవి.

తను తారగా ప్రకాశించే రోజుల్లో తండ్రి వేపు చుట్టంగా వచ్చి,పిల్లా జెల్లాతో తన ఇంట్లోనే స్థిరపడిపోయింది యశోదమ్మ. పదేళ్ళపాటు తన సంపాదన తింటూ కూర్చుంది.

తన కూతుర్ని కూడా సినిమా స్టార్‌ని చెయ్యాలనే వుబలాటం పట్టుకుంది ఆమెకు. ఓ మోస్తరు అందంగా వున్నా నటికి కావాల్సిన టాలెంటుకొంచెం కూడా లేదు ఆ అమ్మాయికి. మాట వుచ్చారణ కూడా సరిగా ఉండదు. ఆమె పాచిక పారకపోయేసరికి తనమీద కక్ష కట్టినట్టు ప్రవర్తించసాగింది యశోదమ్మ. తన పథకం ఫలించక పోయేసరికి ఎర్రగా బుర్రగా వున్న కూతుర్ని ఎరగా వేసి కుమార్‌ని అల్లుణ్ని చేసుకుంది. కుమార్ కూడా వాళ్ళ మాయలో చిక్కుకున్నాడు.

"కుమార్! ఈ విషయంలో తొందర పడుతున్నావేమో నిదానంగా ఆలోచించి నిర్ణయం తీసుకో" అని హెచ్చరించింది తను.

"రాంప్రభు విషయంలో నువ్వు పడిన తొందరపాటు కన్న ఇదేమీ చెడిపోలేదులేమ్మా" అన్న వాడి మాటలు ఇంకా తన చెవుల్లో గింగురుమంటున్నాయి.

అంతా పోగొట్టుకుని, వట్టి చేతులతో నిస్సహాయంగా తను నిలబడినప్పుడు వాళ్ళతో చేరి కొడుకు కూడా తనని చులకన చేసి మాట్లాడేడు. అయినా పల్లెత్తుమాట అనలేక పోయింది. ఎన్ని అన్నా, ఎంత అవమానించినా తనకంటూ మిగిలింది వాడొక్కడే అనుకుంది. అందుకే వాడిని దూరం చేసుకోవాలని పించలేదు. అప్పుల వాళ్ళకి పోకుండా మిగిలిన ఆ ఒక్క ఇంటినీ వాడికే వది

రేసింది. ఇంటి బాడుగ పేరుతో నెల నెలా వాడు పంపే ఆ మూడొందల రూపాయలే చాలనుకుని తను వేరుగా వుండటానికి నిశ్చయించుకుంది.

ఇప్పుడు మళ్ళీ వాళ్ళింటికి వెళ్ళి వుండమంటున్నాడు కృష్ణమోహన్. ఉండగలదా తను? ఉండనిస్తారా వాళ్ళు?

ఆలోచనలోంచి బయటపడాలనే ఉద్దేశంతో విశ్వమూర్తి వదిలి వెళ్ళిన పత్రికల్ని తెరిచి ఒక్కొక్కటీ తేదీల వారీగా చదవసాగింది సవితాదేవి.

"సవితాదేవి పడక మీద రాంప్రభు కన్నీళ్ళు" అనే శీర్షిక కింద తను స్పృహలో లేనప్పుడు రాంప్రభు నర్సింగ్ హోమ్‌కి రావటం, తన బెడ్ మీద కాసేపు కూర్చుని డాక్టర్లతో ఏదో మాట్లాడి వెళ్ళటం మొదలైన వివరాల్ని వర్ణిస్తూ రాయబడిన ఆ వార్తల్ని చదివి తనలో తను నవ్వుకుంది సవితాదేవి.

ఆ వార్తలతోపాటు అయిదో పేజీలో తన మొదటి దీపావళి పండగని గురించి ప్రచురించబడిన 22 ఏళ్ళ నాటి వ్యాసం కూడా చదివింది. నిజంగా అది తను రాసింది కాదు. ఆ రోజుల్లో అసలు తనకంత తీరికెక్కడిది? కలగా పులగంగా తను చెప్పిన విషయాల్ని క్రోడీకరించి ఆ పత్రికా విలేకరే తయారుచేసి తన పేరు తగిలించాడు ఆ వ్యాసానికి.

వ్యాసాన్ని చదివి విషాదంగా నవ్వుకుంది సవితాదేవి. దానికి వెనుక దాగిన కథని, చాలా మందికి తెలీని నిజమయిన కథని పునశ్చరణ చేసుకుంటూ బాధగా భారంగా కళ్ళు మూసుకుంది.



సినిమాల్లో చేరడానికి ముందు నాటకాల్లో నటించి అనుభవం గడిస్తే మంచిదనే ఉద్దేశంతోనూ, సినిమా ఛాన్సు వచ్చేదాకా ఊరికెనే కూర్చుని తింటూ వుండటం సాధ్యం కాదని తెలిసిన వాడవటంచేతనూ తండ్రి తనని నాటకాల్లో ప్రవేశపెట్టాడు. అప్పుడు తనకి పదిహేనేళ్ళు. దాదాపు ఏడెనిమిది నాటకాల్లో వేషాలు వేసింది. అన్నీ అమెచ్యూర్ నాటకాలే.

చివరి నాటకంలో రాంప్రభు సవితాదేవి సరసన ఒక చిన్న వేషం వేశాడు. ఏదో ట్రావెల్ ఏజెన్సీలో ఉద్యోగం అతనికి. తెనాంపేటలో ఒక ఇంటి డాబా మీద రిహార్సల్సు జరిగేవి. ఎంతో హుషారుగా, అందరినీ కవ్విస్తూ నవ్విస్తూ మాట్లాడేవాడు రాంప్రభు. అంతకు ముందు నాటకాల్లో ఎంత మందితోనో హీరోయిన్‌గా నటించింది. కాని వారి పరిచయం నాటకానికి మాత్రమే పరిమితం. అంతకు మించిన చనువుని వాళ్ళతో పెంచుకునేది కాదు. ఇతని విషయంలో మాత్రం ఎందుకో మొదటి పరిచయంలోనే అతను తనకెంతో ఆత్మీయుడిగా కనిపించాడు. తనకి తెలీకుండానే ఒక రకమైన ఆకర్షణకి గురైంది.

"నీలాగే నాకూ ఎన్నో కోరికలువున్నాయి సవితా! సినిమాల్లో చేరి హీరోనై పేరూ, డబ్బు సంపాయించాలని కలలు కంటూ వుంటాను" అన్నాడు రాంప్రభు ఒక

నాడు.

రిహార్సల్స్ ముగిసిం తరువాత రోజూ తనని స్కూటర్ మీద ఇంటి దగ్గర డ్రాప్ చేసేవాడు.

"నాకు సినిమాల్లో చేరాలని వుందని ఎవరు చెప్పారు మీకు ?" నవ్వుతూ అడిగింది.

"మరి అయితే ఈ నాటకాలూ అవీ ఎందుకో ?"

"మా నాన్న కోసం. నన్ను గొప్ప నటిని చేసెయ్యాలని తాపత్రయ పడి పోతున్నాడు పాపం"

"సినిమాల్లో చేరటం ఇష్టం లేకపోతే మరింకేం చెయ్యాలనుకుంటున్నావు ?" అడిగాడు రాంప్రభు.

కొద్ది క్షణాలు ఆలోచించి "మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను" అంది చిలిపిగా.

ఇద్దరూ విరగబడి నవ్వుకున్నారు. ఆ నాటకం ప్రారంభోత్సవానికి ఎంతో ప్రయాసపడి అప్పుడప్పుడే పైకొస్తోన్న ఒక డైరక్టర్ని పిల్చుకొచ్చాడు రాంప్రభు.

నాటకం ముగిసింది. నాటకం బాగా లేకపోయినా సవితాదేవి నటన ఆ డైరక్టర్ని బాగా ఆకట్టుకుంది. గ్రీన్ రూంలో కొచ్చి తనని అభినందించాడు.

"మా ప్రొడ్యూసర్లకి చెప్పి చూస్తాను. అదృష్టం వుంటే వాళ్ళు తీసే నెక్స్ట్ పిక్చర్ లోనే నీకు వేషం దొరకొచ్చు" అని చెప్పి వెళ్ళాడు.

తన కన్నా కూడా రాంప్రభు అమితంగా సంతోషించాడు.

"సినీస్టార్ వైపోతున్నావు సవితా ! అతనన్నట్టు నీకు హీరోయిన్ వేషం దొరికిందంటే నాకేమిస్తావ్ చెప్పు ?" అన్నాడు కొంటెగా తనకేసి చూస్తూ

"నన్నే ఇచ్చుకుంటాను రాం" అని చెప్పాలనిపించింది. తృప్తిగా అతని కళ్ళలోకి చూసి నవ్వింది సవితాదేవి.

"ఈ డైరక్టర్ చాలా మంచివాడు. నిర్మాత కూడా అందరిలాంటి వాడు కాదు. మంచి అభిరుచులున్న మనిషి. గౌరవమైన వ్యక్తి. అవకాశం వచ్చిందంటే వెంటనే ఒప్పేసుకో. నీ వ్యక్తిత్వాన్ని, ఆత్మ గౌరవాన్ని అమ్ముకో నవసరం లేకుండా నటించొచ్చు వాళ్ళ ప్రొడక్షన్ లో" అని ధైర్యం చెప్పి ప్రోత్సహించాడు.

మూణ్ణెల్ల తరవాత స్టూడియోనించి పిలుపువచ్చింది మేకప్ టెస్టు కోసం.

టెస్టు జరిగింది.

అనేక కోణాల్లోంచి, వివిధ భంగిమల్లో తన స్టిల్సు తీశారు. కెమేరామాన్ ఓ.కె. చేశాడు. ప్రొడ్యూసర్లు తృప్తిగా తల పంకించారు.

సవితాదేవికి మొదటి చిత్రంలోనే హీరోయిన్ వేషం దొరికింది.

"సార్ ! ఇక మీ అమ్మాయికేం భయంలేదు. మీ ఆశయం నెరవేరింది. త్వరలోనే తారాపథాన్ని అందుకుంటుంది" అన్నారంతరూ. "తారవై ఆకాశానికెగిరి చుక్కల్లో చేరిపోతే నేలమీద వున్న ఈ దీనుడు నీ చూపులకందుతాడా సవితాదేవి" ఏదో డ్రామాలో డైలాగులా చెప్పి కొంటెగా తనకేసి చూశాడు రాంప్రభు.

"నన్ను తారని చేసిందే మీరు కదా స్వామీ. నన్ను నేను మరిచినా మిమ్మల్ని మరువగలనా ! నా బొందిలో ప్రాణమున్నంతవరకూ నా హృదయంలో మీకెప్పుడూ స్థానముంటుంది" అంది

తనూ అదే ధోరణిలో. ఆ మాటలకి తండ్రితోబాటు అక్కడున్న వాళ్ళంతా కూడా హాయిగా నవ్వుకున్నారు.

"చూస్తూవుండు, ఎప్పుడో ఒకరోజు నేనీ ఫీల్డుకి వచ్చి తీరుతాను. ఎంతకాలం వీళ్ళు నన్ను గుర్తించకుండా వుంటారో చూస్తాను. ఆ తరువాత నువ్వూ, నేనూ కలిసి నాయకీ నాయకులుగా నటించి ఫీల్డులో పాపులర్ జంటగా పేరు తెచ్చుకుంటాం. నాకా నమ్మకం వుంది సవితా" అని ఎంతో ఆత్మవిశ్వాసంతో అన్నాడు రాంప్రభు.

సవితాదేవి నటించిన మొదటి చిత్రం విడుదలై బ్రహ్మాండంగా ఆడింది.

ఆమె రెండో చిత్రం కూడా హిట్టయింది. కొంత కాలం దాకా రాంప్రభు జాడలేదు.

ఆఫీసు పనిమీద బొంబాయికి ట్రాన్స్ఫరై వెళ్ళాడని తెలిసింది.

రెండేళ్ళ తరవాత మళ్ళీ స్టూడియోలో రాంప్రభుని కలుసుకుంది సవితాదేవి.

కొంతసేపు తటపటాయించి తన మనసులోని కోరికని వెల్లడించింది.

రాంప్రభు పకపక నవ్వేశాడు.

అర్థంకాక బిత్తరపోయింది సవితాదేవి.

"చూడమ్మాయ్! సినిమా తార పెళ్ళికి తొందరపడిపోకూడదు. మరీ ఇంత అమాయకత్వం పనికిరాదు పిల్లా, ముందు మన పెళ్ళి వెండి తెరమీద జరగాలి.ఆతరువాతే అసలైన పెళ్ళిమనకు.ఏం అర్థంకాలేదా?అయితే విను. హీరోనై,ఏదో పిక్చర్లో నీ పక్కన నటించి, కెమేరామాన్, డైరక్టర్, లైట్ బాయిస్ వగైరాల సమక్షంలో, స్టూడియో సెట్స్ మీద, ఫోకస్ లైట్ల వెలుతురులో నీ మెళ్ళో తాళి కట్టాలి. ఆ తరువాతే మన అసలైన పెళ్ళి. తెలిసిందా" అని అటూ ఇటూ చూసి తన బుగ్గమీద చిటికేసి వెళ్ళిపోయాడు రాంప్రభు.

మూడో చిత్రంలో కూడా హీరోయిన్గా బుక్ అయింది సవితాదేవి.

ఆ చిత్రంలో తనతోబాటు హీరోగా నటించే కొత్త నటుడు తన రాంప్రభువే నని తెలుసుకున్న క్షణం ఆమె ఆనందాశ్చర్యాలకి అంతులేదు. ప్రేమ సన్నివేశాల్లో అంతవరకూ ప్రేక్షకులు కనీ వినీ వుండనంతటి అద్భుతంగా నటించారు సవితాదేవి, రాంప్రభు.

ఆమెకి అతని సరసన నటించటం ఒక అపూర్వమైన అనుభవం. ఆమె ఆ పాత్రలో లీనమై జీవించిందని పొగిడింది ప్రేక్షకలోకం. మొదటి రెండు చిత్రాల కన్నా కూడా ఈ చిత్రం వసూళ్ళ విషయంలో గొప్ప విజయం సాధించింది.

"సినిమా రంగానికో ముచ్చటైన ప్రేమికుల జంట" అంటూ ఇద్దరినీ అభివర్ణించాయి పత్రికలు.

ఈ పాపులర్ జంటని దృష్టిలో వుంచుకుని కథలు తయారు చేయించటం ప్రారంభించారు నిర్మాతలు. వరుసగా మూడు చిత్రాల్లో నాయకీ నాయకులుగా నటించారు సవితాదేవి, రాంప్రభు. ఆ మూడూ విజయవంతమైనాయి.

సంప్రదాయానికీ, ఫార్ములాలకీ చాలా వరకు కట్టుబడిన ఈ సినిమా రంగంలో కొత్త పద్ధతులూ, సరికొత్త ప్రయోగాలూ ప్రవేశ పెట్టాలనే వుత్సాహం గల యువ నిర్మాతలు, దర్శకులు కారుమబ్బుల్లోంచి మెరుపు తీగల్లా అప్పుడప్పుడూ తళుక్కుమనడం కద్దు. అన్నీ అనుకూలించి అదృ

ష్టం కూడా కలిసొచ్చి ఆ చిత్రం విజయవంతమైతే ఆ తరువాతి వాళ్ళకి ఈ దర్శకులు మార్గదర్శకులు కావటం జరగొచ్చు. లేదా డిస్ట్రిబ్యూటర్లూ, థియేటర్ యజమానులూ చెలాయించే పెత్తనం ముందు నిలబడలేక, సరైన థియేటర్లు దొరక్క, సకాలంలో విడుదలగాక, చిత్రం మంచిదైనా బాక్సాఫీసు దగ్గర అపజయం పొందటం కూడా జరగొచ్చు.

కేవలం స్టార్ వేల్యూ మీదనే ఒక చిత్రం యొక్క విజయం ఆధారపడి వుండవలసిన అవసరం లేదని నమ్మే ఒక నిర్మాత ధైర్యంచేసి రాంప్రభుని యాంటీ హీరోగా బుక్ చేసి, అతని సరసన ఒక కొత్త అమ్మాయిని హీరోయిన్‌గా నటింపజేసి చిత్రం నిర్మించాడు. కళాత్మకంగా ఆ చిత్రం, బాగానేవున్నా వసూళ్ళ విషయంలో ఫ్లాప్ అయింది.

ఈ సినిమా రంగంలో ఓ చిత్రమైన సంప్రదాయం పాతుకుపోయి వుంది. ఏ కారణం చేతనైనా ఒక చిత్రం బాక్సాఫీస్ సక్సెస్ అయితే అలాంటి కథ, అదే నటీనటులు, అదే మసాలాలతో వరుసగా చిత్రాలు తీయడాని కెగబడతారు నిర్మాతలు. అదే ఏ కారణాంతరాల వల్లనో చిత్రం ఆర్థికంగా దెబ్బతిండంటే ఆ దర్శకుడు, రచయిత, నటీనటులు కంటబడితేనే అపశకునంగా భావించి దూర దూరంగా తప్పుకు తిరుగుతారు ఈ నిర్మాతలు.

రాంప్రభు నటించిన చిత్రం దెబ్బ తిన్న కారణంగా కొంతకాలం అతనికి చిత్రాలు లేకుండా పోయినయ్. సవితాదేవికి మాత్రం అదివరకే పాప్యులర్ అయిన హీరోలతో నటించే అవకాశాలు వస్తూనే వున్నాయి. ఇండస్ట్రీలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకోగలిగింది.

మెలమెల్లగా షరతులు కాని షరతులు పెట్టడం కూడా ప్రారంభించింది.

రాంప్రభుని తన పక్కన హీరోగా తీసుకుంటే కాల్‌షీట్లు ఇవ్వగలననీ, క్లోజ్‌గా, ఫ్రీగా నటించటం సాధ్యమవుతుందనీ, తప్పకుండా పిక్చర్ సక్సెస్ అవుతుందనీ నచ్చజెప్పి రాంప్రభుకి మళ్ళీ మార్కెట్ తెప్పించింది సవితాదేవి. ఇందులో రాంప్రభు శ్రేయస్సు మాత్రమే గాక తన స్వార్థం కూడా ఇమిడి వుందని ఆమెకీ తెలుసు. అతనికి సినిమాల్లో అవకాశాలు తగ్గిపోతే విరక్తితో తనకి క్రమంగా దూరమైపోతాడేమోనన్న శంక ఆమెకి లేకపోలేదు. అంతేకాదు తను తారగా వెలిగి పోతూవుంటే అవకాశాలు రాని రాంప్రభు కాంప్లెక్సుకి లోనై, న్యూనతా భావంతో తనతో మునుపటంత చనువుగా, సరదాగా వుండటం లేదన్న సంగతి కూడా ఆమె గ్రహించగలిగింది. ఏమైనా సరే అతను తనకు దూరం కాకూడదు. అతణ్ణి తనవాణ్నిగా చేసుకోవాలి. ఈ లక్ష్యంతోనే రాంప్రభుని మళ్ళీ ఇండస్ట్రీలో నిలబెట్ట గలిగింది సవితాదేవి.

"రాం! ఇంకా ఎంత కాలమని సినిమాల్లో మాత్రం భార్యా భర్తలుగా నటిస్తూ వుంటాం చెప్పు. నువ్వు కోరుకున్నట్టుగానే ఈనాడు ఇండస్ట్రీలో నీకో స్థానం వచ్చింది. స్టార్‌గా నిలబడ గలిగేవు. ఇప్పటికే మనల్ని గురించి చాలా పుకార్లు ప్రచారంలో వున్నాయి. ఇకనించైనా మనిద్దరం కలిసే జీవించాలని తీర్మానించుకున్నాను. ఏమంటావు?" అని అడిగింది సవితాదేవి.



వెంటనే ఏం సమాధానం చెప్పాలో తోచక తికమక పడిపోయాడు రాంప్రభు. ఆమె హఠాత్తుగా ఇలా నిల దీస్తుందని అతడూహించలేదు.

రాంప్రభుకి ఇదివరకే పెళ్ళయిందన్న సంగతి చాలామందికితెలియదు.సవితాదేవి అతనికి పరిచయం అయ్యేనాటికి అతనికో మూడేళ్ళ కొడుకు కూడా వున్నాడు.

వేదవల్లి రాంప్రభుకన్న అయిదారేళ్ళు పెద్దది. ఆ రోజుల్లో వేంప్ పాత్రలకి ఆమె చాలా పేరు మోసింది. కాని క్రమంగా కథా ధోరణుల్లో వచ్చిన మార్పుల కారణంగా ఆ తరహా పాత్రలకి ప్రాముఖ్యత సన్నగిల్లుతూ వచ్చింది.

వేదవల్లి మెలమెల్లగా తెరవెనక్కి తప్పుకుంటోంది. అయినా సినిమా రంగంలోని చాలామంది ప్రముఖులతో ఆమెకి మంచి పలుకుబడి వుండేదని చెప్పుకునేవారు. పాత కష్టమర్సయిన మాజీ నిర్మాతలు, పంపిణీదారులు అడపా దడపా ఆమె ఇంటికి వస్తూ వుండేవారు.

వేదవల్లి వుంటున్న వీధిలోనే రాంప్రభు ఇల్లు కూడా. తన సినిమా రంగ ప్రవేశానికి ఆమె సహాయ పడగలదనే ఉద్దేశం ఎందుకో అతనిక్కలిగింది. ఎలాగో తంటాలుపడి ఆమెతో పరిచయం ఏర్పరచుకోగలిగాడు రాంప్రభు. సినిమాల్లో చేరాలనే ప్రయత్నంలో వేదవల్లిని మొదటి మెట్టుగా ఉపయోగించుకోవాలనుకున్నాడు. కాని ఇంకా అణగారని వాంఛలకి ఆమె తనని వాడుకుంటుందని ఊహించలేక పోయాడు.

వేదవల్లి గర్భవతి అయింది.

నిర్బంధానికి లొంగిపోయి ఆమెని వివాహం చేసుకోక తప్పలేదు రాంప్రభుకి.

అతని అంచనాలు తారుమారైనాయ్. సినిమా ఛాన్సుల విషయంలో ఆమె అతని కేవిధంగానూ సహాయ పడలేదన్న సంగతి చాలా ఆలస్యంగా తెలుసుకున్నాడు.

"చూడు సవితా! మనిద్దరం వివాహం చేసుకోవాలంటే..." అని అర్ధోక్తిలోనే ఆగిపోయాడు రాంప్రభు.

ఏమిటన్నట్టు సందేహంగా చూసింది సవితాదేవి.

"ముందు నా భార్య పర్మిషన్ తీసుకోవాలి" అని ఆమె ముఖంలోకి చూడలేక తల దించుకున్నాడు.

నివ్వెరపోయింది సవితాదేవి.

"రాం! ఏమిటి నువ్వంటున్నది ?" అనగలిగింది కొద్దిక్షణాల తరువాత అదిరే గుండెల్ని చిక్కబట్టుకుంటూ.

"నన్ను క్షమించు. ఈ నిజాన్ని ఇంతకాలం నీకు చెప్పకుండా దాచాను. కాని నిన్ను మోసం చేయాలని మాత్రం కాదు. వివాహితుడ్నని తెలిస్తే సినిమాల్లో అవకాశాలు రావడం కష్టతరమౌతుందనే ఉద్దేశంతో ఎవరికీ ఈ విషయం తెలీనీకుండా జాగ్రత్త పడ్డాను. నా మిత్రులకు కూడా చాలామందికి తెలియదు" అన్నాడు రాంప్రభు బతిమాలుకుంటున్న ధోరణిలో.

ఆమెకంతా గందరగోళంగా వుంది. ఇంతకు మునుపు తను నటించిన పాత్రల్లో ప్రేమ వ్యవహారాల్లో ఎన్నో ఇబ్బందుల్ని వూహించని సమస్యల్ని ఎదుర్కొని వుంది. కాని ఇటువంటి విపరీతమైన పరిణామాల్ని, విషమ సమస్యల్ని నిజ జీవితంలోనే తాను ఎదుర్కోవాల్సి వస్తుందని కలలో కూడా వూహించలేదు.

ఎటూ తేల్చుకోలేని స్థితిలో తల నొప్పిగా వుందని ఆ రోజు షూటింగ్ కేన్సిల్ చేసి ఇంటికి వెళ్ళిపోయింది సవితాదేవి.

ఆ రాత్రంతా ఆమెకు కంటిమీద కునుకులేదు. ఈ పరిస్థితిలో తనేం చేయాలి? రాంప్రభు మీద ఆశలు వదులుకోవలసిందేనా? తండ్రి తనకి ఎటూ పెళ్ళి చేయడు. తను ఎంతకాలం అవివాహితగా వుంటే అంత మేలు అతనికి. వివాహమైతే తనకు మార్కెట్ పడిపోతుందని భయం ఆయనకి. అతని దృష్టిలో బంగారు గుడ్లు పెట్టే బాతు తను. తనతో బాటు నటించే హీరోలందరికీ ఎప్పుడో పెళ్ళిళ్ళయి పోయాయి. అన్ని విధాలా తనకు నచ్చిన మరో వ్యక్తి కోసం అన్వేషించి, మనసులు కలిసి తను వివాహిత అయ్యేసరికి అసలు పెళ్ళాడే ప్రాయం దాటిపోవచ్చు తనకి.

ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి రాగలిగింది సవితాదేవి. రాంప్రభు మీద నుంచి మనసు మరల్చుకోవడం

సాధ్యంకాదు తనకి. ఈ పరిస్థితుల్లో అతణ్ని వివాహం చేసుకోవటమే వుత్తమంగా తోచింది సవితాదేవికి.

అతడు వివాహితుడైతే మాత్రమేం మునిగిపోయింది? తనమీద అతనికి ప్రేమానురాగాలు వున్నంతవరకు అతని వివాహం తన సుఖ సంతోషాలకే మాత్రమూ అడ్డురాదు.

మొదటి భార్య అనుమతితోనే కదా తమ వివాహం జరగబోయేది.

కొన్ని షరతులమీద రాంప్రభు, సవితాదేవిల వివాహానికి అనుమతి పత్రం రాసివ్వటానికి అంగీకరించింది వేదవల్లి.

ఈ వివాహం వల్ల తనుగాని, తన పిల్లలుగాని ఏ విధమైన ఆర్థిక ఇబ్బందులకి గాని, మానసికమైన కష్టాలకిగాని గురి కాకూడదు.

తన దాంపత్య జీవితానికి ఎటువంటి అంతరాయమూ కలక్కూడదు.

రాంప్రభు సంతానం మీద మొదటి భార్యగా అన్ని హక్కులూ తనకే చెందాలి.

అన్ని షరతులకీ చిరునవ్వుతో అంగీకరించింది సవితాదేవి.

తండ్రి చిందులు తొక్కాడు. తనతో మాట మాత్రమైనా చెప్పకుండా అన్ని నిర్ణయాలూ కూతురే తీసుకుంటున్నందుకు మండిపడ్డాడు.

"జీవితమంటే సినిమా కథ అనుకుంటున్నావేమో. చూస్తూ చూస్తూగోతిలో పడబోతున్నావు. పెద్ద కష్టాలలో ఇరుక్కుంటున్నావు. బాగా ఆలోచించుకో" అని ఇంకా ఏమేమో అన్నాడు.

"స్టూడియోలు, షూటింగులు, డబ్బు— ఇదే నా జీవితంగా మార్చేసింది నువ్వే కాదూ? నే కోరుకున్న జీవితాన్ని నాకు దూరం చేసినన్నీ సినిమాల్లోకి తోసింది మీరు కాదూ? నిజమే. ఇప్పుడు సినిమా, జీవితం – ఈ రెంటికి నాకు తేడా తెలీడం లేదు.

నా శ్రేయస్సు కాదు మీక్కావలసింది నా డబ్బు. జీవితాంతం మీకు సంపాదించి పెట్టి మీ ధన వ్యామోహాన్ని తృప్తిపర్చటం కంటే నా కంటూ ఓ జీవితాన్ని ఏర్పరచుకోవటం నాకు ముఖ్యం" మొదటిసారిగా తండ్రితో ఎదిరించి ధైర్యంగా మాట్లాడగలిగింది సవితాదేవి. తండ్రి సదాశివం చేతులు ముడుచుకొని కూర్చోలేదు. ఎన్నో పథకాలు ఆలోచించాడు. ఎందరో లాయర్లనో సంప్రదించాడు. చివరికి ఇద్దరి చేతా ఒక ఒప్పందం చేయించాడు.

సవితాదేవికి రాంప్రభు సంపాదన మీద ఏ విధమైన హక్కులూ లేనట్లే, సవితాదేవి సంపాదనలో కూడా రాంప్రభుకి హక్కు అధికారమూలేకుండా చట్టరీత్యా కట్టుదిట్టాలు చేశాడు.

ఒక శుభ ముహూర్తాన రాంప్రభు, సవితాదేవి దండలూ, వుంగరాలూ మార్చుకున్నారు. పత్రికల వాళ్ళకి ఆ ఫొటోలు పంపి తాము కొత్త జీవితం ప్రారంభిస్తున్నట్టుగా ప్రకటనలు చేశారు. కానీ అది అన్ని వివాహాల్లాంటిది కాదని, ఇద్దరు భాగస్వాములు వ్యాపారం సాఫీగా సాగడానికీ, ఎవరి లాభాలు వాళ్ళు పంచుకునే పద్ధతి మీద ఏర్పరచుకొన్న 'కాంట్రాక్టు' వివాహం అన్న నిజం ఆముగ్గురికీ, వాళ్ళ లాయర్లకి తప్ప మరెవ్వరికీ తెలీదు.

* * *



కృష్ణమోహన్ నిలదీసి అడిగినప్పుడు కాదనలేక 'సరే' అన్నాడేగాని తల్లిని తన ఇంట్లో వుంచుకోవటం కుమార్‌కి ఏమాత్రం ఇష్టం లేదు. ఒకవేళ అతను అంగీకరించినా భార్య మాత్రం అందుకు చచ్చినా ఒప్పుకోదన్న సంగతి అతనికి తెలుసు. ఎందుకైనా మంచిదని భార్యతో ఆ విషయం ప్రస్తావించాడు.

"ఎంత మాత్రం వీల్లేదు. అయినా ఆవిడకు ఇప్పుడేం తక్కువైందని? నెల నెలా మూడొందలు పంపుతూనే వున్నాం కదా? చూడండి. ఇప్పటికే మీ అమ్మని గురించి నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటున్నారు. మనింట్లో తెచ్చి పెట్టుకుని మన పరువు కూడా బజారు కెక్కించుకోవాల్నా చెప్పండి" అంది కుమార్ భార్య. తనని సినిమాల్లో చేర్పించకుండా సవితాదేవి అడ్డు పడిందనే కక్ష ఆమెలో ఇంకా మిగిలి వుంది.

"అయినా మనింటికొచ్చిందంటే ఆమెకి బ్రాందీలూ, విస్కీలూ మనమెక్కడ సప్లయి చెయ్యగలమండీ"

ఆ రాత్రి మళ్ళీ తల్లీకూతుళ్ళు సవితాదేవి విషయంగా తర్జన భర్జనలు సలిపారు. తల్లి ఆలోచన కూతురికి బాగానే వున్నట్టనిపించింది.

"సరే. జబ్బు మనిషి అంటున్నారు గనుక తప్పేదేముంది? అలాగే వచ్చి వుండమనండి. అయితే ఒక షరతు?" అంది కుమార్ భార్య.

"ఏమిటో చెప్పు?" అన్నాడు కుమార్.

"ఈ ఇంటిని మన పేర రాసెయ్యమనండి. ఎటూ పన్నులూ, రిపేర్లు అన్నీ మనమే చూసుకుంటున్నాం గదా! ఆవిడకు ఎప్పుడేం బుద్ధి పుడుతుందో ఎవరు చూడవచ్చారు" అని అసలు సంగతి బయట పెట్టింది.

కుమార్ నర్సింగ్ హోమ్‌కి వచ్చి ఎవరూ లేకుండా చూసి భార్య ఆలోచనని సవితాదేవికి వినిపించినప్పుడు సవితాదేవి చిన్నగా నవ్వింది.

"ఒద్దులే బాబూ! నా మానాన నన్నిలాగే బతకనివ్వండి. నాకీ ఒంటరి జీవితమే హాయిగా వుంది. నేనెవ్వరికీ భారంగా వుండాలనుకోవటం లేదు"

కుమార్ సిగ్గుతో బాధగా తల దించుకున్నాడు.

"అమ్మని నేనింకా బతికి వున్నానన్న సంగతి మాత్రం నువ్వు గుర్తుంచుకో బాబూ. అదే చాలు" అని ముఖంపక్కకి తిప్పుకుంది సవితాదేవి.

ఆ రోజే కృష్ణమోహన్, విశ్వమూర్తి వెంట రాగా టాక్సీలో నర్సింగ్ హోమ్ వదిలి ఇంటికి తిరిగి వచ్చింది సవితాదేవి.

దుమ్ము పేరుకుపోయిన ఇంటిని చిమ్మి శుభ్రం చేసి వుంచాడు కుప్పుసామి.

"రేపట్నుంచి నేను తిరిగి షూటింగులకి వెళ్ళవచ్చన్నారా డాక్టర్లు?" ఇంటికి తిరిగి వస్తూనే అడిగింది.

విశ్వమూర్తి, కృష్ణమోహన్‌లు ఒకరి

మొహాలొకరు చూసుకున్నారు.

"ఇక నీకా అవసరం లేదులే సవితా" అన్నాడు కృష్ణమోహన్.

ప్రశ్నార్థకంగా చూసింది సవితాదేవి.

"నీ స్థానంలో మరొకర్ని తీసుకున్నారు. నువ్వు నటించిన సీన్లన్నీ రఘూదేవిని పెట్టి రీ షూట్ చేశారు."

హతాశురాలైంది సవితాదేవి.

ఎందుకిలా చేశారు. తనతో మాట మాత్రమైన చెప్పకుండా...

ఆమె ఆలోచనలని అర్థం చేసుకున్న వాడిలా కృష్ణమోహన్ ఇలా అన్నాడు.

"నువ్వు మళ్ళీ బతికి బయటపడతావని వాళ్ళనుకోలేదు సవితా! వాళ్ళే కాదు చాలామంది నీ కథ ఇంతటితో ఆఖరనే అనుకున్నారు?"

కుప్పుసామిని తీసుకుని బజారుకి బయలుదేరాడు విశ్వమూర్తి. కాసేపు సవితాదేవికి తోడుగావుండి సెలవు తీసుకున్నాడు కృష్ణమోహన్.

"అప్పుడప్పుడూ వస్తూ వుంటాన్లే. నువ్వేం కంగారుపడకు. ఏ సహాయం కావాలన్నా అడగటానికి మొహమాట పడకు" అని ధైర్యం చెప్పి భుజం తట్టి వెళ్ళాడు.

చాలా సేపటిదాకా గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ వుండిపోయింది సవితాదేవి.

చాలా కాలం తరువాత మళ్ళీ వేషం దొరికిందనీ, ఒకరి మీద ఆధార పడకుండా వున్నంతలో కొంత గౌరవంగా బతకొచ్చనీ ఎంతగానో సంతోషించింది తను. కాని తను రోగాన పడటం, దొరికిన ఆ చిన్న అవకాశం దొరికినట్టే చెయిజారి పోవటం అంతా శనిదేవత ఇంకా తనని వదల్లేదన్న విషయాన్ని రుజువు చేస్తున్నట్టుగా అనిపించింది. ఇక ఎవరూ తనని వేషాలకి పిలవరు. ఇప్పటికే ఆ ప్రొడ్యూసరూ, డైరెక్టరూ తనని ఎన్ని శాపనార్థాలు పెట్టుకుని వుంటారో.

అప్రయత్నంగా అల్మైరాకేసి చూసింది సవితాదేవి. కళావిహీనమై వెలవెలబోతూ దర్శనమిస్తున్నాయి మహానటిగా ఒకనాడు తను అందుకున్న షీల్డులు, పతకాలు, కంచువిగ్రహాలు, గోడలకి వ్రేలాడే ఫ్రేముల్లో రాష్ట్రపతులూ, ముఖ్యమంత్రులూ, న్యాయాధిపతులూ, సినీ నాయకమ్మన్యులు. తెచ్చిపెట్టుకున్న చిరునవ్వులతో, కృత్రిమమైన అభిమానంతో, తనతో కరచాలనం చేస్తూ, సమస్కరిస్తూ, భుజాల మీద చేతులు వేసి దీవిస్తూ, ఆప్యాయంగా కౌగిలించుకుంటూ— ఆనాటి వైభవానికి శిథిలమైన గుర్తులుగా మాత్రమే మిగిలిపోయిన ఈ బహుమానాల విలువెంత ఈనాడు? ఏం చేసుకోవాలి తను ఈ నిరర్థకమైన బొమ్మల్ని ?

పిచ్చి ఆవేశంలో, ఆవేదనలో అల్మైరా తెరిచింది సవితాదేవి. ఒక్కొక్క షీల్డుని విసుగ్గా బయటికి లాగి నేలకేసి కొట్టడానికి వుద్యుక్తురాలైంది.

"అమ్మా..." గుండె లోతుల్లోంచి పెకిలించుకుని వచ్చినట్లున్న ఆ పిలుపు విని చకితురాలై వెనక్కి తిరిగి చూసింది. ఒకచేత సంచీ, మరొకచేత జారిపోకుండా గుండెల కదిమి పట్టిన నాలుగైదు పొట్లాలతో గుమ్మం దగ్గర నిలబడి వున్నాడు కుప్పుసామి.

"ఆ బొమ్మలేంచేశాయమ్మా ? పగల కొట్టకండమ్మా. నేనైనా చూసుకుంటూ

వుంటాను" అన్నాడు కుప్పుసామి వృద్ధ కంఠంతో.

గబగబా వచ్చి అతని చేతిలోని సంచీ అందుకుంది సవితాదేవి. లోపలికొచ్చి చేతిలోని పొట్లాలని టేబిలు మీద పెట్టాడు కుప్పుసామి.

"వంటకావల్సిన సామాన్లన్నీ ఆ విశ్వంబాబు కొనిచ్చాడమ్మా వద్దంటున్నా వినకుండా, పైగా వంద రూపాయలు కూడా ఇచ్చి పంపేరమ్మా" అన్నాడు డబ్బు ఆమె చేతికిస్తూ.

తలారా స్నానంచేసి, బట్టలు మార్చుకుని అద్దం ముందు కూర్చుంది సవితాదేవి. తన శరీరంలో ఏదో కొత్తమెరుగుని, ఓ కొత్త అందాన్ని గమనించి తృప్తిగా నవ్వుకుంది.

ముఖంలో అదివరకు లేని తేటతనం, స్వచ్ఛత తాండవిస్తోంది. రెండు నెలలు నర్సింగ్ హోం సపర్యలతో తన ఆరోగ్యం పూర్తిగా కోలుకుంది. శరీరంలో కొత్త రక్తం ప్రవేశించింది.

వంటింట్లోంచి కుప్పుసామి వంటకాల వాసన ఘుమాలిస్తోంది.

"సవితమ్మా" రాపిడి గొంతుతో పిలిచిన పిలుపు విని వెనక్కి తిరిగింది సవితాదేవి. అప్పుడే మెట్లెక్కి వచ్చిన విశాలం ఆయాసంతో రొప్పుతూ గుమ్మం దగ్గర నిలబడి వుంది.

విస్మయంతో అద్దం ముందు నుంచి లేచి నిలబడి "మీరా! రండి పిన్నిగారూ" అంటూ లోపలికి ఆహ్వానించింది సవితాదేవి.

"బాగున్నావా తల్లీ! ఒంట్లో ఇప్పుడు కులాసాగా వుందా?" అని పరామర్శిస్తూ లోపలి కొచ్చింది విశాలం.

ఏం మాట్లాడాలో తోచక గుడ్లప్పగించి ఆమెకేసే చూస్తూ నిలబడింది సవితాదేవి.

"ఏమిటా ఇది! 'సినిమా ముండ, సినిమా ముండ' అని ఎప్పుడూ ఛీదరించుకున్నట్టు మాట్లాడే మనిషేనా ఈ రోజు వెతుక్కుంటూ వచ్చింది అనుకుంటున్నావు కదూ! అవునమ్మా నేనే. ఎందుకో నిన్ను చూడాలనిపించింది. వచ్చాను. ఇప్పుడు నీ ఆరోగ్యం కోలుకున్నట్టే కదమ్మా! చూస్తూ వుంటేనే తెలుస్తోంది. నీ ముఖంలో మునుపెన్నడూ లేని కళ కనిపిస్తోంది. మహాలక్ష్మిలా వున్నావు. నా దిష్టే తగిలేట్టు వుంది"

గబగబా మంచం మీద మాసివున్న దుప్పటి తీసేసి కొత్తది పరిచింది సవితాదేవి.

"కూర్చోండి పిన్నిగారూ"

విశాలం ఆయాసంతో రొప్పుతూ మంచం మీద కూర్చుంది.

"మంచి నీళ్ళు పుచ్చుకుంటారా పిన్నీ" అడిగింది.

"ఏమీ వద్దు లేమ్మా"

"ఆయాశపడి పోతున్నారు. ఒంట్లో బాగా లేదా పిన్నీ ?"

"ఏం చెప్పమంటావు తల్లీ. అందరికీ నా గయ్యాళి తనమే బయటకు కన్పిం స్తుంది గాని, నంగనాచిలా వుంటూ లోపల్లోపల ఆ మనిషి నన్ను పెట్టే సాధింపులు ఎవరితో చెప్పుకోను. ఆ మనిషితో వేగలేకుండా వున్నానమ్మా. మా గొడవలకేంలే. అసలు సంగతి మరచేపోయాను. ముందు ఇలా నా దగ్గరికి రామ్మా" అని పిలిచి చేతి సంచిలోంచి రెండు కాయితం పొట్లాలు తీసి విప్పింది విశాలం.

"నువ్వు ఆసుపత్రిలో వున్నప్పుడు అల్లుణ్నీ, అమ్మాయినీ తీసుకుని గుడికి వెళ్ళానమ్మా. తొందర్లో నీ ఆరోగ్యం కోలుకోవాలని ఆ కామాక్షితాయికి మొక్కు కున్నాను. మహాతల్లి మాట తప్పలేద నుకో. ఒళ్ళు బాగై నిక్షేపంగా నువ్వింటికి తిరిగొచ్చావు" అంటూ సవితాదేవిని దగ్గరకు తీసుకుని తల నిమిరి నొసట కామాక్షి కుంకుమ దిద్దింది విశాలం.

"ఏదీ కొంచెం నోరు తెరు" అని రెండో పొట్లం విప్పి చిటికెడు విభూతిని నాలుక మీద వేసింది.

ఇదంతా కలా నిజమా అని నిర్ఘాంత పోయి చూస్తోంది సవితాదేవి.

"నా పాడు నోటితో నిన్నేమైనా మ న సు కష్టపెట్టివుంటే అదంతా మనసులో వుంచుకోకు తల్లీ. కట్టుకున్న మనిషి సమయం, సందర్భం అంటూ లేకుండా సదా సినిమా తారల్ని వర్ణిస్తూ లొట్టలేసుకుంటూ వుంటే ఏ ఆడది భరిస్తుంది నువ్వే చెప్పమ్మా? ఆఖరికి పడక మీద కూడా ఇదే వరసైతే ఎట్టా పడను చెప్పు. ఇప్పుడని కాదు. కట్టుకున్న నాటినుంచి ఇదే పోరు ఆ మనిషితో".

"'విశాలం! ఆ సినిమాలో పద్మప్రియలా చీర కట్టుకోరాదూ. ఈ సినిమాలో సింగారి లాంటి రవిక తొడుక్కోరాదూ!' అంటూ ఒకటే సొద. సినిమాల్లోలా సింగారించుకుని తైతక్కలాడ గలనా నేను..."

విశాలం మాటలకు తనకు తెలీకుండానే పకపకా నవ్వేసింది సవితాదేవి.

"నా తల్లే! నా మీద కోపం పోయిందన్నమాట నీకు. ఆ మనిషి సినిమా తారల మాటెత్తితే మండి పడేదాన్నిగాని, చెప్పొద్దూ ఏ సినిమా వచ్చినా ముందుగా వెళ్ళి చూసేది నేనే. ముఖ్యంగా నీ సినిమా ఒక్కటి కూడా 'వదిలేదాన్ని కాదు. మొన్న నువ్వు ఆసుపత్రిలో వున్నప్పుడు ఇక్కడ రాం థియేటరులో 'అన్నా చెల్లీ అనుబంధం' వస్తే వెళ్ళి చూశాను. ఆ చివరి సీనులో మీరిద్దరూ చనిపోతూ వుంటే వెక్కి వెక్కి ఏడ్చి ముఖమంతా వాచిపోయిందనుకో.

"నా ఇంట్లో అద్దెకుండే మనిషేనా ఈమె ఇంత గొప్పగా చేస్తోంది అనుకుని ఆశ్చర్యపోయాననుకో. నమ్ముతావో లేదోగాని 'ఈ నటి మా ఇంట్లోనే అద్దె కుంటోందండోయ్' అని అరిచి థియేటర్లో వాళ్ళందరికీ గొప్పగా చెప్పుకోవాలని పించింది"

తనని ఇంతకాలం ఏవగించుకుంటోంది అనుకున్న మనిషి దగ్గర్నించి వచ్చే ఈ కపటం లేని ప్రశంసలకి సవితాదేవి మనసు ఆనందంతో, అనిర్వచనీయమైన అనుభూతితో నిండిపోయింది.

"మీ శ్యామల పెళ్ళికి నేను లేకపోయానే అని బాధగా వుంది పిన్నీ" అన్నది సవితాదేవి.

"అమ్మాయి కూడా చాలా బాధ పడిందమ్మా. వెళ్ళేముందు ఒకసారి ఆసుపత్రికి వచ్చి నిన్ను చూచిపోవాలని కూడా అనుకున్నది.

కాని అబ్బాయికి సెలవు లేదని నాలుగోరోజే ప్రయాణం పెట్టుకున్నారు. మొన్ననే వుత్తరం కూడా రాసింది పిన్ని ఆరోగ్యం బాగుపడిందా? ఆసుపత్రి నుంచి తిరిగొచ్చిందా? అని అడుగుతూ"

"విశాలం! విశాలం!" అంటూ మెట్ల మీంచి కేకలేస్తున్నాడు రాఘవన్.

"వస్తున్నా! వస్తున్నా! మీరక్కడే వుండండి. మళ్ళీ మీరొచ్చి విసిగించొద్దు.

భోజనాలకి కూర్చునే వేళ కూడాను" అని "మరి నే వస్తానమ్మా సవితా! అప్పుడప్పుడూ వచ్చి మాటామంతీ మాట్లాడి వెళుతుంటాలే తల్లీ" అని లేచి నిలబడింది విశాలం.

"ఉండండి పిన్నీ! భోజనం చేసి వెళు దురుగాని" అంది సవితాదేవి ఆమె చేయి పట్టుకుని ఆపుతూ.

"అమ్మమ్మా వద్దు తల్లీ. ఈ రోజు మా ఇంట్లో నా కిష్టమైన మెంతాళ్ళ పులుసు చేసుకున్నాను. ఇన్నాళ్ళకి గుర్తొచ్చి నట్టుంది ఆ మనిషికి. పొద్దున్నే మార్కెట్టుకి వెళ్ళి నా కిష్టమైనవి తెచ్చి పడేశారు. వస్తా" అని తలుపు దగ్గరికి నడిచింది విశాలం. మెట్ల మీంచి సవితాదేవి గది లోకి తొంగిచూసి అంతలో భార్య రావటం గమనించి కంగారుగా మెట్లు దిగాడు రాఘవన్.

ఆ మర్నాటిరోజు హేర్ డై బాటిల్ తీసుకొచ్చాడు విశ్వమూర్తి సవితాదేవి కోసం.



"ఇకనుంచీ దీని అవసరం లేదు విశ్వం. సినిమాల్లో వేషాలకి ఇక నన్నెవరూ పిలవరుగా. ఇంకా ఎందుకీ నల్లరంగు ?" అంది నిర్వేదంతో.

"బాగుంది మీ సిద్ధాంతం. సినిమాల్లో వేసేనే అందంగా. కనిపించాలనా మీ వుద్దేశం? బతికినంత కాలం అందంగా, ఆకర్షణీయంగా వుండటానికి ప్రయత్నించాలి ప్రతి మనిషీ. అందుకనే అనాదిగా రకరకాల సౌందర్య సాధనాలని తయారు చేసుకుంటున్నాడు. అసలు ఈ సౌందర్యాన్వేషణలోంచి పుట్టినవే కదండీ కళలు కూడా. తీసుకోండి"

అతని చేతిలోంచి ఆ సీసా అందుకుని గదిలోకి వెళ్లింది.

అర్ధగంట గడిచాక అందంగా అలంకరించుకుని ఏదో ఒక కొత్త వుత్సాహం పుంజుకున్న దానిలా ముందర హాల్లో కొచ్చింది సవితాదేవి.

రెండు ప్లేట్లలో ఫలహారం తీసుకొచ్చి వాళ్ళ ముందుంచాడు కుప్పుసామి.

"అయితే విశ్వం! నిన్న డబ్బిచ్చావట కుప్పుసామికి. అంత డబ్బెందుకివ్వాలి చెప్పు ? అనవసరంగా నన్నిబ్బందిలో పెట్టేస్తున్నావ్" అంది ఫలహారం తీసుకుంటూ.

"అప్పుడప్పుడూ మీ దగ్గర్నించి పదీ ఇరవై తీసుకుని వున్నాను. మీకు గుర్తుండక పోవచ్చు" అన్నాడు విశ్వమూర్తి నవ్వుతూ.

"అయితే ఇప్పుడిలా ఋణం తీర్చుకుంటున్నావన్న మాట. అంతేనా ?" అంది సవితాదేవి కొంచెం నిష్ఠూరంగా.

"అలా అనుకోకండి ప్లీజ్. ఒకరికొకరు సహాయపడడంలో ఎంత ఆనందం, తృప్తివుందో మీకు తెలుసా?"

"నిజమే. కాని నీకుద్యోగం లేదుకదా. ఒక్కసారిగా అంత డబ్బిస్తే నువ్వెంత కష్టపడాలో"

"ఏదో ఒక ఆఫీసులో, ఎవడో ఒకడి కింద నెలంతా చేసేదే వుద్యోగమా చెప్పండి. నేనూ ఏదో రకంగా సంపాదిస్తూనే వున్నానండి" అన్నాడు విశ్వమూర్తి.

"ఏదో రకంగా అంటే?"

"జేబులు కొట్టి మాత్రం కాదులెండి"

ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

సవితాదేవికి పొలమారింది.

గ్లాసుతో ఆమెచేత నీళ్ళు తాగించి నెత్తిమీద చేత్తో మెల్లగా తట్టాడు విశ్వమూర్తి.

"మిమ్మల్నెవరో తల్చుకుంటున్నారు" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"తల్చుకున్నంత మాత్రాన పొలమారేట్టయితే సినిమా తారలంతా పస్తులుంటాల్సిందే. అస్సలు భోంచెయ్యడం సాధ్యంకాదు" అన్నది నవ్వుతూ.

"అన్నట్టు నీ సంపాదన గురించి ఏదో చెపుతున్నావ్?"

"ఆదివారాల పూట మెరీనాబీచ్ దగ్గర, మౌంట్ రోడ్ ప్లాట్ ఫారాలమీదమంచిమంచి పుస్తకాలుపరుచుకునిఅమ్ముతూ వుంటాను. తీరిక వేళల్లో ఫొటోలు తీస్తూ వుంటాను. విదేశీయాత్రీకులకి టూరిస్టు గైడ్‌గా పని చేస్తాను. అడపాదడపా పత్రికలకి ఇంటర్‌వ్యూలు, వ్యాసాలు, కథలు - ఇలా నా ఖర్చుకి సరిపోయేడబ్బు సంపాదించుకో గలుగుతున్నాను. ఈ జనారణ్యంలో రకరకాల మనుషుల్ని, మనిషి రూపంలో సంచరించే మృగాలని, అవి వేటాడే పద్ధతుల్ని, వేటాడబడే అమాయకపు

ప్రాణుల్ని, తిరగబడటానికి అవి చేసే పోరాటాలని వివిధ కోణాల్లోంచి పరిశీలించే అవకాశం నాకు ఈ వ్యాపకాల ద్వారా లభిస్తోంది. ఈ అనుభవాల సారాంశంతో, నాకేర్పడిన ఆత్మవిశ్వాసంతో ప్రజల మధ్యకి వెళ్ళటానికి త్వరలో ఒక పథకం రూపొందించాలనే ప్రయత్నంలో వున్నాను" అని చెప్పి దీర్ఘంగా శ్వాస వొదిలాడు విశ్వమూర్తి.

"అదృష్టవంతుడివి విశ్వం! సుదీర్ఘమైన జీవితం నీముందుంది. ఏదో చేయాలి, సాధించాలి అనే లక్ష్యం, చిత్తశుద్ధి, ఆత్మవిశ్వాసం వుండటం జీవితానికెంత నిండుదనాన్ని, అర్థాన్ని ఇస్తుందో నాకు తెల్సు. కాని గడిచిపోయిన జీవితం తప్ప జీవితమంటూ నాకు లేకుండా పోయింది. అంధకారంగా, అగమ్యగోచరంగా, నిరర్థకంగా కనిపిస్తోంది. మీరెన్ని చెప్పినా ఇంకా నేనెందుకోసం బతకాలో అర్థం కావటం లేదు విశ్వం" అంది గద్గద స్వరంతో సవితాదేవి"

"అన్ని కోరికలూ చచ్చిపోయి వార్థక్యంలో పడిపోయిన వారిలా మాట్లాడుతున్నారు" అన్నాడు విశ్వం.

"ఏం నాకు ముసలితనం రాలేదంటావా?" అడిగింది నవ్వుతెచ్చుకుంటూ.

"కళకీ, కళాకారులకీ వార్థక్యమంటూ వుండదండీ! వాళ్ళు చిరంజీవులు" అన్నాడు విశ్వమూర్తి.

"నీ ప్రవర్తనలో నాకు బాగా నచ్చిన అంశం ఏమిటో తెలుసా?" అడిగింది. అతని కళ్ళలోకి ప్రశంసాపూర్వకంగా చూస్తూ "నన్ను పరామర్శించడానికి వచ్చేవాళ్ళంతా నామీద జాలిపడుతూ, బోలెడంత సానుభూతి కురిపించి మాట్లాడేవాళ్ళు. అందరూ తప్పనిసరిగా అడిగే ప్రశ్నని నువ్వింతవరకూ అడగనే లేదు. అసలా విషయాన్నే ప్రస్తావించలేదు'' అంటూ కిటికీలోంచి గదిలోకి పడుతోన్న వీధి దీపాల వెలుగునీడల్ని పరికిస్తోంది. "ప్రతి ఒక్కరూ నా యీ పరిస్థితికి రాంప్రభుని నిందించారు. 'మీకింత అన్యాయం చేశాడు కదా. అతని మీద మీరెందుకు చట్టరీత్యా చర్య తీసుకోలేదు' అని ప్రశ్నించేవారు."

కుర్చీలోంచి లేచి లైటు స్విచ్ వేశాడు విశ్వమూర్తి. ఓ సినిమా మాస పత్రికని చేతిలోకి తీసుకున్నాడు. ఆ పాత ముఖచిత్రంలోంచి నవ్వుతున్నాడు రాంప్రభు.

సవితాదేవి విషాదంగా నవ్వుకుంది.

తనకంటే పదేళ్ళు పెద్దవాడైన అతనింకా అడపా దడపా హీరో వేషాలు వేస్తూనే వున్నాడు. ఆమధ్య ఎవరో కొత్త అమ్మాయిని పెట్టి సినిమా కూడా తీశాడు. అతనింకా ఎవర్‌గ్రీన్ హీరోగానే వున్నాడు ప్రొడ్యూసర్ల దృష్టిలో. తను మాత్రం ముసలి వేషాలకి మాత్రమే పనికొచ్చే మనిషి!

సాయంకాలపు పిల్ల తెమ్మెరలు తెరలు తెరలుగా కిటికీలోంచి గదిలోకి జొరబడుతున్నాయి. రాంప్రభుతో తను గడిపిన జీవితం తాలూకు స్మృతులు అలలై కదులుతున్నాయి జ్ఞాపకాల తెరల్లోంచి.

సినిమాలకి కాల్‌షీట్లు ఇచ్చినట్టుగా, బిజినెస్ పార్టనర్‌షిప్పువలె, కాంట్రాక్టుకి కట్టుబడినట్టుగా గడిచింది రాంప్రభుతో తన దాంపత్య జీవితం.

ఊపిరి సలపని షూటింగుల మధ్య, ఎప్పుడో తీరిక దొరికి ఇద్దరూ ఏకాంతంగా గడపగలిగిన రాత్రులు చాలా అరుదుగా

వుండేవి. ఎప్పుడో అవకాశం దొరికి, అర్ధాంగిగా అతనితో గడపాలనుకున్న రోజున అతని మొదటి భార్య దగ్గర్నుంచి ఫోను వచ్చేది.

"సారీ డియర్! వేదవల్లి అర్జెంటుగా రమ్మంటోంది. వుయ్ విల్ హేవె స్వీట్ నైట్ టుమారో. ఓ కే'' అని హడావిడిగా వెళ్ళిపోయేవాడు—ఆఫీసర్ కాలింగ్ బెల్లు నొక్కితే కంగారుగా పరిగెత్తుకెళ్ళే అప్రెంటీసు గుమాస్తా వలె.

ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములేవాడి అనే సామెత తన జీవితంలో నిజం కాలేక పోయింది.

"పెళ్ళయి పట్టుమని పది రాత్రులు అయినా భార్యా భర్తలుగా గడిపామా మనం? నేను మాత్రం మీ భార్యను కానా చెప్పండి?" అని ఒకటి రెండుసార్లు నిలదీసింది తను.

"చూడు డార్లింగ్. వేదవల్లి మన వివాహాని కసలు ఒప్పుకుంటుందని కూడా అనుకోలేదు నేను. ఆమె సమ్మతించడమే గొప్ప విషయం. అన్ని షరతులకు ఒప్పుకునే కదా మనం ఈ నిర్ణయం తీసుకున్నాం" అంటూ తన నోరు మూయించేవాడు.

పత్రికలవాళ్ళకి, ప్రేక్షకలోకానికి రాంప్రభుతో తన జీవితం సుఖంగా, సాఫీగా సాగిపోతోందని, తాము ఆదర్శ దంపతులమన్న భ్రమనిస్పృష్టించగలిగింది. మహానటి కదా మరి! ఫిలిం ఇండస్ట్రీలో తమదొక ఆదర్శ దాంపత్యం! ఇలా కొన్నేళ్ళు గడిచేయి.

"చూడు డియర్! ప్రతి చిత్రంలోనూ నువ్వూ, నేనూ జంటగా నటించాలనే నియమాన్ని సడలించుకోవాల్సిన సమయం వచ్చింది. మునుపటిలా మన కాంబినేషన్‌లో వస్తున్న చిత్రాలు అంతగా సక్సెస్ కావటం లేదిప్పుడు. రోజులు మారుతున్నాయి. ప్రేక్షకుల అభిరుచుల్లో క్రమంగా మార్పొస్తోంది. దర్శకులు, నిర్మాతలు కొత్త కాంబినేషన్లవైపు మొగ్గు చూపుతున్నారు.

"భారీ తారాగణం లేకుండా, కథాబలం మీద ఆధారపడి తీసిన చిత్రాలు కొన్ని బాగా విజయవంతమవుతున్నాయి ఈ మధ్య. అంచేత నువ్వే ఆలోచించి చూడు. మనమార్కెట్ పడిపోకుండా వుండాలంటే ఎవరితోనైనా సరే నటించడానికి సిద్ధంగా వుండాలి మనం. ఏమంటావు?" అన్నాడు ఒక రోజు రాంప్రభు. అంతకు మునుపే తండ్రి కూడా ఈ విషయం ప్రస్తావించాడు. ఏమనగలదు తను?

రాంప్రభు ఇతర హీరోయిన్లతో నటించటాన్ని అంగీకరించి ప్రశంసించిన ప్రేక్షకులు తను ఇతర హీరోలతో నటించటాన్ని ఆమోదించలేకపోయారు. అది వాళ్ళ తప్పుకాదు. వాళ్ళ దృష్టిలో తను తెరమీదనేగాక నిజజీవితంలో కూడా ఆదర్శగృహిణి! ఉత్తమ ఇల్లాలు! ఆ ఇమేజికి తెరమీదనైనాసరే భంగం కలగటాన్ని ప్రేక్షకలోకం హర్షించలేకపోయింది కొంత కాలందాకా. అయినా తన అపూర్వ నటనా నైపుణ్యంతో ప్రకాష్‌తో నటించిన మూడు చిత్రాలూ బాగా డబ్బు చేసుకున్నయ్. ఆ దెబ్బతో ఒకేసారి పది చిత్రాల్లో బుక్ అయింది సవితాదేవి. ఒక చిత్రానికి నలుపూ తెలుపూ వెరసి లక్ష రూపాయల్దాకా డిమాండు చేయటం ప్రారంభించాడు ఆమె తండ్రి.

ఆ సంవత్సరంలో వరుసగా నలుగురు

కొత్త తారలు పరిచయమైనారు ఇండస్ట్రీకి. అందరూ పద్దెనిమిదేళ్ళలోపువారే. వాళ్ళని వెండి తెరకు పరిచయం చేసింది కూడా ఇద్దరు కొత్త యువ దర్శకులు. కథలో, కథ చెప్పే విధానంలో అంతకు మును పెవ్వరూ ప్రయత్నించనికొత్త ధోరణుల్ని ప్రవేశపెట్టి సాహసం చేశారు. డిస్ట్రి బ్యూషనే దొరకదనుకున్న ఆ పిక్చర్‌లు కలెక్షన్లలో రికార్డు సృష్టించాయి. సరిగ్గా అదే సమయంలో సవితాదేవి నటించిన చిత్రాలు రెండు ఆర్థికంగా దెబ్బతిన్నాయి.

సినిమారంగంలో స్టార్ వేల్యూ పడిపోయే కాలం ప్రారంభమైంది. ఫీల్డులోకి కొత్త గాలి వీయటం ప్రారంభించింది. కొత్త దర్శకులు, కొత్త హీరోలు, హీరోయిన్లు, సంగీత దర్శకులు, కెమేరామెన్‌లు వీళ్ళ కాంబినేషన్‌లో తీసిన చాలా చిత్రాలు విజయవంతం కాసాగినయ్.

గోరుచుట్టుమీద రోకటిపోటులా సవితా దేవి ఇంటిమీదికి ఇన్‌కమ్‌టాక్సు రైడ్ వచ్చి పడింది. ఒక్కసారిగా అయిదు లక్షల రూపాయలదాకా బకాయి పడి వున్నట్లు తేల్చారు అధికారులు. వాయిదాల పద్ధతి మీద తీర్చుకోవడానికి ఒప్పందం కుదుర్చుకుంది సవితాదేవి.

ఇలా మూడేళ్ళు గడిచాయి. కొత్త చిత్రాలు రావటంలేదు. బ్యాంకులో డబ్బు కరగటం ప్రారంభించింది.

ఈ పరిస్థితుల్లోనే తండ్రికి ఆ పాడు ఆలోచన కలిగింది. సొంతంగా ప్రొడక్షన్ ప్రారంభించాలని పట్టుపట్టాడు.

ఎంచేతో దర్శకత్వం చేపట్టగలననే పిచ్చి ధైర్యం ప్రవేశించింది సవితాదేవికి.

మొదటి చిత్రంలో హీరోగారాంప్రభునే బుక్ చేసింది.

"వెల్‌డన్ మైడియర్. నేను కూడా సాహసించని కార్యానికి నువ్వు పూను కోవటం నాకు చాలా సంతోషంగా వుంది. అయామ్ రియల్లీ ప్రౌడాఫ్ యు" అని చేతులు పట్టుకొని గట్టిగా నొక్కాడు రాంప్రభు.

"అయితే ఒక్క విషయం డియర్. మనం ఎంత సొంత వాళ్ళమయినా అగ్రి మెంటు మాత్రం పద్ధతి ప్రకారం జరగా ల్సిందే. ఓ.కే." నవ్వుతూనే నిర్మొహ మాటంగా అడగ్గలిగేడు. అప్పట్లో అతని మార్కెట్ రేటు ప్రకారం చెందాల్సిన మొత్తాన్ని ముందుగానే తీసేసుకున్నాడు.

"డబ్బు విషయాల్లో తల్లీ బిడ్డలైనా సరే ఖచ్చితంగా వుండాలంటాను. ఏమను కోకు డియర్"అని తన బుగ్గమీద చిటికేసి కారెక్కాడు రాంప్రభు.

'యూ స్కౌండ్రల్' లో లోపల ఆక్రోశించటం తప్ప ఏమీ అనలేక పోయింది సవితాదేవి.

"అందరూ వేసే ప్రశ్నని నేను వెయ్య లేదని తెగమెచ్చుకున్నారు నన్నిందాక. ఎవరూ అడగని ప్రశ్న ఒకటి మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను" అన్నాడు విశ్వ మూర్తి గాలికి అందంగా కదిలే నలుపు తెలుపుల ఆమె ముంగురుల్ని గమనిస్తూ.

"అడుగు విశ్వం" అంది సవితాదేవి కుతూహలంగా.

"రాంప్రభు మిమ్మల్ని దగా చేశాడని బాధపడుతున్నారా ?"

"అతనే కాదు విశ్వం! నన్నారాధించి ఆకాశానికెత్తే సినీ ప్రేక్షకులు, దర్శ కులు, నిర్మాతలు, నా డబ్బుకోసం తేనె టీగల్లా నా చుట్టూ చేరి అభిమానం కురి పించిన మావాళ్లు, చివరికి నా కన్న

కొడుకు — ఈ ప్రపంచం మొత్తం నా కన్యాయం చేసిందనే అనిపిస్తూ వుంటుంది" అన్నది ఆవేశంలో ఆవేదనగా.

"మీరు బాగా బతికిన రోజుల్లో ఎన్నో రకాల పాత్రల్ని- పేదవాళ్ళవి, భాగ్యవంతులవి, దగాపడిన తమ్ముళ్ళవి, అణగారిన చెల్లెళ్ళవి, స్టూడియోలో ఫోకస్ లైట్ల మధ్య, అవుట్ డోర్‌లో రిఫ్లెక్టర్ల వెలుగులో పోషించి వుంటారు. కాని నిజజీవితంలో మీ చుట్టూ వున్న వాళ్ళ జీవితాల్ని గురించి ఎప్పుడైనా ఆలోచించారా? తెలుసుకునే ప్రయత్నం చేశారా? చెప్పండి"

"'నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నేనెగిరిపోతే నిబిడాశ్చర్యంతో వీరు—

నెత్తురు కక్కుకుంటూ నేలకి నే రాలిపోతే నిర్దాక్షిణ్యంగా వీరె..?' అన్నాడో మహాకవి. ప్రజల్ని గురించి పట్టించుకోకపోతే ఎంతటి వారికైనా ఈ ఒంటరితనం, నిస్పృహ తప్పదు సవితాదేవి గారూ !"

"నిజమే విశ్వం! నా పేరు ప్రఖ్యాతుల గురించే తప్ప, నా చుట్టూవున్న ప్రపంచం గురించి, నన్ను తారని చేసి ఆకాశానికెత్తేసిన ఆ జనాన్ని గురించి నేనెప్పుడూ ఆలోచించింది లేదు. ఆ అవసరం వుందని కూడా నాకెప్పుడూ అనిపించలేదు"

"ఒక రకంగా మీ ఈ ఒంటరితనానికి, ఈ ప్రపంచం మిమ్మల్ని దగా చేసిందని ఈనాడు మీరు వాపోతూ వుండటానికి మీ చుట్టూ వున్న సమాజం గురించి, మనుషుల గురించి పట్టించుకోని మీ నిర్లక్ష్య వైఖరే కారణం అంటాను" అన్నాడు విశ్వమూర్తి.

ఏవో కొత్త లోతుల్ని తరచి చూస్తున్నట్టు అతని ముఖంలోకి చూస్తూ వింటోంది సవితాదేవి.

"తారగా వెలిగిన రోజుల్లో అందరు తారల్లాగే ప్రజలకు దూరంగా జీవించటం అలవాటు చేసుకుని వుంటారు. అద్దాల మేడలో నివసించటానికి అలవాటు పడిన మీకు ఆ రంగుటద్దాల్లోంచి అసలు జీవితం కనిపించి వుండదు..."

అతని మాటల్లోని నిజాన్ని, అర్థాన్ని గ్రహించే ప్రయత్నంలో కొన్నేళ్ళ వెనక్కి వెళ్ళాయి సవితాదేవి ఆలోచనలు. తారగా మారడానికి ముందు తను గడిపిన ఆ స్వల్ప కాలపు జీవితం ఆమె కళ్ళ ముందు కదిలింది. పైకెగిరిపోయి, కొంత కాలం నేల కనిపించని మేఘాల మధ్య విహరించి మళ్ళీ నేల రాలిన ఈ రోజు ఆ నటి జీవితం, ఆ మనుషులు, ఆ పరిసరాలు జ్ఞప్తికొస్తున్నాయి ఆమెకు.

అంతా మొన్న మొన్న జరిగినట్టుగానే వుంది ఇప్పుడు తలుచుకుంటుంటే!

తండ్రితో మద్రాసు వచ్చిన తొలి రోజుల్లో రాయపేటలోని ఓ చిన్న వీధిలో అద్దెకుండేవాళ్ళు.

నాలుగిళ్ళ చావడిలాంటి పెంకుటిల్లు అది. ఇరుగు పొరుగు వాటాల్లోని కుటుంబాలన్నీ ఇంకా బాగా గుర్తున్నాయి. వాళ్ళ పేర్లు కూడా గుర్తే.

పక్క పోర్షన్‌లో కామాక్షి వాళ్ళ కుటుంబం. భర్త ఏదో ప్రెస్సులో కంపోజిటర్. ముగ్గురు పిల్లలు వాళ్ళకి. ఆఖరి పిల్ల వాడు మూడేళ్ళ వెధవ. నన్ను చూస్తే చాలు 'అక్కా అక్కా' అంటూ పరుగెత్తుకొచ్చి కాళ్ళకు చుట్టుకునే వాడు.

నెలాఖరున అన్నీ నిండుకునేవి

వాళ్ళింట్లో. కటకటలాడిపోయేది కామాక్షి పాపం. మిరప్పొడి, కాఫీపొడి, చక్కెర రెండేసి గంటలు చేబదులు అడిగి తీసికెళ్ళేది. బియ్యమూ పప్పులూ మరో పోర్షన్ వాళ్ళ దగ్గర అప్పడిగేది. అప్పుడప్పుడూ అయినా, పదీ చేబదులు తీసుకునేది తన దగ్గర.

ఏదో తారీఖున ఆయనకి జీతం రాగానే ఒక్క వస్తువుకూడా మర్చి పోకుండా అందరి అప్పు పైసల్తో సహా తీర్చేసేది.

ఎదుటి పోర్షన్‌లో కేశవన్ నాయర్. ఆర్.టి.సి.లో డ్రైవరు. డ్యూటీలించి వస్తూనే కళ్యాణీ, కళ్యాణీ అని పెళ్ళాం పేరు జపిస్తూ వచ్చేవాడు ఇంట్లోకి.

సెలవు రోజుల్లో తలుపులు బార్లా తెరిచి పెళ్ళాం తొడమీద తలపెట్టి బీడీ కాలుస్తూ వాళ్ళ భాషలో తన డ్రైవింగ్ అనుభవాలు చెపుతూ ఆమెని నవ్విస్తుండే వాడు.

నాయర్ డ్యూటీకి వెళ్ళితరువాత ఆడంగులంతా వసారాలో చేరే వాళ్ళు బాతాఖానీ కోసం.

"రాను రాను ఆ మనిషి బస్సుకీ, పెళ్ళానికీ తేడా తెలీకుండా పోతోం దమ్మా. బస్సుని తోలినట్టే నన్నూ తోలే స్తుంటే ఎలా భరించేది చెప్పు. ఒళ్ళు హూనమై పోతోందనుకో" అనే కళ్యాణి మాటలకి అందరూ గొల్లుమని నవ్వేవారు. అందులో దాగివున్న తమాషా ఏమిటో అర్థంగాక తెల్ల మొహం వేసుకుని చూస్తూండిపోయేది తను అప్పుడు.

పది గంటలు దాటేకతమ పోర్షన్‌కొచ్చి వాళ్ళ వంటలనీ నేర్పేది కళ్యాణి. కొబ్బరితో అన్ని కాల వంటలు తయారు చేయవచ్చని అప్పుడే తెలిసింది. చేపలతో వూరగాయ పెడతారని విని విస్తుపో యింది తాను. వాళ్ళింట్లోంచి ఓ చిన్న గిన్నెలో కొంచెం వేసుకుని వచ్చి రుచి చూడమంది. బాగానే వున్నట్టనిపించింది.

కుడిచేతి వైపు వాటాలో శేషన్, జయ వుండే వాళ్ళు. కొత్తగా పెళ్ళై కాపురం పెట్టిన జంట. జయ చక్కగా వుండేది. తన కంటె నాలుగేళ్ళు పెద్ద. ఆమె జీడంటే తనకెంతో ఇష్టం. పిరుదులదాకా తాచు పాములా వేలాడుతూ వుండే పొడవాటి జడ జయది. జయతో తొందరగా స్నేహం కలిసింది. తనదక్క పోయినా వాళ్ళాయన చేసే చిలిపిచేష్ట లన్నీ చెప్పుకుని మురిసిపోయేది.

"డాన్సు నేర్చుకుంటున్నావు కదా. ఆ తరువాత ఏం చేద్దామని" అని అడిగేది తనని.

'సినిమాల్లో చేరడానికి' అని చెప్పా లనిపించేదికాదు ఎంచేతనో తనకు.

"ఊరికెనే. మానాన్నకి నాట్యం అంటే చాలా ఇష్టం. అందుకని సరదాగా నేర్చు కుంటున్నాను"

ఆ రోజు... తనకి బాగా గుర్తుంది ఇంకా. మధ్యాహ్నం రెండు గంటలై వుంటుంది. చదువుకోడానికి పత్రికలు కూడా లేవు.

బయట చిన్నగా తుంపర పడుతోంది. జయతో కాసేపు కాలక్షేపం చేసిరావాలని పించింది. వాళ్ళ పోర్షన్‌లోకి వెళ్ళి తలుపు నెట్టింది తను. లోపల గడియ పెట్టలేదేమో వెంటనే తెరుచుకున్నాయి తలుపులు. తన కళ్ళబడిన ఆ దృశ్యాన్ని చూసి స్తంభించి పోయింది. గదిలో చాప మీద వాళ్ళిద్దరూ గాఢంగా పెనవేసుకుని...

ఒళ్ళంతా జలదరించింది తనకు. ఏదో

తెలిసీ తెలీని భయం. తత్తరపాటుతో చప్పున వెనక్కి తిరిగి గబగబా తన పోర్షన్‌లోకి వచ్చి తలుపులు మూసుకుంది.



ఆ తరువాత పదీ, పదిహేను రోజుల దాకా జయ కళ్ళలోకి సూటిగా చూళ్ళేక పోయింది.

వాళ్ళనా స్థితిలో చూశానని జయకి తెలిసిపోయిందేమోననే సందేహం మనసులో పీకుతూ వుండేది. ఇప్పటికీ ఆ సందేహం అలానే వుండిపోయింది

ఎదురింట్లో రాణి, వాళ్ళమ్మ ఉంటె వాడు. రాణి మూడో తరగతి చదువుతుండేది. ఆ పిల్ల మొహంలో మంచి కళ అప్పుడప్పుడూ డాన్సు క్లాసులకొచ్చేది. వాళ్ళమ్మకి కూడా కూతురికి నాట్యం నేర్పించాలని ఎంతో కోరిక. కాని తండ్రికి అది ఇష్టం లేదు;

రాణీ వాళ్ళమ్మ చీటీలు పాడేది. ప్రతి నెలా ఇంటి మధ్యలో వున్న వసారాలో అంతా అమె చుట్టూ చేరేవాళ్ళు.

డాన్సు చేస్తూంటే చూళ్ళేక సిగ్గుతో చచ్చిపోయింది.

"చూడు పాపా! మాకా పిల్లల్లేరు. నిన్ను అడాప్ట్ చేసుకోవాలనుకుంటున్నాము. మాతో వుండిపోతావా?" అని తన్ను తమాషా పట్టించేది ఫిలోమినా. అప్పుడప్పుడూ బైబిల్‌లోంచి మంచి మంచి కథలు చదివి వినిపించేది.

నాటకాల్లో వేషాలు రావటం ప్రారంభం కాగానే రాయపేట నుంచి నుంగం బాకానికి మకాం మారేరు. చూలై మేడులో మేడమీది పోర్షను. అరవై రూపాయలు అద్దె.

నాటకాల కోసం వచ్చే సభా సెక్రటరీలని, రిహార్సల్సు కనివచ్చే నటీనటుల్ని మొదట్లో వింతగా నిలబడి చూసే వాళ్ళు ఆ వీధి జనం. మొదట రెండు మూడు నాటకాలదాకా బస్సులోనే వెళ్ళేది డ్రామా థియేటర్‌కి. నాన్న ముందు వెళుతుంటే అతని వెనుక తలొంచుకుని నడిచేది బస్టాపుకి.

నాలుగో నాటకానికి అగ్రిమెంటు అయింది. బస్సులుమాని ఆటో రిక్షాలో వెళ్ళడం అలవాటు చేసుకుంది.

మొదటి సినిమా ఛాన్సు రాగానే నుంగంబాకం నుండి టి. నగర్‌కి మకాం మారింది.

పాతదే అయినా పెద్ద బంగళా అది. కింది భాగంలో రెండుమూడు కుటుంబాలు అద్దెకుండేవి. ఇంటికీ, ప్రహరీకి మధ్య ఖాళీ స్థలం, రకరకాల చెట్లు, మేడమీద ఒక పోర్షన్ లో స్టూడెంట్లుండేవారు. తక్కిన రెండు పోర్షన్లలో ఒక దాంట్లో ఓ స్టూడియోలో పనిచేసే అసిస్టెంటు ఎడిటరు, మరొకదాంట్లో అడ్వర్టయిజుమెంటు షాట్సు తీసే ఒకతనూ వుండేవారు. మొదట్లో ఆ బంగళా వెనక వున్న అవుట్ హవుసు మాత్రమే ఖాళీగా వుందన్నారు. అందులోనే దిగింది తను.

కాని సంవత్సరం తిరక్కుండానే ఆ బంగళానే కొనేసింది. ఆ పక్క బంగళాలు ఎవరివో తెలీదు.

ఎలా తెలుసుంది?

పొద్దున్నే కంపెనీ కారు ఏడింటికల్లా ఇంటి ముందాగుతుంది. స్టూడియోకి వెళ్ళి మళ్ళీ రాత్రి ఏ పదింటికో అదే కార్లో ఇంటికి తిరిగి రావటం.

పరిసరాల్ని గురించే అవకాశాల్ని కోల్పోవటం అలా ప్రారంభమైంది.

మరో ఆర్నెల్లు తిరిగేసరికల్లా కారు కొనేసింది.

స్టూడియోకి వెళ్ళే దారిలో జనం తనని గుర్తుపట్టి 'అదుగో సవితాదేవి' అని అరిచే వాళ్ళు. ఒక్కోసారి కారు చుట్టూమూగి కారుని ఆపేసిన సందర్భాలు కూడా వున్నాయి.

కోడంబాకం లెవల్ క్రాసింగు దగ్గర కారాగిపోయేది. అప్పుడింకా ఓవర్ బ్రిడ్జి కట్టలేదు. పావుగంటకోసారి ఎలక్ట్రిక్ ట్రెయిన్ కోసం గేటు మూసేవాళ్ళు. పది, ఒక్కోసారి ఇరవై నిమిషాలదాకా కూడా గేటు తెరుచుకునేది కాదు. దాదాపు అందరు తారల కార్లూ ఆ గేటుకాడ ఆగిపోవలసిందే. అందుకని సినిమా తారల్ని చూడాలనుకుని మద్రాసు వచ్చేవాళ్ళకి ఆ రైల్వేగేటు వైకుంఠ ద్వారం లాంటిది. ముఖ్యంగా తెలుగు వూళ్ళనించి వచ్చే వాళ్ళే ఎక్కువ సంఖ్యలో వుండే వాళ్ళు ఆ గేటు దగ్గర పడిగాపులు కాస్తూ. తిరుపతి స్వామి దర్శనం చేసుకున్న తరు

పాట మహా జోరుగా సాగేది. తండ్రి కూడా ఆమె దగ్గర చీటీ కట్టేవాడు. చీటీ డబ్బు వసూలు విషయంలో ఎంత ఖచ్చితంగా వుంటుందో, చీటు పంచి పెట్టడంలో గాని, చీటీ పాడిన వాళ్ళకి మర్నాటి రోజే డబ్బు అందివ్వటంలోగాని అంత కరెక్టుగా వుండేది. అయిదో తరగతి కూడా చదువుకోలేదు. అయినా డబ్బు లెక్కల విషయంలో మహా ఘటికురాలు. ఆ చుట్టు పక్కల ఇళ్ళల్లో కూడా అయిదారు చీటీలు పట్టేది. అన్ని లెక్కలూ ఎప్పుడూ నాలుక మీదుండేవి ఆమెకు. చీటీ లెక్కలన్నీ చిటికెలో తేల్చి పారేసేది.

ఆ వసారాలోంచి నిలబడి చూస్తే అన్ని పోర్షన్లూ కనిపించేవి. ఎవరింట్లో ఏమి వంట చేస్తున్నారో, ఎవరింటి పొయ్యి ఆ పూటకి వెలగ లేదో, ఎవరు జబ్బుతో పడుకుని వున్నారో, ఎవరింట్లో కీచులాట జరిగిందో అన్నీ తెలిసిపోయేవి.

ఎదుటి వసారాలో మూడో పోర్షన్‌లో వుండే సీతరామయ్య రిటైరైన పంతులు.

స్నానాల గదికి రేకు తలుపు. లోపల గడియ కూడా సరిగా పడేది కాదు. పావడా దావాణీ ఆ రేకు తలుపుమీద పడేసి స్నానం చేయాల్సొంచే. కొత్తలో చచ్చే సిగ్గుగా వుండేది తలుపు సందుల్లోంచి ఎవరైనా చూస్తూవున్నారేమోనని. ఒకరోజు పొద్దున్నే మూడో పోర్షన్ సీతారామయ్య మొలకి తుండు గుడ్డతో సరాసరి రేకు తలుపు నెట్టుకుని లోపలికి జొరబడ్డాడు పొరపాటున. బిత్తరపోయింది.

ఆ తరువాత అతనెదురుపడినప్పుడల్లా సిగ్గుతో తలొంచుకుని తప్పుకుపోయేది.

ఆ వీధి మొగదల్లోనే నాటారంగడి వుండేది. తమలపాకులు, బీడీ సిగరెట్లు, సోడాలు, చిల్లర సామానులు, కూరగాయలు– అంగడి చిన్నదే అయినా సమస్తం దొరికేవి ఆ అంగట్లో.

చింత మొద్దులా నల్లగా వుండేవాడు నాటారు. తెల్లగా మెరిసే కట్టుడు పళ్ళూ. తన్ను చూస్తే చాలు పళ్ళికిలిస్తూ "ఏం పాపా! డాన్సు బాగాదా చేస్తూవుండావా? బయస్కోపుల సేరి పూడు సహా ఏమి?" అంటూ పరాచికాలాడేవాడు.

"అవును. నువ్వూ చేర్తావా ఏం?" అడిగేది తను కూడా నవ్వుతూ.

"నీ పక్కన ఈరోగా అయితేదా ఏసం యేస్తును" అనే వాడు నాటారు.

తమలపాకులు అందరికీ ఇచ్చేకన్నా రెండాకులు ఎక్కువే ఇచ్చి పంపేవాడు తనకి.

నాటారంగడికి ఎదురుగా వుండే మిద్దింట్లో ఆంగ్లోయిండియన్‌ల కుటుంబం వుండేది. ఆయన పేరు జోసెఫ్. ఇంజన్ డ్రైవర్.

భార్య పేరు ఫిలోమినా. నలభై యేళ్ళుంటాయి ఆవిడకి. వాళ్ళిద్దరికీ తనంటే చాలా ఇష్టం. ఆవిడెప్పుడూ గౌను వేసుకునేది. చిన్న పాపలా ఇంత పెద్దావిడకి ఈ గౌన్లేమిటా అని వింతగా చూసేదాన్ని.

ఒకసారి క్రిస్టమస్ పండగ రోజు వాళ్ళింటికి పిలిచారు. వెళ్ళేసరికి వాళ్ళిద్దరూ బీరు తాగుతున్నారు. ఆవిడ సిగరెట్టు కూడా కాల్చటం చూసి నిర్ఘాంత పోయింది తను.

పాత గ్రామఫోను రికార్డు మీద ఏవో ఇంగ్లీషు పాటలు వేసుకుని ఒకరినొకరు పట్టుకుని ఆ చిన్న గదిలోనే ఇద్దరూ

పాత వాళ్ళు నేరుగా వచ్చేది సినీ స్వాముల దర్శనం కోసమే.

కారులో వున్న వాళ్ళు బయటికి కనిపించకుండా వుండటానికి కారుకి డార్కు బ్లూ రంగు అద్దాలు బిగించింది. అయినా లోపలికి తలలు పెట్టి చూసేవాళ్ళు.

మరో ఏడాది గడిచింది.

అడయారులో ఓ ఖరీదైన బంగళా కొనగలిగింది. చుట్టూ ఎత్తయిన ప్రహరీ. ప్రహరీకి, బంగళాకి మధ్య విశాలమైన తోట. రకరకాల చెట్లు, పూల మొక్కలు. ఆ ప్రాంతంలో దాదాపు అన్ని భవనాలూ అదే మాదిరిగా వుండేవి.

కాని ఎవరితోటీ తనకి పరిచయమేర్పడలేదు. ఇమేజికి ఎక్కడ భంగం కలుగుతుందోనని నాన్న ఎవరినీ ఇంటికి చేర్చేవాడు. కాదు.

ఆ బంగళాలో వుంటున్నంతసేపూ ఏదో రాణి వాసంలో వుంటున్నట్టుగా అనిపించేది. ఎప్పుడూ ఏదో షూటింగులు, అవుట్ డోర్ షూటింగులకి వెళ్ళినప్పుడు పెద్ద హంగామా జరిగేది అక్కడ. జనాన్ని కంట్రోల్ చెయ్యడానికి పోలీసులు. ఒక్కోసారి అసలు డ్యూటీకూడా మర్చిపోయి జనంతో బాటు పళ్ళికిలిస్తూ నోళ్ళు వెళ్ళబెట్టి తనకేసి చూస్తూ వుండిపోయేవాళ్ళు ఇన్స్పెక్టర్లు, కానిస్టేబిళ్ళు. ఒకసారి మౌంట్ రోడ్‌లో షూటింగు. తను కారు డ్రైవ్ చేసుకుంటూ పోవాలి. ముందు కార్లో కెమేరా. అందులో కెమేరామాన్, డైరెక్టరు. ముందు కారు పోతూ వుంటే షూట్ చేయాలి. రోడ్‌కి రెండు వేపులా గుంపులు గుంపులుగా జనం. ఆఫీసులు కూడా వదిలేసి వచ్చి ఆ ఎండలో నిలబడిచూస్తున్నారు. లాఠీలతో బాదుతూ జనాన్ని కంట్రోల్ చెయ్యటానికి విఫల ప్రయత్నం చేస్తున్నారు పోలీసులు. అయినా జనం కదలటంలేదు. గోల ప్రారంభమైది. మూహాడ్ తనకు పాడైంది. సుశీల నేపథ్యంలో పాడే గీతానికి నేను ముఖంలో భావాలు పలికించాల్సిన సీన్ అది. ఆ రోజుకి షూటింగు కేన్సిల్ చేసి వెళ్ళిపోవాలనిపించింది. ఆ జనాన్ని చూసి చీదరించుకుంది కూడా.

ఇమేజిని ఎలా కాపాడుకోవాలో అప్పుడప్పుడూ నాన్నా, రాంప్రభు పాఠాలు చెప్పేవారు.

"మన కెదురుగా లక్షమంది జనం వుండనీ గాక, ఎవ్వరూ లేనట్టుగానే ప్రవరించాలి మనం. వాళ్ళు నవ్వుతున్నారా, ఏడుస్తున్నారా, గలభాచేస్తున్నారా అనే విషయాలేవీ పట్టించుకోకూడదు. ఇప్పుడు నీ పేరు మీద అభిమాన సంఘాలు కూడా వెలుస్తున్నాయి. మంచిదే. అయితే 'మీ అభిమాన సంఘ కార్యదర్శి నండీ అనిఒకడూ, ప్రెసిడెంటు నండీ అని ఇంకోడు అల్లాటప్పాగాళ్ళు విరాళాలిమ్మని వెంటపడతారు. వీళ్ళని వీలైనంత దూరంలో వుంచాలి నువ్వు. అలా అని కసిరికొట్టడం కూడా చెయ్యకూడదు.

నీ సినిమా పోస్టర్లమీద పేడ ముద్దలు చల్లి, సినిమా హాల్సులో అల్లర్లు లేవదీసి నీ ఇమేజి పాడు చెయ్యగల గడుసుదనం కూడా వీళ్ళలో వుంటుంది. అంచేత చాలా తెలివిగా వీళ్ళనించి తప్పుకోవాలి"

బంగళా గేటు దగ్గర ఎప్పుడూ ఒక గూర్ఖా వుండేవాడు. 'జావ్ జావ్' అంటూ గేటు లోపలికి తొంగి చూసే జనాన్ని అదిలించి పంపేవాడు. తను నటించిన 'పద్మావతీ కళ్యాణం' విడుదలైన రోజు

లవి. రోజూ కనీసం ఒక టూరిస్టు బస్సయినా తన బంగళాముందాగేది. సినిమా యాక్టర్లని చూపించే షరతుల మీదే వాళ్ళు నించి టూరిస్టు బస్సుల్లో ఎక్కి వచ్చే వాళ్ళు జనం. బోడి గుండ్లతో, పిల్లా పాపలతో ఆడా మగా పొద్దున్నే బిలబిలమంటూ బస్సు దిగి బంగళా గేటు దగ్గర నిలబడే వాళ్ళు తన దర్శనం కోసం. మొదట్లో కొన్ని రోజులు ఓపిగ్గా గేటు వరకు వచ్చి ఓ అయిదు నిమిషాలు వాళ్ళతో "ఏ వూరునించి వస్తున్నారు. మద్రాసులో ఇంకా ఏమేం చూశారు" అని ఏవో రెండు మూడు మాటలాడి బంగాళాలోకి వెళ్ళిపోయేది. మర్యాద కోసం తను అడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పటం కూడా మర్చిపోయి నోళ్ళు వెళ్ళబెట్టి వింత జంతువుని చూసినట్టు చూస్తూ నిలబడే వాళ్ళు. ఆడంగులు ముసిముసిగా నవ్వుకుంటూ తలలుదించుకునే వాళ్లు. వెర్రి నవ్వులు నవ్వే వాళ్ళు మరికొంత మంది. రానురాను అలా వాళ్ళ ముందుకి వెళ్ళి నిలబట్టం అసహ్యమనిపించింది. తండ్రి కూడా వారించాడు. అంచేత అప్పట్నుంచి ఇంట్లో వుండి కూడా లేదని అవుట్ డోర్ షూటింగు కెళ్లిందనీ చెప్పించి వాళ్ళని వొదిలించుకునేది.

చెట్లనీ, క్రోటన్స్‌నీ,పూల మొక్కల్నీ దాటుకుని వెళితే బంగళా. ముందర ఇంట్లో మెట్ల పక్కనే మేనేజరు గది. దాన్నానుకుని తండ్రి బెడ్ రూం. ఎడం వేపు మరికొన్ని గదులు. వాటిలో ఇంకా కొంత సిబ్బంది సెక్రటరీ, అకౌంటెంటు మొదలైన వాళ్ళు. వీళ్ళని దాటుకుని నేరుగా మేడ మీదికి వెళ్ళేది.

మేడమీద కుడివేపున ఎయిర్ కండిషన్డ్ చెయ్యబడ్డ విశాలమైన గది తనది. కిందవున్న వాళ్ళతో మాట్లాటానికి ఇంటర్‌కాం ఫోన్ కనెక్షన్లు, గది లోపలో అటాచ్‌డ్ బాత్‌రూము. షవర్‌బాత్, బాత్‌టబ్ మొదలైన ఆధునిక సౌకర్యాలన్నీ ఉండేవి.

ఫోన్‌లో పిలిస్తే చాలు కాఫీ, టిఫిన్, భోజనం అన్నీ మేడ మీదికే వచ్చేవి. కాని కుమార్ మాత్రం వచ్చేవాడు కాదు. వాడికి తన దగ్గర చనువులేదు. ఎప్పుడూ అత్త దగ్గరే వుండేవాడు. అత్తంటే సొంతం ఏమీకాదు. ఎవరో వేలు విడిచిన దూరబంధువు. ఆవిడ్ని అమ్మా అని పిలవటం కూడా అలవాటైంది వాడికి.

డైరక్టర్లు, హీరోలు, డిస్ట్రిబ్యూటర్లు, నిర్మాతలు వీళ్ళందరి పేర్లూ గుర్తున్నాయి. కాని కెమేరా అసిస్టెంట్లు, సహాయ దర్శకులు, సౌండ్ రికార్డిస్టులు, లైట్ బాయ్‌లు వీళ్ళ పేర్లు తెలీదు. వందలకొద్దీ వుండే వారు. అసలు వాళ్ళని గురించి ఎందుకు పట్టించుకోవాలి అనే ధోరణి.

మేకప్‌మాన్, కాస్ట్యూమర్ వీళ్ళ దగ్గర మాత్రం మంచిగా వుండక తప్పేది కాదు. ముఖానికి రంగులు పూసి తన అందాన్ని ద్విగుణీకృతం చేసేవాడు మేకప్‌మాన్. అందంగా చీరె కట్టుకోవటం కుచ్చెళ్లు సవరించుకోవటం నేర్పేవాడు కాస్ట్యూమర్. జాకెట్టుకి టాకాలు వేయటం కూడా చేసేవాడు. తనకని ప్రత్యేకించి మేకప్ రూం, డ్రెసింగ్ రూం వుండేది.

ఇమేజ్ ఇమేజ్ అంటూ అందరికీ దూరంగా తొలగిపోతూ వచ్చింది. తన పేరు ప్రఖ్యాతులకి ఎక్కడ భంగం వాటిల్లు తుందోననే భయంతో ఎవరికీ అందకుండా దూరంగా వుండిపోతూ

వచ్చింది.

అంతాపోయినా ఈనాడు కూడా ఇల్లు దిగితే టాక్సీ లేకుండా బయటికి కదల్లేదు. టాక్సీకి డబ్బులేకుంటే ఈ నాల్గు గోడల మధ్యే వుండి పోతుందేగాని అందరిలా వీధిలోకి అడుగు పెట్టలేదు.

తన చుట్టూ ఒక సముద్రం.

ఈ ఇల్లు... కాదు... ఈ పోర్షన్ ఒక దీవి.

ఈ ఇంట్లో అద్దెకి దిగిన తొలిరోజుల్లో విశాలం పిన్నితో పరిచయం చేసుకుని వుంటే ఏం పోయేది. కాని అందుకు అభిజాత్యం, తారననే గర్వం అడ్డొచ్చింది.

చింత చచ్చినా పులుపు చావలేదు. అంతా అంతరించిపోయింది అయినా అందరిలోనూ కలవలేకపోతూంది.

ఎందుకని ?

తను మాత్రమేనా ? ఒకనాడు ఓహో అనిపించుకుని ఈనాడు 'అయ్యో పాపం?' అనిపించుకునే స్థితిలో వున్న నటీనటులంతా తనలాగే అజ్ఞాతవాసం గడుపుతూ వున్నారు. 'మార్కెట్‌ని మళ్ళీ పట్టుకోగలమేమోగాని ఒకసారి ఇమేజ్ పోగొట్టుకున్నామా తిరిగి పొందటం అసాధ్యం' అంటూ వుండేవాడు రాంప్రభు.

ఇప్పుడు తనకి అందని దూరంలో హాయిగా వున్నాడు.

ఈ విశ్వం కూడా తనకు తానె పరిచయ మేర్పరచుకున్నాడు. లేకపోతే తనకీపాటి వూరట తోడూ లేకుండా పోయేది. తనకు తానై ఎవరితోనూ మనసు విప్పి మాట్లాడి పరిచయం సంపాదించుకోలేక పోతోంది. తన పరిస్థితి చితికి పోయిన తర్వాత అంతా తనను గురించే అనుకుంటూ వున్నారనీ, హేళనగా, తేలికగా మాట్లాడుకుంటూ వుంటారేమోనని ఒక విధమైన న్యూనతా భావం తనలో పాతుకు పోయిందేమో.

విశ్వం చెప్పిందాంట్లో ఎంతో నిజముంది. తను భావించినట్లు, భ్రమపడినట్లు ప్రజలు తనను దూరం చేసుకోలేదు. తనే లేనిపోని అపోహలతో ప్రజలకు దూరమయింది.

సినిమా తారయ్యాక ఒకసారి రాయపేటలో మొదట్లో తామున్న ఇంటికి వెళ్ళి వాళ్ళని పలకరించి వుండవచ్చు. ఒకటి రెండు సార్లు ఆ ఆలోచన వచ్చినా అది కార్యరూపం ధరించలేదు. పెరిగిన తన హోదా, మారిన తన జీవితం ఆ విషయాన్ని గురించి సీరియస్‌గా పట్టించుకోనివ్వలేదు.

ఇప్పుడు వాళ్ళంతా ఎట్లా వున్నారో?

కంపోజిటర్ కూతురికి పెళ్ళయి ముగ్గురు పిల్లల తల్లి కూడా అయివుంటుంది. ఆఖరి పిల్లవాడు చిన్నసానికి విశ్వం వయసుండొచ్చు ఇప్పుడు. ఏదో ఉద్యోగం కూడా చేస్తూ వుంటాడు. కేశవన్ నాయర్, కళ్యాణి ఇంకా అక్కడే వున్నారో లేదో, 'మవళే-మవళే' అంటూ ఎంతో ప్రేమగా పిల్చే కళ్యాణి. జయకిప్పుడు ముసలితనం వచ్చి వుంటుందేమో. ఇల్లు కూడా మారి వుంటుంది. అప్పుడే వేరే ఇల్లు చూడాలని అంటూ వుండేది. సీతారామయ్యగారి కిప్పుడు డెభై యేళ్ళుండాలి. ఉన్నాడో లేదో వయసొచ్చిం తర్వాత తనని నగ్నంగా చూసిన మొదటి మగమనిషి ఆయనే. తల్చుకుంటే ఆనాటి సంఘటనకి ఇప్పటికీ నవ్వొస్తోంది తనకి.

చిల్లరకొట్టు నాటారెప్పుడో హరీమని వుంటాడు. ఇప్పుడా అంగడిని ఎవరు

చూసుకుంటున్నారో ? కొడుకు లేరు. కూతురో, అల్లుడో కూర్చుంటున్నారేమో కొట్లో.

జోసెఫ్-ఫిలోమినా ఇద్దర్లో ఎవరున్నారో, ఎవరు పోయారో?

"మాకు దత్తపుత్రికగా వుండిపోతావా పాపా?" అని అడిగేవాళ్ళు. అలా వుండిపోయినా బాగుపడి వుండేదేమో తన జీవితం. ఫిలోమినా చదువుకున్నది. అయినా ఆమెచేత ఉద్యోగం చేయించటం జోసెఫ్‌కి ఇష్టం లేదు. 'మన మిద్దరమేగా డియర్. నా సంపాదన మనిద్దరికీ బాగా సరిపోతుంది. హాయిగా ఇంట్లో కూచోక నువ్వు ఆఫీసుకెళ్ళి కష్టపడ్డ మెందుకు? అవసరాలకి మించిన డబ్బు కూడబెట్టి ఏం చేసుకుంటాం చెప్పు' అనేవాడు.

అతనికీ తన తండ్రికీ ఎంత భేదం! పెళ్ళాం పీడ ఎప్పుడు విరగడైపోతుందా అని కాచుక్కూచున్న వాడిలా అమ్మ చచ్చిపోగానే తన్ను తీసుకుని మద్రాసుకి రైలెక్కిన పెద్దమనిషి.

అమ్మకి తన్ను చదివించాలని వుండేది. చదివించి మంచి కుర్రాడికిచ్చి పెళ్ళి చేయాలనే సామాన్యమైన కోరిక ఆమెది.

"అదేమిటే అట్లా అంటావు! మీ అమ్మ కనక తార ఈ జిల్లా కంతటికీ పేరు మోసిన నాట్యతారగా వెలిగింది. ఆ సంప్రదాయం అలా అంతరించి పోకుండా వుండాలనే కదా అమ్మాయికి డాన్సు నేర్పిస్తా నంటున్నాను. ఇందులో తప్పేముందని?" అనేవాడు తండ్రి.

ఆ సాయంత్రం చేతిలో ఆల్బంతో వచ్చాడు విశ్వం.

"నాకుద్యోగం లేదనికదూ మీరంటు వుండేవారు. చూడండి ఒక రకంగా నా ఉద్యోగంలో ఇదీ ఒక భాగమే" అంటూ ఆ పెద్దసైజు ఆల్బంని సవితాదేవి చేతికిచ్చాడు.

"నా పదహారో ఏటనుంచే ఫొటోలు తియ్యటం నాకు హాబీ. ప్రారంభదశలో కంటికానినవన్నీ నా ఫోటోలో దిగేవి. ఇందులోని చాలా ఫొటోలు పత్రికల్లో వచ్చాయి. కొన్ని ప్రశంసలు కూడా అందుకున్నాయి. కొంత డబ్బు కూడా ముట్టింది. ఈ ఆల్బంని మీరే వుంచుకోండి నా కానుకగా" అన్నాడు విశ్వం ఆల్బం మీద సవితాదేవి పేరు రాస్తూ.

"థాంక్స్ విశ్వం" అని ఆల్బం పేజీలు తిరగేసింది సవితాదేవి. అందులోని చాలా చిత్రాలు శ్రమ జీవులకి సంబంధించినవే.

రాళ్ళెత్తే కూలీలు, మాగాణి నాటే పల్లెపడుచులు, కొడవళ్ళు చేతబట్టి పంట కోసే పడుచు జంటలు, వాళ్ళముఖాల్లో, నేత్రాలలో ప్రతిఫలించే ధైర్యం, దైన్యం, ఆత్మవిశ్వాసం, బతుకుభయం వగైరా విభిన్న భావాలు ఆ ఛాయా చిత్రాల్లో ప్రతిబింబిస్తున్నాయి. శ్రమైక జీవన సౌందర్యాన్ని ఎత్తిచూపుతూ కొన్ని బతుకు భయాన్ని తెలిపేవి కొన్ని, తెగించి సమ్మెలు కట్టిన కూలీల ముఖాలు కొన్ని, ఆకలికి అలమటించే తల్లుల, బిడ్డల భార్యల దీన వదనాలు కొన్ని అన్నింటిలోకీ తాజ్‌మహల్ మీద సూపర్ ఇంపోజ్ చేయబడిన నెత్తురు చిమ్మే చెమటలు కక్కే శ్రామికుల ఆకారాలని చిత్రించిన ఫొటో సవితాదేవిని చాలా ఆకర్షించింది.

'తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?' అన్న మహాకవి చరణాలు గుర్తుకొచ్చాయి ఆమెకి.

* * *

"రాయపేటకు ఒకసారి వెళ్ళి రావాలని వుంది విశ్వం" అన్నది ఒకరోజు సవితాదేవి.

"ఎందుకండీ ?"

"నేను ఈ నగరానికి వచ్చిన తొలి రోజుల్లో సుమారు రెండేళ్ళ దాకాఅక్కడే ఒక చిన్న వీధిలో వుండేదాన్ని, మంచి మనుషులు. నాతో ఎంతో ఆప్యాయంగా వుండేవాళ్ళు. ఒకసారి వెళ్ళి వాళ్ళందరినీ చూసి రావాలని పిస్తోంది.

"ఇన్నేళ్ళకి గుర్తొచ్చారా వాళ్ళు అని అనుకుంటున్నావు కదూ! నిజమే. వాళ్ళ



ప్రపంచంలోంచి దూరంగా తీసికెళ్ళింది నన్ను సినిమారంగం తారాజువ్వలా సినీ ఆకాశంలోకి దూసుకుంటూ వెళ్ళి దగ్ధమై, మసిబారి మళ్ళీ నేల రాలాను. ఎటూ మళ్ళీ వాళ్ళలో కలిసిపోలేక పోయినా కనీసం చూసి రావాలనిపిస్తోంది"

"మంచిదే. వెళ్ళిరండి. కాని ఎప్పుడో ఇరవై యేళ్ళ కిందట చూసిన ఆ మను

షులు ఇంకా అక్కడే వుంటారని ఏమిటి నిశ్చయం"

"కొంపదేసినా వుండరంటావా ?"

"ఉండొచ్చు. తప్పకుండా వెళ్ళండి. ఈ అనుభవం ఒకచిత్రమైన అనుభూతిగా మిగిలిపోతుంది మీకు" అన్నాడు విశ్వం సంతోషంగా.

"కాని..."

"ఏమిటి ?"

"అందరిలా అనుకున్న చోటుకి అనుకున్న పళంగా వెళ్ళలేని స్థితిలో వున్నాను. అందునా ఆ పేటలో జన సమ్మర్దం ఎక్కువగా వుంటుంది"

"అంటే..."

"ఎంత మార్కెట్టు పడిపోయినా నేనింకా తారనే కదా విశ్వం. పత్రికల దృష్టిలో మాజీ తారనే అయినా ప్రజలు నన్నింకా మరిచిపోయి వుంటారనుకోను. నా చుట్టూ గుంపు చేరొచ్చు"

విశ్వం చిన్నగా నవ్వుకున్నాడు.

"చింత చచ్చినా పులుపు చావలేదనుకుంటున్నావు కదూ ?"

"కాదు...మీరిలా సందేహిస్తు కూచున్నారంటే అసలెన్నటికీ మీ మనుషుల్ని కలుసుకోలేరు"

"పోనీ నాకు తోడుగా నువ్వూ రాకూడదూ. నాక్కాస్త ధైర్యంగా వుంటుంది" పిలిచింది సవితాదేవి.

"నాకభ్యంతరం లేదు'' అన్నాడు విశ్వం చిర్నవ్వుతో.

ఆ మర్నాటి రోజు సాయంత్రమే వెళ్ళడానికి నిశ్చయించు కున్నారు. కొన్ని ముఖ్యమైన పనులున్నాయని, ఎవరినో కలుసుకోవాలనీ చెప్పి వెళ్ళిపోయాడు విశ్వం.

సాయంకాలం ఆరుగంటలై వుంటుంది. కిటికీ దగ్గర నిలబడి వీధిలో వచ్చేపోయే జనాన్ని, వాహనాల్ని చూస్తూ కూర్చుంది సవితాదేవి. రేపు రాయపేటలో, ఆ వీధిలోని ఇంటిని గుర్తుపట్టగలదా ? ముందు ఎవరిని ఎలా పలకరించాలి ? ఏం మాట్లాడాలి? మునుపటి ఆప్యాయత, చనువు కనబరుస్తారా వాళ్ళు? 'బతికి చెడింతరువాతే గుర్తొచ్చామా తల్లీ మేమంతా?' అని నిష్టూరాలాడరు గదా ? ఇలా సాగుతున్నాయి ఆమె ఆలోచనలు.

కుప్పుసామి కంగారుగా మెట్లెక్కి గదిలోకొచ్చాడు.

"అమ్మా...అమ్మా అయ్యగారొస్తున్నారమ్మా!" అన్నాడు.

కారు తలుపు తెరిచి మూసిన శబ్దం. కాసేపటికి మెట్లమీద బూట్ల చప్పుడు వినబడింది.

''హాయ్ ! డార్లింగ్'' అంటూ గదిలోకొచ్చాడు రాంప్రభు.

''దండాలు బాబూ'' వినయంగా నమస్కరించాడు కుప్పుసామి. టవల్‌తో కుర్చీ తుడిచి

''కూర్చోండి బాబూ'' అని వినయంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"వీళ్ళెవరో తెల్సా డార్లింగ్?'' అంటూ తన వెనకే వచ్చి నిలబడిన ఆ ఇద్దరినీ పరిచయం చేశాడు.

''ఇతను 'తొలి కిరణాలు' విలేకరి. ఈయన ఫొటోగ్రాఫర్"

ఆ ఇద్దరూ నమస్తే చెప్పారు సవితాదేవికి.

"కూర్చోండి" అని వాళ్ళిద్దరికీ మంచం చూపించింది సవితాదేవి.

"నువ్వు నర్సింగ్ హోమ్‌లో వున్నప్పుడు నాతోకూడా వీళ్ళిద్దరూ

వచ్చారు నిన్ను చూట్టానికి. నిన్ను గురించిన వార్తల్ని అప్పటి కప్పుడు ఎంత ప్రామినెంట్‌గా ఫ్లాష్ చేశారను కున్నావు! నీ గురించి ప్రజలంతా మళ్ళీ అదేపనిగా చర్చించుకున్నారంటే అందుకు వీళ్ళే కారణమనుకో" అంటూ సిగరెట్ వెలిగించుకున్నాడు రాంప్రభు. సవితాదేవి ఏమీ మాట్లాడలేదు. ఆమె ముఖంలో ఎటువంటి భావమూ గోచరించకుండా నిర్లిప్తంగా వుండటం గమనించి కుర్చీ లోంచి లేచాడు. ఆమెకు దగ్గరగా వెళ్ళి 'ఒక్క నిమిషం' అంటూ పక్కగదిలోకి తీసుకెళ్ళాడు ఆమెను.

"ఏమిటి సవితా ఇది? ప్రెస్‌వాళ్ళని పిలుచుకొస్తే సభ్యత లేకుండా నువ్వింత నిర్లక్ష్యంగా ప్రవర్తించటం ఏమీబాగోలేదు. వాళ్ళు చిలవలు పలవలు కల్పించి, గోరంతలు కొండంతలు చేసి రాస్తారని నీకు మాత్రం తెలీదా చెప్పు" కొంత బతిమాలుకుంటున్నట్టు, కొంత కోపగించు కుంటున్నట్టు ధ్వనించేలా అన్నాడు.

"వాళ్ళు ఏమైనా రాసుకోనీ. నాకేం?" అన్నది సవితాదేవి వుక్రోషంగా.

"సవితా! కాస్త మెల్లగా మాట్లాడు"

"ఏం? ఎందుకనీ? వాళ్ళకి భయపడా ల్సిన అవసరం నాకులేదు" నిర్లక్ష్యంగా అంది.

"పోనీ నాకుంది అనుకోరాదు? నేనింకా ఫీల్డులో వున్నాను. పత్రికలవాళ్ళ అవసరం సహకారం నాకు తప్పనిసరి. సవితా! ప్లీజ్! ఈ ఒక్కసారికి నాకోసం వచ్చి వాళ్ళతో మాట్లాడు" బతిమాలుతూ అన్నాడు రాంప్రభు.

"ఇప్పుడు వాళ్ళని మీరిక్కడికి వెంట బెట్టుకు రావాల్సిన కారణం?" అతని ముఖంలోకి గుచ్చిగుచ్చి చూస్తూ అడిగింది.

"నిజం చెప్పనా? నర్సింగ్ హోం నించి తిరిగొచ్చిం తరువాత నిన్ను వచ్చి చూశ్ళేదనుకో. దాన్నో పెద్ద న్యూస్‌చేసి, పెడార్థాలు తీసి రాస్తారు. అప్పుడు నా ఇమేజ్ దెబ్బతినొచ్చు. కాదంటావా చెప్పు?"

'చేదుగా వున్నా నిజం చెప్పినందుకు సంతోషం' అనుకుని మనసులోనే బాధగా నవ్వుకుంది సవితాదేవి.

రాంప్రభు వచ్చాడన్న వార్త అప్పటికే ఆ వీధంతా పాకిపోయింది. కింద జనం గుంపు చేరారు. కిటికీ దగ్గర సవితాదేవి, రాంప్రభు నిలబడి వుంటాన్ని గమనించి గుంపులోంచి ఒకడు ఈలవేస్తున్నాడు.

"చూడు డియర్. టైమవుతోంది. నా కోసం దయచేసి ఓ అయిదు నిమిషాలు వాళ్ళతో మాట్లాడు. పద" అంటూ ఆమె భుజాలచుట్టూ చేతులువేసి నడిపించు కుంటూ ముందర హాల్లోకి వచ్చాడు రాంప్రభు.

"చూస్తూ వుండండి బ్రదర్స్! మా సవిత మళ్ళీ సినిమాలోకంలో విజయ ఢంకా మోగించబోతోంది. చచ్చి బతకడం అంటే సామాన్యమా చెప్పండి! పునర్జన్మ ఎత్తింది కదండీ. అన్నట్టు చెప్పడం మరిచాను డార్లింగ్. నిన్న ప్రసాద్‌ని కలుసుకున్నాను. వాళ్ళ నెక్స్ట్ పిక్చర్‌లో నీకో మంచి కేరెక్టర్ రోల్ వుందన్నాడు"

మౌనంగా వింటూ కూర్చుంది సవితా దేవి.

"ఇంటర్‌వ్యూ ప్రారంభిద్దామా ఇక" అన్నాడు విలేకరి.

"ఓ...వుయ్ ఆర్ రెడీ" అన్నాడు సవితాదేవికేసి చూస్తూ రాంప్రభు.

"చూడండి మేడమ్! 'వసంతంలో

ఒకరోజు' చిత్రంలో మీరు నటించిన సీన్లన్నీ తీసేసి ఆ స్థానంలో రమాదేవిని తీసుకున్నారు గదా. దీనిమీద మీ అభిప్రాయం ఏమిటి?"

"ఓ...నో, మిస్టర్ జయరామన్. ఇలాంటి ప్రశ్నలు అడక్కండి ప్లీస్. అనవసరమైన వివాదాలకి దారితీసే విషయాలు ఆమె కెరీర్‌కి అడ్డురావచ్చు" అన్నాడు రాంప్రభు.

"కాంట్రవర్సీ వుంటేనే కదండీ న్యూస్‌లో కిక్కుంటుంది"

"అయితే ఒక పని చెయ్యండి. 'దీన్ని ఒక ఛాలెంజి కింద భావించి ముందు ముందు తన పాత్రల్లో మరింత కృషిచేసి తన నటనా సామర్థ్యాన్ని నిరూపించుకోబోతున్నాను' అన్నారు సవితాదేవి అని రాసుకోండి" అని ఆమె తరపున సమాధానం ఇచ్చాడు రాంప్రభు.

"ప్రసాద్‌గారి చిత్రంలో నటించటానికి అంగీకరిస్తారా"

"కళనీ, వ్యాపారాన్నీ మేళవించి విజయవంతమైన చిత్రాలు నిర్మించే బహు కొద్ది మంది నిర్మాతల్లో ప్రసాద్‌గారొకరు. వారి చిత్రంలో నటించటం నా అదృష్టంగా భావిస్తాను అని రాసుకోండి" అన్నాడు రాంప్రభు. ఇలా అన్ని ప్రశ్నలకీ అతనే సమాధానం ఇస్తూ వచ్చాడు.

"ఇక వొదిలి పెట్టండి బ్రదర్స్. మా బేబీ అలిసిపోయినట్టుంది. ఇంకా ఏవైనా మిగిలుంటే మీరే రాసుకోండి. కాని, జాగ్రత్తసుమా" అని నవ్వేడు.

"చివరి ప్రశ్న. దీనికి మాత్రం సవితాదేవిగారే సమాధానం ఇవ్వాలి" అన్నాడు విలేకరి ఆమెవేపు తిరిగి చిర్నవ్వుతో

"ఓ. కే. అడగండి. బాగా ఆలోచించి చెప్పు బేబీ"

"రాంప్రభుగారితో మళ్ళీ నటిస్తారా?" సవితాదేవి ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాడు విలేకరి.

"మొత్తానికి పత్రికల వాళ్ళనిపించుకున్నారు బ్రదర్" అన్నాడు కొంచెం తమాషాగానూ, కొంచెం నిష్ఠూరంగానూ. "అయినా మా మధ్య తగూల్లు, తగాదాలు ఏమున్నాయని. అవకాశం వస్తే నటించటానికి మేమెప్పుడూ సిద్ధమే"

"అమ్మగార్ని చెప్పనివ్వండి సార్" అన్నాడు విలేకరి సవితాదేవిని చూస్తూ.

"కలిసి నటించే అవకాశం రాదు" అని సవితాదేవి రాంప్రభు కేసి చూసింది.

"ఎందుకలా అనుకుంటున్నారు ?" అడిగాడు విలేకరి.

"మనవణ్ణి ఎత్తుకునే వయసొచ్చినా ఇంకా ఆయన హీరో వేషాలు వేస్తూనే వున్నాడు. కాని నా విషయం? అమ్మ వేషాలకీ, అత్త వేషాలకీ మాత్రమే పనికొస్తాను నేను"

"వెల్ సెడ్. చూశారా ఫీల్డుని ఎంత బాగా ఆకళింపు చేసుకుందో మా సవిత. మేమిద్దరం జంటగా నటించాలన్నా అది సాధ్యంకాదు. నా ఇమేజ్ కూడా దెబ్బ తింటుంది" అంటూ కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు రాంప్రభు.

"అయితే ఇక మనం బయలేరదామా?" అని విలేకరికేసి చూశాడు.

"సార్ ఒక స్నాప్" గుర్తు చేశాడు ఫొటోగ్రాఫర్.

"ఓ! మర్చేపోయాను. కమాన్ బేబీ" అని సవితాదేవి భుజాల చుట్టూ చెయ్యి వేసి నిలబడ్డాడు రాంప్రభు.

* * *



"విశ్వం! నిన్ననో తమాషా జరిగింది తెల్సా. నిన్న సాయంత్రం పత్రికల వాళ్ళని వెంటేసుకుని రాంప్రభు వచ్చాడిక్కడికి" అని జరిగిందంతా చెప్పి చెప్పి నవ్వింది సవితాదేవి. ఆ నవ్వులో విషాదమే దాగివుందో, రాంప్రభు మీద కసి తీర్చుకున్న ఆనందమే కలిసి వుందో తెల్చుకోలేకపోయాడు విశ్వం.

బీరువాలోంచి ఇస్త్రీ చేసిన చీర తీసుకుని గదిలోకి వెళ్లింది సవితాదేవి. కాసేపట్లో ముస్తాబై వచ్చింది.

"విశ్వం! బయలేరదామా ?"

"పదండి"

"టాక్సీ తెచ్చావా ?"

"లేదు"

"ఆటో ?"

"లేదు. బస్సులోనే వెడదాం పదండి"

గతుక్కుమంది. ఎలా చెప్పాలో అర్థం గాక కొద్ది క్షణాలు మౌనంగా నిలబడి పోయింది.

"ఒద్దు విశ్వం! నాకేదోగా వుంటుంది. నాకింకా అంత తెగింపు రాలేదు" అన్నది జాలిగా.

"చూడండి. ఈనాడు కాకపోతే రేపు, ఆ మర్నాడు, ఎప్పుడో ఒకప్పుడు బస్సులోనూ, రోడ్డు మీదా మీరు ప్రజల మధ్య కలిసి మెలగాల్సిన అవసరం రాకుండా పోదు. అంచేత ఈ రోజే ప్రారంభించండి. అంతా మీకేసి వింతగా చూస్తారేమోనని అనుకుంటున్నారు. చూడనీండి. మీతో మాట్లాడాలని కూడా ప్రయత్నించొచ్చు కొంతమంది. చిర్నవ్వుతో మంచిగా సమాధానం చెప్పండి. కొందరు దూరంనించి మిమ్మల్ని చూసి గుసగుసలు పోవచ్చు. ఈ తతంగమంతా కొన్నాళ్ళదాకా మాత్రమే. తమ తెగకి చెందని ఓ కొత్త మనిషిని చూసినట్టు కొన్నాళ్ళపాటు ప్రవర్తిస్తారేమో. ఆ తరువాత అంతా అలవాటైపోతుంది. తమలో ఒక మనిషిగా గుర్తిస్తారు ప్రజలు మిమ్మల్ని మీరింత కాలం భయపడుతూ కాపాడుకుంటూ వచ్చిన ఆ ఇమేజ్ కరిగిపోతుంది. కోటానుకోట్ల ఈ ప్రజావాహినిలో మీరూ ఒక వ్యక్తిగా ముసుపెన్నడూ మీ అనుభవంలోకి రాని స్వేచ్ఛతో హాయిగా, ఫ్రీగా గాలి పీల్చుకుంటారు" అని ఇంకా చెప్పుకుపోతున్నాడు విశ్వం.

"సత్యన్ గురించి తెలుసా మీకు ?"

"మలయాళం హీరో సత్యనేనా ?" కాసేపు ఆలోచించి అన్నది సవితాదేవి.

"అతనే! మీరు అంటూ వుంటారే 'స్టార్ ఇమేజ్'- చనిపోయే దాకా దాన్ని నిజంగా కాపాడుకోగలిగిన మహానటుడు సత్యన్. అతనికి సొంత కారుంది.అయినా చాలాసార్లు బస్సులోనే వెళ్ళేవాడు. ఈ ఆర్కాట్ రోడ్‌లో స్నేహితుల భుజాల మీద చేతులేసుకుని నవ్వుతూ, కబుర్లు చెబుతూ అతను నడిచి వెళుతూండటం చాలా సార్లు చూసి వున్నాను. రాం థియేటర్ దగ్గరున్న హోటల్‌కి తరచుగా వచ్చేవాడు. అందరితో బాటు కూర్చుని

తినేవాడు.

'సత్యన్ సారే', 'సత్యన్ అన్నొచ్చి' అంటూ అతని అభిమానులు చుట్టూ మూగే వారు. వాళ్ళ ముఖాల్లో తమకి అందని వ్యక్తి పట్ల కనబడేచే గౌరవం, సంకో చాలు కనిపించేవి కాదు. ఆ స్థానంలో ఆత్మీయుడైన, తమలో ఒకడైన మనిషి పట్ల కలిగే అభిమానం, ఆప్యాయతే వెల్లి విరిసేవి. అందరికీ టీ ఆర్డర్ చేసి తనే బిల్లు చెల్లించేవాడు.

"ఎంతో గొప్ప కళాకారునిగా, మేధావిగా, దేశాధినేతగా జీవించటం కన్న ప్రజల మనిషిగా బ్రతకటం మిన్నగా భావిసాను నేను. ప్రజలకు దగ్గరైనందువల్ల, మీ స్టార్ ఇమేజ్ దెబ్బతింటుందని అపోహపడుతున్నారు.

ప్రజల్లో కలిసిపోయిన కళాకారుణ్ని కేవలం అతని కళకోసమే గాక వ్యక్తిగా అభిమానించి ఆరాధిస్తుంది ప్రజ. స్టార్ ఇమేజ్ అన్నది తారగా వున్నంత కాలమే. కాని ప్రజల మనిషికి వుండే స్థానం అతని జీవితం ముగిసినా కూడా అంతరించిపోనిది"

"సరే పదవయ్యా బాబూ! నీ వుపన్యాసంతో చీకటి పడేట్టుంది" అని నవ్వుతూ అతని చేయి పట్టుకుని కదిలింది సవితాదేవి.

ఆ వీధిలోని వాళ్ళంతా వింతగా చూశారామె వేపు. ఒకరిద్దరు వెకిలిగా నవ్వారు. సూటిగా చూడ్డానికి మొహమాట పడే కొందరు వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ వెళ్తున్నారు. విశ్వం పక్కనే బస్టాపులో నిల్చుంది సవితాదేవి. ఆమె కంతా ఏదో కొత్తగా, వింతగా వుంది. కాళ్ళలోసన్నగా వణుకు కూడా ప్రారంభమైంది.

"నమస్కారమండీ"

నేలమీంచి చూపులు మరల్చి పక్కకి తిరిగి చూసింది. ఆ అమ్మాయికి పది హేనేళ్ళుంటాయి. చేతిలో స్కూలు పుస్తకాలతో నిలబడి వుంది. రెండోసారి మళ్ళీ "నమస్కారమండీ" అన్నది తన వేపు తదేకంగా చూస్తూ.

"నమస్తే" అంది సవితాదేవి.

"మీరు సినిమా యాక్టర్ సవితాదేవి గారేకదండీ" అందా అమ్మాయి సందేహంగా.

"అవునమ్మా" అంది తను నవ్వుతూ.

"నాపేరు సావిత్రి అండీ. ఇక్కడే గరల్స్ స్కూల్లో టెన్త్ చదువుతున్నాను. షూటింగు జరుగుతుందాండీ ఇక్కడ?'' అడిగింది ఆ అమ్మాయి ఆశ్చర్యంగా.

"లేదమ్మా''

"అయితే మీరిక్కడ...?

"బస్సుకోసం వున్నానమ్మా''

నిర్విణ్ణురాలై కళ్ళింతలు చేసుకుని చూసిందా అమ్మాయి.

"ఏమిటీ! మీరు బస్‌లో వెళ్తారా?"

"ఏం వెళ్ళకూడదా? మీరంతా వెళ్ళటంలేదూ?" అని విశ్వం కేసి చూసి నవ్వింది సవితాదేవి.

ఎదురుగా అవతలి వేపు ఆగిన బస్సు లోంచి దిగిన జనం కాస్సేపు నిలబడి వింతగా చూసి సాగిపోతున్నారు.

"మీకు కారు లేదా?" అడిగింది అమ్మాయి.

"అమ్మేశానమ్మా"

అంతలో ఏదో బస్సొచ్చి ఆగింది

"వెళ్ళొసానండీ" అని అందులో ఎక్కి వెళ్ళిపోయింది అమ్మాయి. ఆ వెన

కనే పదమూడో నంబర్ బస్ వచ్చింది.

"ఇదే మనం వెళ్ళాల్సిన బస్. రండి" అంటూ ఆమెని ఎక్కించి, వెనకే తనూ ఎక్కాడు విశ్వం. అదృష్టవశాత్తు అందులో జనం ఎక్కువగా లేరు. ఖాళీగా వున్న సీట్లో ఇద్దరూ పక్క పక్కనే కూర్చున్నారు.

టికెట్ అడగటం కూడా మర్చిపోయి కొద్ది క్షణాలపాటు వింతగా చూస్తూ నిలబడ్డాడు కండక్టర్. డ్రైవర్ బస్ స్టార్టు చేయబోతుండగా 'కొంచెం ఇరప్పా' అంటూ ఇద్దరి దగ్గరికి వచ్చి "ఏదావదు షూటింగ్ ఇరుక్కా?" అని అడిగాడు కండక్టర్. లేదన్నట్టు తలూపి రాయపేటకి రెండు టికెట్లు తీసుకున్నాడు విశ్వం.

రాయపేటలోని ఆ వీధిని సులభంగానే గుర్తు పట్ట గలిగింది సవితాదేవి. కాని ఇంటిని పోల్చుకోవటం సమస్యే అయింది.

పాతికేళ్ళలో ఆ వీధిలో చాలా మార్పులొచ్చాయి. వీధి పేరులోనే మార్పు! చిన్న సామి చెట్టి వీధి చిన్నసామి వీధిగా మారింది. కులాల ప్రాతిపదిక మీద ఓట్లు సంపాదించి పదవిలో కొచ్చిన ప్రభుత్వం వీధి పేర్లలో కులాల ప్రసక్తిని నిర్మూలించాలనే అభ్యుదయ పథకాన్ని చేపట్టింది. ఫలితంగా రెడ్డియార్ కాలనీ వుత్త 'కాలనీ'గానూ, బ్రాహ్మణ వీధి కేవలం 'వీధి'గానూ మిగిలి పోయాయి. ఇంటి నంబర్లు కూడా మారిపోయాయి. ఆ వీధిలోని ఇళ్ళ సంఖ్యని బట్టి తను కాపురముండిన ఇంటిని వూహించుకో గలిగింది కొంత ప్రయత్నం తరువాత. నాలుగిళ్ళ చావడి లాంటి ఆ పెంకుటింటి స్థానంలో ఇప్పుడొక రెండంతస్తుల మేడ లేచింది. వీధి మొగల్లో తనకి పరిచయమైన నాటార్ అంగడికి బదులు కాఫీ హోటలు కనిపించింది.

అప్పటికే అక్కడక్కడా ఆడా మగా నిలబడి ఆమెకేసి విస్తుపోయి చూస్తున్నారు. తమలో తాము ఏదో మాట్లాడుకుంటున్నారు. మేడ ముందు నిలబడి లోపలి కెళ్ళడమా వద్దా అని తటపటాయిస్తోంది సవితాదేవి. రెండేళ్ళపాటు తనకాశ్రయమిచ్చిన ఆ పెంకుటిల్లు ఇప్పుడు లేదు. ఆ మనుషలు మాత్రం వుంటారా? కంపోజిటర్ భార్య కామాక్షి, శేషన్, అతని భార్య జయ, వీళ్ళంతా ఇక్కడే వున్నారా? ఎవరినడగాలి? ఎవరు చెపుతారు? లోపల్నుంచి అప్పుడే బయటికొచ్చి గుమ్మం దగ్గర నిలబడిందో మార్వాడీ పడుచు.

"ఎవరు కావాలి?" అడిగింది సవితాదేవిని చూస్తూ.

"చాలా కాలం కిందట నేనిక్కడ వుండేదాన్ని. అప్పుడిది పెంకుటిల్లు. వాళ్ళంతా ఇప్పుడెక్కడ వున్నారో చెప్పగలరా ?"

బదులు చెప్పకుండా లోపలికెళ్ళిపోయిందామె. అంతసేపూ సవితాదేవి కేసి పరీక్షగా చూస్తూన్న ఓ ముసలావిడ దగ్గరగా వచ్చింది.

"పదేళ్ళయిందమ్మా ఆ ఇల్లమేసి. ఈ మార్వాడీ సేట్ కొనుక్కున్నాడు. పాత ఇంటిని కొట్టించి ఇదుగో ఈ మేడ కట్టించాడు. ఇంతకీ ఎవరు తల్లీ నువ్వు?" అనడిగింది. ముసలావిడ కళ్ళు చికిలించి సవితాదేవి ముఖంలోకి చూసి. సవితాదేవి చెప్పింది.

ముసలావిడ ముఖం విప్పారింది.

"నువ్వా తల్లీ ! ఎంత మారి పోయేవే అమ్మా! ఎప్పుడో బయాస్కోపులో రెండు

మూడు సార్లు చూశాను. బాగున్నావా అమ్మా? నేను గుర్తున్నానా?" అంటూ సవితాదేవి చేతులు పట్టుకుందావిడ.

సవితాదేవికి వెంటనే గుర్తురాలేదు. ఇబ్బందిగా ముఖం పెట్టి నవ్వింది.

"నేను తల్లీ రంగమ్మను. కల్యాణి కుట్టి ఇంట్లో అంట్లు తోమడానికి వచ్చే దాన్ని."

అప్పుడే రంగమ్మ కి ముప్ఫై రెండేళ్ళుండేవి. మొగుడొదిలేస్తే ఆవీధి లోని రెండు మూడిళ్ళల్లో పాచిపని చేసుకుంటూ బతికేది.

"బాగున్నావా రంగమ్మా?" గుర్తు తెచ్చుకుని ఆప్యాయంగా పలకరించింది.



"ఏదో ఇట్టా రోజులు నెట్టుకొస్తున్నాను. పాత వాళ్ళందరినీ చూచి పోదామని వచ్చావా తల్లీ?"

"అవును రంగమ్మా, వాళ్ళంతా ఇప్పుడెక్కడున్నారో నీకేమైనా తెలుసా?" ఆత్రుతగా ప్రశ్నించింది.

"నువ్వెళ్ళిపోయిన ఆర్నెల్లకే జయమ్మ కూడా ఖాళీ చేసి వెళ్ళిపోయిందమ్మా. ఇప్పుడెక్కడున్నారో తెలీదు. ఆమోటారు నడిపే ఆయన లేడూ..."

"ఎవరు? కేశవన్ నాయరా?"

"ఆఁ... ఆయనే. ఏదో బస్సు ప్రమాదంలో చిక్కుకుని చచ్చిపోయాడు పాపం. ఆయమ్మ వాళ్ళ దేశం వెళ్ళిపోయింది."

కొద్ది క్షణాలు మౌనంగా వుండి "మిగతా వాళ్ళు?" అని అడిగింది సవితా దేవి.

"ఆ ఇల్లు అమ్మేదాకా ఇక్కడే వున్నారమ్మ. సేట్ కొనేసి వాళ్ళందరినీ ఖాళీ చేయించాడు. ఇప్పుడెక్కడున్నారో ఏమో"

"ఇక వెళదామా?'' అన్నాడు అంత సేపూ వోపికగా అక్కడే నిలబడిన విశ్వం.

"వస్తాను రంగమ్మా'' అని భారంగా కదిలింది సవితాదేవి.

"మళ్ళీ బయస్కోపుల్లో ఇస్తున్నావా తల్లీ?" రంగమ్మ ప్రశ్నకి సవితాదేవికి నవ్వొచ్చింది.

"లేదు రంగమ్మా! అయినా ఇప్పుడు నన్నెవరు తీసుకుంటారు చెప్పు?"

"అట్టా అనకమ్మా. అయినా నీకేం తక్కువని? బంగారు బొమ్మలాగున్నావు" అని చేత్తోనే దిష్టితీసి కణతలకు నొక్కుకుని మెటికలు విరిచింది రంగమ్మ.

వీధి మలుపులో జోసఫ్, ఫిలోమినాల ఇల్లు మాత్రం ఏమీ మారకుండా నిలిచి వుంది. గోడలకి అక్కడక్కడా పెచ్చులూడిపోయి ఇటుకలు కనిపిస్తున్నాయి. షుమారు ఓ ఇరవై యేళ్ళ ఆంగ్లో ఇండియన్ యువతి గుమ్మంలో నిలబడి ఎవరితోనో మాట్లాడుతోంది. సవితాదేవి, విశ్వం ఆ ఇంటి వేపే రావటం చూసి

"ఎస్! ఎవరు కావాలి?'' అనడిగింది తీయని కంఠంతో

"జోసెఫ్‌గారున్నారా?" అంది సవితా దేవి సంకోచిస్తూ.

"ప్లీస్ కమిన్" అంటూ లోపలికి దారి తీసింది ఆ అమ్మాయి.

"డాడీ! సమ్‌బడీ వాంట్సు టు సీ యూ"

"లోపల్నుంచి చేతికర్రతో తిన్నగా నడుచుకుంటూ హాల్లోకి వచ్చాడు జోసెఫ్.

మనిషి బాగా వంగిపోయి వున్నాడు. ముఖంలో ముడతలు. దగ్గరగా వచ్చి నొసలుకి చేయి ఆనించి కనులు విప్పార్చి చూశాడు.

"గుర్తున్నానా అంకుల్?" అంది సవితాదేవి అతని కళ్ళలోకి చూస్తూ.

"ఎక్స్‌క్యూజ్ దిస్ ఓల్డుమాన్, ఎవరో గుర్తుకి రావటం లేదు" అతని గొంతు జీరబోయినట్టుగా వుంది.

"బాగా చూడండి అంకుల్, మీ బేబీని మీరు అడాప్ట్ చేసుకోవాలనుకున్న, మీ స్వీట్ బేబీ సవితని అంకుల్" భావోద్వేగంతో ఆమె కంఠం వొణికింది. కళ్ళలో నీళ్ళు నిలిచినయ్.

ముడుతలు పడిన అతని ముఖం మెల్లగా వికసించింది.

"ఓ...మైడియర్ చైల్డ్! యూ హేవ్ కమ్ టు సీ దిస్ వోల్డుమాన్!" అంటూ ఆమెని కౌగలించుకుని నొసటిమీద ముద్దు పెట్టుకున్నాడు. ఆమె కూడా ముడుతలు పడిన అతని బుగ్గల్ని చుంబించింది.

"అంకుల్ ఆంటీ ఏదీ?" హాల్లోంచి

లోపలి గదిలోకి చూస్తూ అడిగింది.

"అదుగోమ్మా" అంటూ గోడవేపు చూపించాడు.

హాల్లో గోడకిపైన చెక్క స్టాండు. వెలిగే రెండు కొవ్వొత్తుల మధ్య చిరునవ్వుతో కిందకి చూస్తోంది ఫిలోమినా.

"నన్నొంటరి వాడిని చేసి వెళ్ళిపోయిందమ్మా. ఏడేళ్ళయింది సరిగ్గా. అదృష్టవంతురాలు. నాకన్న ముందే చేరుకుంది" అని కళ్ళు తుడుచుకున్నాడు.

మూడు గ్లాసుల్లో స్క్వాష్ కలిపి తెచ్చింది ఆ అమ్మాయి.

"మా అమ్మాయి మేరీ. పదిహేనేళ్ళ కిందట మా ఇంట్లో అడుగు పెట్టింది. ఈ స్వీటీని అడాప్ట్ చేసుకున్నాం"అంటూ ఆ అమ్మాయి తల నిమిరాడు అప్యాయంగా. విశ్వంకేసి పరికించి చూసి "మీ అబ్బాయా?" అనడిగాడు.

"కాదు" అంది సవితాదేవి నవ్వి.

"తమ్ముడా?"

అదీ కాదనట్టు తలూపి "మంచి మిత్రుడు" అంది.

వాళ్ళని ఒక పట్టాన వదల్లేదు జోసెఫ్. ఆ రాత్రికి అక్కడే వుండి భోంచేసి వెళ్ళమని బలవంతం చేశాడు. మేరీ పెళ్ళికి ఏకంగా డిన్నర్‌కే వస్తామని చెప్పిఅతన్ని వదిలించుకుని బయట పడేసరికి బ్రహ్మ ప్రళయమైంది. మెట్లు దిగుతోంటే ఓ 45 ఏళ్ళ ఆడ మనిషి రొప్పుకుంటూ రొజుకుంటూ ఎదురొచ్చింది.

"సవితా! నువ్విక్కడికొచ్చావని లజ్ కార్నర్ దగ్గర ఎవరో అనుకుంటూ వుంటే విని వెంటనే ఆటోలో వచ్చేశాను" అంటూ చేతులు పట్టుకున్న ఆమె కేసి తెల్లబోయి చూసింది సవితాదేవి.

"అప్పుడే మర్చిపోయావా? నేను... జయని. నువ్వు డాన్సు నేర్చుకుంటూ వుండే రోజుల్లోనే సినిమాల్లో చేరే అదృష్టం నీ ముఖంలో కనిపిస్తోంది అనుకునే దాన్ని. నీతో ఎప్పుడూ చెప్పలేదనుకో. మా ఇల్లిక్కడే మందవల్లి దగ్గర. రా వెళదాం" అని బలవంత పెట్టింది జయ.

ముగ్గురూ ఆటోలో మందవల్లి చేరుకున్నారు.

"ఇదే మా ఇల్లు. రండి" అంటూ ఒక చిన్న మిద్దె ఇంట్లోకి దారి తీసింది జయ. కొత్తగా కట్టినట్లుంది ఆ మేడ. కింది పోర్షన్‌లో రెండే కాపురాలు. జయ వున్న పోర్షన్ ముచ్చటగా, నీట్‌గా వుంది.

"వంద రూపాయలు బాడుగ. పదగదికి తలుపులున్నాయి లే"అని కొంటెగా నవ్వి సవితాదేవి కళ్ళలోకి చూసింది జయ.

ఒకనాటి సంఘటన గుర్తుకి తెచ్చుకుని ఇద్దరూ పకా పకా నవ్వుకున్నారు.

"నాకిప్పుడు ముగ్గురు పిల్లలు. ఇద్దరమ్మాయిలు, ఒక అబ్బాయి. ఇప్పుడే ట్యూషన్‌కి వెళ్ళారు. ఆయనకి నైట్ షిఫ్టు.

"నువ్వు సినిమాల్లో చేరిం తర్వాత ఎన్నోసార్లు నిన్ను చూడాలి అనుకునే దాన్ని సవితా. కాని మమ్మల్ని గుర్తు పడతావో లేదోనని భయం. అయితే నీ సినిమా వస్తే మాత్రం వదల్ను."

"ఒకసారి 'అన్నా చెల్లీ అనుబంధం' నూర్రోజులాడినప్పుడు మీరంతా థియేటర్‌కి వస్తున్నారని తెలిసి నిన్ను చూడవచ్చు గదా అని గంపెడాశతో వచ్చాను. కాని తీరా అక్కడి జనాన్ని, ఆ పోలీసు

లాఠీ దెబ్బల్ని చూసి భయపడి దూరా న్నించే తిరిగి వెళ్లిపోయాను" ... అని పట్టరాని సంతోషంతో మాట్లాడేస్తోంది జయ. విశ్వాన్ని ఆమెకి పరిచయం చేసింది సవితాదేవి. జోసెఫ్ దగ్గర్నుంచి తప్పించుకోగలిగిందే గాని, భోంచేయందే జయ విడిచి పెట్టలేదు. ఇద్దరికీ తానే స్వయంగా వడ్డించింది

"అప్పుడప్పుడూ వస్తూ వుండక్కా" అంది సాగనంపుతూ.

"మళ్ళీ ఇన్నాళ్ళకి పాత సవిత నయ్యాను కదా.తప్పకుండా వస్తానమ్మా" అని సెలవు తీసుకుంది సవితాదేవి.



పాతికేళ్ళ తర్వాత జనం మధ్యకు వెళ్ళి ఏ ఇబ్బందులూ లేకుండా తిరిగొచ్చి నందుకు ఒకవేపు సంతోషంగానే వున్నా మరొకవేపు ఏదో లోపించినట్టుగా వుంది సవితాదేవికి. తను బస్సులో వెళ్ళడాన్ని గురించి జనమంతా వింతగా చెప్పు కుంటా రనీ, వీధుల్లో ప్రజలు క్రిక్కిరిసిపోయి తను వెళ్ళడానికి వీల్లేకుండా చేసి ప్రశ్న లతో వేధిస్తారనీ, పత్రికలవాళ్ళు ఎకా ఎకీన ఫొటోగ్రాఫర్లతో దిగి ఫోటోలుతీసి 'ప్రజల మధ్య సవితా దేవి' అనే శీర్షిక లతో వార్తలు ప్రచురించేస్తారనీ లోలోపల ఆమె కోరుకోక పోలేదు. కాని తనూ హించిన విధంగా ఏమీ జరక్కపోవటంతో కొంత నిరుత్సాహపడిపోయింది. అయితే ఈ నిరుత్సాహాన్ని చెదరగొట్టే విధంగా ఆమె కలలోనైనా ఊహించని ఒక సంఘ టన జరిగింది.మద్రాసు నగరంలో చాలా పేరు పొందిన తెలుగు వారి సాంస్కృ తిక సంస్థ ఒకటి సవితాదేవిని ఘనంగా సన్మానించాలని తీర్మానించింది.అంగీకారం తెలుపమని కోరుతూ రాసిన ఉత్తరం, ఆహ్వాన పత్రిక రెండూ ఒకేసారి చేరాయి. సన్మానం రాజేశ్వరీ కళ్యాణ మండపంలో. ఆనందాశ్చర్యాలతో ఆమె శరీరం పులకించింది. ఆనందంతో నేత్రాలు చెమ్మగిల్లాయి.

"నేను ధన్యురాలిని విశ్వం. నిజమైన కళాభిమానులకు నేనింకా గుర్తున్నాను. నా కదే చాలు" అంది విశ్వంతో

ఆ సాయంత్రం రంగు రంగుల దీపా లతో, తోరణాలతో శోభాయమానంగా వెలిగిపోతూ వుంది రాజేశ్వరీ కళ్యాణ మండపం. కార్యక్రమానికి ముఖ్యమంత్రే ముఖ్య అతిథి కూడా కావడంతో బందో బస్తు పకడ్బందీగా వుంది. సాయంత్రం 5 గంటల నించే హాలు నిండిపోవటం ప్రారంభమైంది. పుర ప్రముఖులు మాజీ మంత్రులు, రచయితలు, పత్రికా విలే కర్లు, సినీ రంగానికి చెందిన అన్ని శాఖల్లోని టెక్నీషియన్లు, తారలు మొద లైన వాళ్ళతో హాలు కిట కి ట లా డి పోతోంది. సవితాదేవి నటించిన చిత్రా ల్లోని ముఖ్యమైన సన్నివేశాల్ని అందంగా చిత్రించిన రేఖా చిత్రాలు హాలు చుట్టూ సభికుల దృష్టిని ఆకట్టుకునేలా గోడలకి అమర్చబడివున్నాయి.

సరిగ్గా ఆరు గంటలకు సన్మాన కార్య క్రమం మొదలైంది. వేదిక నలంకరించిన వారందరూ అయిదు నిమిషాలకి మించ

కుండా సవితాదేవి నటనా కౌశలాన్ని గురించి ప్రశంసలు కురిపిస్తూ మాట్లాడేరు. సినీ ఆర్టిస్టుల అసోసియేషన్ తరఫున కాంతిశ్రీ సవితాదేవికి బంగారు గాజుల జతను బహూకరించింది. ఒక వర్ధమాన తార ఒంటిపేట గొలుసును సవితాదేవి కంఠానికి అలంకరించి పాదాభివందనం చేసింది. ఇంకా పట్టుచీరలు, రవికెలు, మొమెంటోలు...ఇలా రకరకాల బహుమతుల ప్రదానం జరిగింది. ఆ సంస్థ కార్యదర్శి సన్మాన పత్రం చదివాడు. వెండి పోతపోసిన రెండడుగుల సవితాదేవి ప్రతిమను పదేళ్ళ పాపచేత బహూకరించారు. సంస్థ సభ్యుల తరఫున నగదుగా పదివేల రొక్కం ఇవ్వబడింది.

వేదిక నలంకరించినవారిలో రాంప్రభు కోసం సభికుల కళ్ళు వెతుకుతున్నాయి. అతను కనిపించక పోవటంతో చాలా మంది గుసగుసలాడు కుంటున్నారు. అంతలో కార్యదర్శి వేదిక మీదికొచ్చి ఇలా ప్రకటించాడు

"రాంప్రభుగారికి కాశ్మీరులో చివరి షెడ్యూలు షూటింగు వున్నందున వారు మన కార్యక్రమానికి హాజరు కాలేక పోయారు. మహానటి సవితాదేవిగారిని ఆశీర్వదిస్తూ, అభినందిస్తూ వారు పంపిన టెలిగ్రాం ఇప్పుడే అందింది" అని అందులోని సందేశం చదివి వినిపించాడు.

"ఇప్పుడు మహానటి సవితాదేవిగారు మాట్లాడుతారు" అని ప్రకటించాడు.

రెండు నిమిషాల పాటు హాలంతా సభికుల కరతాళధ్వనులతో దద్దరిల్లింది.

సవితాదేవి లేచి నిలబడింది.

ఆనందాతిశయంతో ఆమె ఒళ్ళు జలదరించింది. సజల నయనాలతో, కంపించే అధరాలతో మాటలు మర్చిపోయి నిమిషంపాటు అలా మౌనంగా నిలబడి పోయింది. నాలుగు వేపుల్నించీ మెరుపుల్లా కెమేరాలు క్లిక్కుమన్నాయి.

"ఈ ప్రపంచం, సినిమా రంగం, ప్రేక్షకులు అంతా నన్ను మర్చిపోయారనీ, దూరంగా నెట్టి వేశారనీ, నాకు తీరని ద్రోహం చేశారనీ బాధపడ్డాను. భరింపరాని ఆవేదనలో నేను నా ప్రేక్షకులనీ, పరిశ్రమనీ శపించిన సందర్భాలు కూడా వున్నాయి. ఇప్పుడు క్షమాపణ కోరుకుంటున్నాను. క్షమించ గలరా?" అంటున్నప్పుడు ఆమె కంఠం వణికింది. చీమ చిటుక్కుమనే నిశ్శబ్దంతో వింటున్నారు సభికులు.

"ఈ అయోమయ, అంధకార స్థితిలో నా కళ్ళు తెరిపించాడు మావిశ్వం" అన్నప్పుడు ఆమె కళ్ళు సభలో నాలుగు వేపులా గాలించాయి.

"ఎవరా విశ్వం !?" అనుకుంటూ పక్కలకీ, వెనక్కీ తిరిగి తిరిగి చూసుకున్నారు ప్రేక్షకులు.

"ఒక తార నేల రాలి నశించిపోతే అందుకు ఏ ఒక వ్యక్తినిగాని, సంస్థనిగాని తప్పు పట్టి ప్రయోజనం లేదనీ, అడవిన్యాయం, ధనవ్యామోహం ప్రధాన లక్షణాలుగా కలిగిన ఈ వ్యవస్థలో వీటికి అతీతంగా వున్న వాళ్ళందరికీ ఈ పరిస్థితి తప్పదనీ నాకు తెలియ జెప్పినవాడు విశ్వం. ఇమేజ్ ఇమేజ్ అంటూ ప్రజలకు దూరంగా పారిపోవటంకన్నా వారికి సేవచేయ గలగటంలోని ఆత్మ సంతృప్తినీ, ఔన్నత్యాన్నీ నా అనుభవంలోకి తెచ్చినవాడు. ఈ వేదిక మీద నన్ను గురించి ప్రసంగించిన వారందరూ

నేనింకా నూరేళ్ళు బతకాలనీ, నటిగా సినిమా రంగానికి సేవచేస్తూ ఇతర నటీనటులకు మార్గదర్శిగా వుండాలనీ అన్నారు. వాళ్ళ ఆదరానికీ, అభిమానానికీ కృతజ్ఞతలు.

నేను సినిమా రంగంనుంచి విరమించుకున్నాను.

సభికులకూ, నన్ను గౌరవించి సత్కరించిన పెద్దలందరికీ హృదయపూర్వకమైన ధన్యవాదాలు. కృతజ్ఞతలు. నమస్తే" అని కూర్చుంది సవితాదేవి. సినిమా రంగంనుంచి విరమిస్తున్నాననే వార్తవిని అంతా నిర్ఘాంతపోయి ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు.

రాత్రి పదకొండు గంటలకి టాక్సీలో ఇంటికి తిరిగొచ్చారు సవితాదేవి, విశ్వం కుప్పుసామి.

"సినిమా రంగంనుంచి విరమిస్తున్నట్టు అంత మందిలో బహిరంగంగా ప్రకటిస్తారని నేను కూడా వూహించలేదు" అన్నాడు విశ్వం ఇంటికి తిరిగి వస్తూనే.

"సన్మానం చేస్తున్నారు అంటేనే ఇక ఆ వ్యక్తి ఆ రంగంలోంచి నిష్క్రమించే సమయం ఆసన్నమైంది- అనే కదా అర్థం. నీకు మాత్రం తెలీదా విశ్వం?" అంది సవితాదేవి బట్టలు మార్చుకోడానికి లోపలికి వెళుతూ.

"రేపు మీతో చాలా ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి" అన్నాడు విశ్వం మేను వాలుస్తూ.



"మీరు మళ్ళీ నటించాలి" అన్నాడు విశ్వం సవితాదేవి ముఖంలోకి సూటిగా చూస్తూ.

"బావుంది జోక్" నవ్వుతూ అంది.

సీరియస్‌గానే అంటున్నాను. మీరు మళ్ళీ నటించటం ప్రారంభించాలి"

"అదేమిటి విశ్వం! నిన్న సన్మాన సభలో బహిరంగంగా ప్రకటించిన తర్వాత కూడా...?"

"నటన అన్నది సినిమాలకి మాత్రమే పరిమితం కాదు సవితాదేవిగారూ. సినిమాలు రావటానికి ఎన్నో ఏళ్ళకి పూర్వమే పుట్టింది నాటకం"

"ఓ! మళ్ళీ డ్రామాల్లో వెయ్యమన్నా! అదీ అయిందిగా ప్రారంభంలోనే? చివరి సారిగా రెండేళ్ళ కిందట నేను నటించిన నాటకం ఒకే ఒక ప్రదర్శనతో ఫ్లాప్ అయిన సంగతి నీకు గుర్తులేదా విశ్వం?"

"గుర్తుంది. మన పరిచయం అయింది కూడా అక్కడే! కాని నేనిప్పుడు చెప్పబోయేది ఆ రకమైన నాటకాల గురించి కూడా కాదు. వీధిలో నాటకాలు, బుర్ర కథలు, జముకుల కథలు వీటి గురించి ఎప్పుడైనా విన్నారా?"

"నా చిన్నప్పుడు మా వూళ్ళో కొన్ని చూసి వున్నాను కూడా"

"జనానికి చేరువలో, అందుబాటులో వుండే అలాంటి ప్రజా కళల్ని తిరిగి

పునరుద్ధరించాలనే ప్రయత్నంలో వున్నాను. నాకు తోడుగా కొందరు మిత్రులు కూడా ఈ పథకానికి చేయూత నిస్తున్నారు"

"కలర్ సినిమాలూ టి. వి. లూ ప్రబలిపోయిన ఈ రోజుల్లో నువ్వు చెప్పే ఈ నాటకాల్ని ప్రజలు ఆదరిస్తారని నువ్వు నిజంగా నమ్ముతున్నావా ?"

"చాలా మంది మీలాగే పొరబడుతున్నారు సవితాదేవిగారూ. ఆధునికతతో బాటు ప్రాచీనత కూడా మన దేశంలో ఇంకా సహజీవనం కొనసాగిస్తూనే వుంది. బోయింగ్‌లూ, జెట్ విమానాలూ ఎన్ని వచ్చినా ఇంకా మన వీధుల్లో ఒంటెద్దు బండ్లు, చేతి రిక్షాలు అంతరించి పోలేదు. ఎటొచ్చీ ఈ ప్రాచీనతని, సంప్రదాయాన్ని మనం తగురీతిగా సమాజానికి ఉపయోగపడే విధంగా మలుచుకోలేక పోతున్నాం. ఇప్పటికీ చిన్న చిన్న వూళ్ళలో, గ్రామాల్లో వీధినాటకాలాడుతూనే వున్నారు. ప్రజలు వెళ్ళిచూస్తూనే వున్నారు. మనం వేయబోయేది ఉద్యోగ విజయాలు, కీచక వధలు, శ్రీ రామపట్టాభిషేకాలూ కాదు. వర్తమాన సమాజంలోని కుళ్ళునీ, అవినీతినీ, అన్యాయాల్నీ ప్రజలకి అర్థమయ్యేలా, ఆకట్టుకునే విధంగా ప్రదర్శించటం మన ధ్యేయం. ప్రజా జీవితం ఎలా వుండాలో, అందుకు ప్రజలేం చేయాలో మన నాటకాల ద్వారా, సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా సూచించటం కూడా మన లక్ష్యంలోని ఒక భాగం"

"ఇంతకీ మళ్ళీ వేషం కట్టి నాటకాల్లో నటించాలంటావు. కాని నాలో మీరు ఎదురు చూసే నటనా కౌశలం, ఆ సామర్థ్యం ఇంకా మిగిలి వుందంటావా ?"

"ఒక విషయం అడుగుతాను చెపుతారా ?"

"అడుగు" అంది సవితాదేవి విశ్వం కేసి ప్రశ్నార్థకంగా చూస్తూ.

"నటిగా మారకుండా వుంటే మీరేం చేస్తూ వుండే వారు ?"

పకా పక నవ్వింది సవితాదేవి.

"ఇంకా ఏదో అనుకున్నాను. ఆఖరికి పత్రికల వాళ్ళ ధోరణిలోకి దిగేసేవు" అంది నవ్వాపుకుంటూ.

"పోనీ అలాగే అనుకోండి చెప్పండి సినిమా రంగంలోకి ప్రవేశించకుండా వుండి వుంటే జీవితంలో ఏ రకంగా స్థిరపడి వుండేవారు ?"

"పత్రికల వారికైతే ఏ డాక్టర్నో, లాయర్నో అయివుండేదాన్నని సమాధానం ఇచ్చివుండేదాన్ని. నీతో మాత్రం నిజం చెపాను. నటిగా మారకుండా వుంటే స్తోమతువున్నదాకా చదివి ఆ తరువాత పెళ్ళాడేసి ఈపాటికి నలుగురు పిల్లల తల్లినై వుండేదాన్నేమో"

"అయితే మరి నటిగా ఎందుకైనట్టు?"

"నాన్న నిర్బంధం వల్ల"

"ఆ మధ్య మీరు హీరోయిన్‌గా నటించిన మీ మొదటి చిత్రం చూశాను. కేవలం వేరొకరి ప్రోద్బలం మీద నటించినట్టు ఎక్కడా అనిపించలేదు. అంత గొప్పగా నటించారు మొదటి చిత్రంలోనే. నటన అనేది మీకు సహజంగా అబ్బింది. లేకపోతే మీరు ఆ తరువాత చిత్రాల్లో కూడా అంత గొప్పగా నటించటం సాధ్యమై వుండేది కాదు. నటన మీ ప్రవృత్తిలో ఒక భాగం. అంతరాంతరాలలో ఏ మూలో నటించాలనే కోరిక, నటిగా రాణించాలనే తృష్ణ మీలో దాగి

వుంది. మీ తండ్రిగారి ప్రోద్బలం అందుకు కొంత దోహదంచేసి వుండొచ్చు. ఇప్పుడు చెప్పండి.సహజంగా అబ్బిన ఈ కళకి బూజు పట్టించాలనుకుంటున్నారా?"

"బూజు పట్టించేశారు కదా విశ్వం"

"ఎవరు?"

"ఇంకెవరు. నన్ను వెలివేసిన నిర్మాతలు"

"మళ్ళా మొదటి కొస్తున్నారు. నటన సినిమాకు మాత్రమే పరిమితం కాదని మళ్ళీ చెపుతున్నాను. సినిమాల్ని గురించి మర్చిపొండి..."

చీకటి పడిందన్న సంగతి కూడా గమనించకుండా మాట్లాడుకుంటున్నారు.

మెట్లమీద ఎవరో వస్తున్న అడుగుల సవ్వడి వినిపించింది.

"విశ్వం... విశ్వం..." అంటూ పిలుస్తున్నారు.

మాటల్లోంచి బయటపడి పరిసరాలలో గుర్తించిన విశ్వం పైకి లేచి లైటు వేశాడు.

అతనింతకు ముందే ఆహ్వానించివున్న మిత్రులు నిలబడి వున్నారు మెట్లమీద.

"ప్లీస్ కమిన్ !" అంటూ వాళ్ళని లోపలికి ఆహ్వానించాడు. సవితాదేవి లేచి వచ్చి అందరికీ సమస్కారం చేసింది. మంచాన్నీ, కుర్చీలనీ ఓ మూలకి నెట్టి నేలమీద దుప్పటి పరిచి అందరూ కూర్చున్నారు.

"నేను చెప్పానే మన సాంస్కృతిక సంస్థకి తోడ్పడే మిత్రులని..వీళ్ళే" అని పరిచయం చేశాడు విశ్వం. వాళ్ళలో కృష్ణమోహన్ కూడా వుండటం చూసి సంతోషంతో విస్తుపోయి "మీకూ ఎక్కించాడన్నమాట ఈ పిచ్చి" అని నవ్వింది సవితాదేవి.

"మంచి పనులన్నీ ప్రారంభంలో పిచ్చిగానే అనిపిస్తాయి సవితాదేవిగారూ. దయచేసి వేళాకోళంమాని సీరియస్‌గా ఆలోచించమని కోరుతున్నాను. ఇక్కడ మనం కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోవాలి."

"ఇంతకీ మన సంస్థకి పేరేమిటి?" తొమ్మిది మందిలో ఒక రడిగారు.

"పేరింకా నిర్ణయించలేదు. మన యూనిట్ లో అయిదారు మంది యూనివర్సిటీ విద్యార్థులు కూడా వున్నారు.



అందులో ముగ్గురమ్మాయిలు. ఇంకా మరి కొందరు చేరటానికి సుముఖంగా వున్నారు"

ఉత్సాహంగా అందరూ చప్పట్లు చరిచారు. అందరినీ పేరు పేరునా పరిచయం చేశాడు విశ్వం-అందరూ ఇరవై నుండి నలభై లోపు వయసున్న వారే.

టీలు తాగటం పూర్తయ్యాక ప్రారంభించాడు విశ్వం.

"మన కార్యక్రమాలకి వృత్తి. నాటకాల కయ్యేటంతటి ఖర్చు వుండదు. కొన్నాళ్ళదాకా నాటక శాలలతోటి మన కవసరం లేదు. మన తొలి ప్రదర్శన ఈ మద్రాసు నగరంలోనే ప్రారంభించుదాం. ఏ ప్లే గ్రౌండో, లేక ఫాక్టరీ ఆవరణో, వర్కర్ల కాలనీయో రంగస్థలంగా ఎంచుకుందాం. ఈ రకమైన ప్రదర్శన 'స్ట్రీట్ కార్నర్ థియేటర్' అనే పేరుతో కలకత్తాలోనూ, ఇప్పుడిప్పుడు కర్నాటక రాష్ట్రంలోనూ బాగా ప్రచారంలోకి వస్తోంది."

"వీధులూ,వాడలూ, విహార స్థలాలూ, సముద్ర తీరాలూ మన రంగ స్థలాలు. ఎవరి స్తోమతని బట్టి వారు నెలకి పదో, పాతికో చందా వేసుకుందాం. వీలైతే అభిమానుల దగ్గర్నుంచి కూడా చందాలు పోగుచేయవచ్చు. మొదటి రెండు మూడు ప్రదర్శనలకి అయ్యే ఖర్చుని నేనూ, కృష్ణమోహన్ భరిస్తాం...."

మధ్యలోనే అతన్ని అడ్డుకుని అన్నది సవితాదేవి

"ఏం విశ్వం! నా డబ్బు మీకు పనికి రాదా?"

"మేమేమీ వద్దనలేదే. వుంచండి అవసర మొచ్చినప్పుడు తప్పకుండా తీసుకుంటాం" అన్నాడు కృష్ణమోహన్ నవ్వుతూ.

"మన యూనిట్ లో సవితాదేవిపాత్ర ఏమిటో వివరించలేదు" అన్నాడు విజయకుమార్.

"ఇది మనందరి సంస్థ. ఇందులో అందరికీ వారి వారి సామర్థ్యాన్ని బట్టి సమానమైన బాధ్యతలుంటాయి. అందరూ వాళ్ళ వాళ్ళ శక్తిని, స్థోమతని బట్టి మన యూనిట్ కి అన్ని విధాలా సహకరించాల్సి వుంటుంది. ఇంకా ఎవరికైనా సందేహాలు గాని, మన కార్యక్రమాలకి సంబంధించిన అభిప్రాయాలుగాని, సలహాలు గాని వుంటే నిస్సంకోచంగా వ్యక్తం చేయండి" అని అందరివేపూ ఒకసారి చూశాడు విశ్వం.

ఒక్కొక్కరుగా తమ అభిప్రాయాలు వెల్లడిస్తున్నారు. వాళ్ళ ముఖాల్లో నూతనోత్సాహం...మాటల్లో ఆత్మ విశ్వాసం, హృదయాల్లో వురకలువేసే చైతన్యం. అలా ఆ రాత్రంతా వాళ్ళు తమ కార్యక్రమాల్ని గురించి చర్చిస్తూ, వాదిస్తూ భవిష్యత్తులో వాడ వాడలా' వూరూరా వూడలు వేసి విస్తరించే సరికొత్త కళా రూపాలను గురించి, ఉద్యమాలను గురించి కలలు కంటూ మాట్లాడుకుంటూనే వున్నారు.

తూరుపు తెల తెలవారుతోంది. కిటికీ లోంచి గదిలోకి చొచ్చుకువచ్చే లేత కిరణాల వేపు కొత్త ఉత్సాహంతో చూసింది సవితాదేవి.

ఆ లేత నెలుగు వాళ్ళ కంటి పాపల్లో ప్రతిఫలించి భవిష్యత్తు మీద కొత్త ఆశా జ్యోతుల్ని వెలిగిస్తోన్నట్టుగా వుంది

ఎంజెలా ఎంత అందమైనదో అంత చురుకైనది. రష్యా కె. జి. బి. సంస్థలో సమర్థురాలైన గూఢచారిణిగా ప్రఖ్యాతి గాంచింది. ఎంజెలా ఇటలీ, గ్రీస్, సైప్రస్ సోమాలీలాండ్, మొరాకో, స్పెయిన్, పోర్చుగల్, స్విట్జర్లాండ్, స్కాండినేవియా, ఇంగ్లాండ్, టర్కీ మొదలగు అనేక దేశాలలో చురుకుగా గూఢచారి చర్యలు సాగించి, ఎందరో కొమ్ములు తిరిగిన గూఢచారులను సైతం బోల్తా కొట్టించింది. బోల్తా కొట్టించడంలో చివరకు ఆమె తన భర్తను కూడ వదిలిపెట్టలేదు. ఎంజెలా తన భర్తకంటే 14 సంవత్సరాలు పెద్దది. కాని అతడెప్పుడూ తన భార్య తనకంటె ఒక సంవత్సరం చిన్నది అనే భ్రమలోనే ఉండేవాడు.

# ఐదుగురు గూఢచారులు

1954 లో ఎంజెలాను ఇటలీలో గూఢచారి చర్యలకోసం పంపించారు. ఎంజెలా ఇటలీ చేరిన తక్షణమే అతివేగంగా తన కార్యక్రమంలో లీనమైంది. అద్భుతమైన రహస్యమైన నాటో వార్తల్ని మాస్కోకు పంపసాగింది. ఆమె కార్య కుశలతకు రష్యా అధికారులు విస్తుపోసాగారు.

ఎంజెలా సాధించే విజయాలలో ఆమె భర్త రినాల్డి సహకారం ఎంతో ఉండేది. అతడే తన భార్యకు ప్రధాన ఏజంట్. రినాల్డి ఇటలీలోని వైమానిక శాఖలో ప్యారాచూటర్లకు శిక్షణ ఇచ్చే ఉద్యోగి. అయితే అతడు విమానాశ్రయాలలో ప్యారచూటర్లకు శిక్షణ ఇచ్చేందుకు వెళ్ళినప్పుడల్లా దొంగచాటుగా అక్కడి ఫొటోల్ని లాగి ఎంజెలా కిచ్చేవాడు.

ఎంజెలా సాధిస్తున్న విజయాలకు మరింత ఉత్సాహంతో గ్రీస్, సైప్రస్ మొదలగు దేశాలలో కూడా తన గూఢచారి కార్యక్రమాల్ని విస్తృతం చేసింది. ఆమె ఏజంట్ల సంఖ్య క్రమక్రమంగా పెరగసాగింది.

ఎంజెలా మైక్రో డాట్ సందేశాల్ని పోస్టల్ స్టాంపుల వెనుక దాచి పంపేది లేదా సంకేత లిపిలో వ్రాసి మరో దేశం ఏజంటు ద్వారా మాస్కో కె. జి. బి. ప్రధాన కార్యాలయానికి పంపించేది.

ఎంజెలా శిక్షణపొందిన సమర్థురాలైన గూఢచారిణి. కాని ఆమె భర్త రినాల్డి ఎలాంటి శిక్షణ పొందలేదు. అందువల్ల కె. జి. బి అధికారులు రినాల్డిని రహస్యంగా రష్యా రప్పించి గూఢచారిత్వంలో శిక్షణ ఇవ్వాలని నిర్ణయించారు. వెంటనే అతడు రష్యాకు వచ్చే ఏర్పాట్లు చేశారు.

1956లో రినాల్డి మాస్కో చేరుకున్నాడు. అతని పాస్‌పోర్టులో అతడు రష్యాకు వెళ్ళుతున్నట్లు లేదు. అతడు మొదట పారిస్ వెళ్ళి, అక్కడి నుండి మాస్కో చేరుకున్నాడు. అక్కడ శిక్షణ పూర్తి అయిన తరువాత కూడ పూర్వంవలెనే మాస్కో నుండి పారిస్ వచ్చి,అచ్చటి నుండి ఇటలీ చేరుకున్నాడు.

ఆ సమయాన ఇటలీ పోలీసులకు రినాల్డిపై ఎలాంటి సందేహం గలుగలేదు. కాని కొన్ని రోజుల తరువాత రినాల్డి ఒక రష్యా సైనికాధికారితో స్నేహం చేసినప్పుడు ఇటలీ పోలీసులకు అతడిపై సందేహం కలిగింది. పోలీసులు అతని గతి విధుల్ని రహస్యంగా గమనించారు. చివరకు వారిద్దరి స్నేహంలో అనుమానానికి ఆస్కారం లేదని భావించారు.

ఈ విధంగా ఎంజెలా, ఆమె భర్త రినాల్డిలు సుమారు 7 సంవత్సరాలు నిర్విఘ్నంగా తమ గూఢచారి చర్యల్ని సాగించారు.

1960లో పోలీసులకు మరోసారి వారిద్దరిపై అనుమానం కలిగింది. అసలు విషయమేమిటంటే ఎంజెలా ఏ దుకాణాన్ని అడ్డుపెట్టుకొని గూఢచారి కేంద్రంగా నడుపుతోందో, ఆ దుకాణం ఏమాత్రం నడవటంలేదు. అయినా ఎంజెలా, రినాల్డిలు అతి ఆడంబరంగా ఖరీదైన జీవితం గడుపుతున్నారు.

ఈసారి ఇటలీ గూఢచారులకు రినాల్డి 1956లో రహస్యంగా రష్యా యాత్ర చేశాడని తెలిసింది. దానితో ఇటలీ గూఢచారులు అతి రహస్యంగా వారి గతి విధుల్ని గమనించసాగారు.

1967లో స్టాలిన్ కూతురు స్వెత్లానా రష్యా నుండి పారిపోయి భారతదేశం

వచ్చింది. అక్కడి నుండి రోమ్ చేరుకుంది. ఈవార్త తెలిసిన మాస్కో అధికారులు పంపిన "వెంటనే ఈ ప్రమాదకరమైన దేశద్రోహి ఎక్కడుందో కనిపెట్టి తక్షణమే అపహరించండి" అనే రేడియో సందేశం ఎంజెలాకూ చేరింది.

స్వెత్లానా రోమ్ నుండి స్విట్జర్లాండ్‌కు వెళ్ళటానికి సిద్ధపడసాగింది. ఈ సంగతి తెలిసిన రినాల్డి, ఎంజెలాలతో పాటు మరొక అనుచరుడు కలిసి వేటకుక్కల్లా స్వెత్లానాను అన్వేషించడంలో నిమగ్నులయ్యారు. స్వెత్లానా అన్వేషణలో వారి అనుచరుడు ఇటలీ-స్విట్జర్లాండ్ సరిహద్దును అధిగమిస్తుండగా అకస్మాత్తుగా ఇటలీపోలీసులు అతనిపైపడి అరెస్టు చేశారు. అతణ్ణి సోదా చేయగా కొన్ని మైక్రోఫిల్ములు లభించాయి. వాటితో అతడొక గూఢచారి అని ప్రత్యక్ష సాక్ష్యం లభించింది. ఆ తరువాత అతడిచ్చిన సమాచారంతో ఎంజెలా, రినాల్డిలను కూడ అరెస్టు చేయగలిగారు. వారిద్దరిని సోదా చేయగా నాటో విమానాశ్రయాల మైక్రోఫిల్ములు, రహస్య సంకేత పుస్తకాలు, ఒక శక్తివంతమైన రేడియో ట్రాన్స్‌మీటర్ లభించాయి.

రినాల్డి పోలీసులు పెట్టిన యాతనల్ని భరించలేకపోయాడు. ఎన్నో రహస్య కేంద్రాల చిరునామాల్ని తెలియచేశాడు. పోలీసులు ఆ రహస్య కేంద్రాలపై చాటుగా కాపువేసి మరో గూఢచారిని పట్టుకున్నారు.

1967 మార్చి 20వ రాత్రి రష్యా రాయబార కార్యాలయానికి చెందిన ఒక నల్లకారు ఎంజెలా రహస్యకేంద్రం ముందు వచ్చి ఆగింది. ఆ కారులోనుండి రోమ్‌లోని రష్యా రాయబార కార్యాలయం ఉద్యోగి అయిన యూరీ పావ్‌లెంకో దిగాడు. మెల్లిగా జేబులో చేతులుపెట్టి ఒక మైక్రో



ఫిల్మ్ రోల్ తీశాడు. అంతే! అంతకు ముందే పొంచిఉన్న పోలీసులు ఆకలిగొన్న తోడేళ్ళలా అతనిపై విరుచుకు పడ్డారు. యూరీ వెంట కారులో అతని భార్యా పిల్లలుకూడ ఉన్నారు. అతడొక రాజకీయ వ్యక్తి కావటంవల్ల ఇటలీ పోలీసులు అతణ్ణి అరెస్టు చేయలేకపోయారు. అందువల్ల అతడొక అవాంఛనీయ వ్యక్తిగా ప్రకటించి తక్షణమే దేశం వదిలి పొమ్మని ఆజ్ఞల్ని జారీ చేశారు.

న్యాయస్థానం ఎంజెలా, రినాల్డి లతో పాటు ఇతర అనుచరులకు అతి దీర్ఘ శిక్షల్ని విధించింది.

# 'అసహాయ అబల'

గూఢచారుల జీవితం అడుగడుగునా ఆపదల మయమే. వారికి ఎప్పుడు ఏం ప్రమాదం ముంచుకొస్తుందో తెలియదు. అయినా వారు జడవరు. స్కాండినేవియాకు చెందిన గ్రీశా అనే గూఢచారిణికి ఆపదలతో ఆడుకోవటం తెలుసు.

గ్రీశా తాను స్వీడన్‌కు చెందినదాన్నని అందరితో చెప్పేది. అచ్చమైన డేనిష్ భాష మాట్లాడేది. ఆమె డేనిష్ భర్త ఆవిడను కోపెన్‌హాగన్ తీసికొని వచ్చాడు. వారి జీవితం కొన్నాళ్ళు హాయిగా ఏపొరపొచ్చాలు లేకుండా గడిచిపోయింది. ఆ తరువాత ఆమె భర్త మరో స్త్రీతో సంబంధం ఏర్పరచుకున్నాడు.

నిజానికి గ్రీశాది డెన్మార్కు గానీ, స్వీడన్‌గానీ కాదు. ఆమెది రష్యా. ఆమె అసలు పేరు వెలెంతీనాని కోలాయేత్నా మాలినోవస్కా. ఆమె తండ్రి లెనిన్ గ్రాడ్‌లో పార్టీ కార్యకర్త. రష్యా ప్రభుత్వం వెలెంతీనా అందం, తెలివిని గమనించి కె.జి.బి. సంస్థలో గూఢచారిణిగా శిక్షణ ఇప్పించింది. 1944లో వెలెంతేనా శిక్షణ పూర్తయింది. స్వీడిష్ పౌరసత్వం యిప్పించి గ్రీశాగా పేరు మార్చేసింది.

గ్రీశా గూఢచారి కార్యకలాపాలు నిర్వహించటానికి స్వీడన్‌లో అడుగు పెట్టింది. స్వీడన్‌లో ఒక నెల రోజులు రహస్యంగా ఉండి అక్కడి వేష భాషల్ని అర్థం చేసుకొని ఆ వాతావరణంలో ఇమడటానికి అలవాటు పడ్డది. ఆ తరువాత ముందే నిర్ణయించిన పథకం ప్రకారం వివాహం చేసుకుంది. ఆమె భర్త కొంత కాలం తరువాత ముందే నిర్ణయించిన పథకం ప్రకారం భార్యను వదిలి పెట్టి మాయమయ్యాడు.

ఇప్పుడు గ్రీశా ఒక 'అసహాయ అబల' అయింది. కాని ఆమె పొంగి పొరలే యవ్వనం, కోరికల్ని రెచ్చగొట్టే సౌందర్యం ఇతరుల్ని చేతులు కట్టుకుని కూర్చోనివ్వలేదు. ఆమెకు సహాయం చేయటానికి చాలా మంది ముందుకొచ్చారు. గ్రీశా వారి సహాయాన్ని కాదనలేదు. వారి ఆర్థిక సహాయంతో నగరానికి నడిబొడ్డున ఒక ఆధునికమైన గిఫ్ట్‌షాప్ తెరిచింది. కొందరు కుబేరుల్ని తన ప్రేమ పాశంలో బంధించి వారి దగ్గర పెద్ద మొత్తంలో డబ్బును లాగసాగింది.

కుబేరుల దయవల్ల ఆమె వ్యాపారం జోరుగా సాగుతోంది. ఇక గ్రీశా తన గూఢచారి కార్యకలాపాల్ని చురుకుగా నిర్వహించ సాగింది. కె.జి.బి. గూఢచారి సంస్థ గ్రీశాకు సహకారం అందించే వారి చిరునామాల్ని తెలియజేసింది.

గ్రీశా వెంటనే వారిని ఏజంట్లుగా నియమించింది. ఆ తరువాత నాటోకు సంబంధించిన అత్యంత రహస్యమైన మైక్రోఫిల్ములను, మైక్రోడాట్లను, సాంకేతిక లిపిలో వ్రాసిన దస్తావేజులను మాస్కోకు పంపసాగింది. గ్రీశా తన ఏజంట్లను ఎప్పుడూ స్వయంగా కలుసుకునేది కాదు. ఏజంట్లు గ్రీశా కోసం 'సమాచారాల్ని' రహస్య కార్యాలయాలలో పెట్టివచ్చేస్తే. అవి గ్రీశాకు చేరేవి. పరస్పరం సంబంధాలు స్థాపించుకోవడానికి గ్రీశా ఒక సులభమైన పద్ధతిని కనిపెట్టింది. పత్రికల్లో వ్యక్తిగత ప్రకటనల్ని ఇచ్చేది. మచ్చుకు ఆ ప్రకటనలు ఈ విధంగా ఉండేవి. 'నా ప్రియా! నీవెక్కడున్నా సరే వెంటనే బయలు దేరిరా! నీవు లేకుండా ఒక్క క్షణం కూడా ఉండలేను' – లిలీ. దీని అర్థమేమిటంటే రెండవ సంఖ్య గల కార్యాలయంలో కావలసిన సమాచార సామగ్రి ఉంది వెంటనే తెప్పించుకో అని.

అత్యవసర సందర్భాల్లో మాత్రమే

గ్రీశా టెలిఫోన్‌ను ఉపయోగించేది. అయితే ఆమె మాస్కోనుండి తెచ్చుకున్న ఒక ప్రత్యేకమైన యంత్రాన్ని తన ఫోన్‌లో అమర్చింది. ఆ యంత్రం ప్రత్యేకత ఏమిటంటే ఆమె ఫోన్‌లో ఎవరితో మాట్లాడుతుందో ఏ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ కనిపెట్టలేదు. గ్రీశా తన షాప్‌లో గూఢచార కార్యకలాపాలకు సంబంధించిన ఉపకరణాల్ని గిఫ్ట్ సామాన్లలో కలిపి ఉంచేది. దీనివల్ల ఎవరికీ ఏ విధమైన అనుమానం కలిగేది కాదు.

గ్రీశా ఈ విధంగా చాలా సంవత్సరాల వరకు నిరాటకంగా రష్యాకు సమాచారాల్ని పంపింది. నాటోక్తు సంబంధించిన సైనికశక్తి తెలిపే పత్రాల్ని పంపడంలో కూడా సఫలీ కృతురాలైంది. అంతా సవ్యంగానే జరిగిపోయింది. కాని ఒక రోజు అకస్మాత్తుగా గ్రీశా ఉన్నట్లుండి మాయంకావలసిన పరిస్థితి ఏర్పడింది. జరిగిందేమిటంటే కె. జి. బి. గూఢచారి సంస్థలోని ఒక ఉన్నతాధికారి రష్యా నుండి పరారయ్యాడు. అతడు తన వెంట రష్యాకోసం విదేశాల్లో పనిచేసే గూఢచారుల చిరునామాల్ని కూడ తీసికొని ఉడాయించాడు. ఆ అధికారి పారిపోయాడని తెలియగానే వివిధ దేశాల్లో ఉన్న తమ గూఢచారులను వెంటనే స్వదేశానికి రమ్మనమని కె.జి.బి. ఆదేశాల్ని పంపింది. గ్రీశా కూడ చకచకా అన్నీ సర్దుకుని అదృశ్యమై మాస్కోలో ప్రత్యక్షమైంది.

# నెపోలియన్ బంటు

శూల్ మాయి స్టర్ గూఢచారి జీవితం చాలా మామూలుగా మొదలైంది. అతడు ఉంగర్ అనే అమ్మాయిని



వివాహం చేసుకొని జర్మనీ, ఫ్రాన్స్ సరిహద్దుల్లో ఒక దుకాణం తెరిచాడు. దుకాణంతో పాటు మత్తు పదార్థాల స్మగ్లింగ్ కూడా నిరాటంకంగా కొనసాగించే వాడు. అతని స్వదేశం జర్మనీ.

1799లో శూల్ మాయి స్టర్‌కు కర్నల్ సావారి అనే వ్యక్తితో పరిచయమైంది. ఆ పరిచయమే స్నేహంగా మారింది. 1804లో కర్నల్ సావారి నెపోలియన్ మంత్రివర్గంలో పోలీసు మంత్రిగా అత్యున్నత స్థానాన్ని సంపాదించాడు. సావారి అవకాశం చూసి తన పాత మిత్రుడైన శూల్ మాయి స్టర్‌కు గూఢచారి విభాగంలో స్థానాన్ని కల్పించాడు. గూఢచారి విభాగంలో చేరిన మొదటి రోజే బుర్బాన్ రాజకుమారుణ్ణి మాయోపాయంతో ఫ్రాన్స్ భూభాగంలోనికి తీసుకువచ్చే బాధ్యత అప్పగించాడు. బుర్బాన్ రాజకుమారుని పేరు ఇంగేహాయిన్. అనేక ఇతర రాజకుమారులవలెనే అతడు కూడా నెపోలియన్‌కు భయపడి జర్మనీలోని బోడెన్ పట్టణంలో



ప్రశాంతమైన జీవితాన్ని గడుపుతున్నాడు. అతడికి రాజకీయాల్లో ఆసక్తి లేదు. ఒక్క బుర్బాన్ రాజకుమారుణ్ణి హతమార్చేస్తే, మిగిలిన తిరుగుబాటు చేయ సంకల్పించే రాజపరివారాలు కుక్కిన పేనుల్లాగా ఉంటాయని నెపోలియన్ కుతంత్రం.

ఇంగేహాయిన్ స్ట్రాస్‌బర్గ్‌లో నివసించే ఒక అమ్మాయిని పిచ్చిగా ప్రేమించాడు. అతడు తరచుగా ఆ అమ్మాయిని కలుసుకోవడానికి స్ట్రాస్‌బర్గ్ వస్తాడని శూల్ మాయిస్టర్ తెలుసుకున్నాడు. వెంటనే ఆ అమ్మాయిని బలవంతంగా ఎత్తుకొని వచ్చి బెల్‌ఫోర్ట్‌లోని ఒక ఇంట్లో బంధించి ఆ అమ్మాయితో బలవంతంగా "తనను వచ్చి రక్షించమని" ఉత్తరం వ్రాయించి ఇంగేహాయిన్‌కు పంపాడు. పాపం, ఇంగేహాయిన్ ఆలోచన లేకుండా సరాసరి బెల్‌ఫోర్టు చేరుకున్నాడు. బెల్‌ఫోర్ట్ జర్మనీ, ఫ్రాన్స్ సరిహద్దుల్లో ఉంది. ఇంగేహాయిన్ ఫ్రాన్స్ భూభాగంలో అడుగు పెట్టగానే పోలీసులు బంధించారు. ఆ తరువాత బుర్బాన్ రాజకుమారుడు ఇంగేహాయిన్ చట్ట విరుద్ధంగా ఫ్రాన్స్ భూభాగంలో ప్రవేశించాడని ఆరోపిస్తూ కాల్చిపారేశారు.

నెపోలియన్ 1805లో ఆస్ట్రియా, రష్యాలపై దాడి ప్రారంభించాడు. ఆ సమయంలో శూల్ మాయిస్టర్ గూఢచారిగా తన ప్రతిభా విశేషాల్ని అసమానంగా ప్రదర్శించాడు. 1805లో ఆస్ట్రియా ప్రజల ఆశలకు, ఆశయాలకు ప్రతీక మార్షల్ మైక్. నిజానికి మైక్‌లో ఏమాత్రం యుద్ధ కౌశల్యం లేదు. శూల్ మాయిస్టర్ వియన్నా చేరుకొని "తాను హంగరీలోని రాజవంశానికి చెందినవాడినని, ఫ్రాన్స్‌లో ఉండేవాడినని, అయితే అక్కడి అధికారులు తన్ను ఆస్ట్రియా గూఢచారిగా భావించి, ఆ దేశం నుండి బహిష్కరించారని" అందరితో చెప్పుకోసాగాడు. వియన్నా చేరుకోక ముందే మార్షల్ మైక్‌కు "ఫ్రాన్స్ ప్రజలపై తనకు విపరీతమైన ద్వేషమని, ఆ ప్రజలపై పగ తీర్చుకోవాలనుందని" లేఖ రాశాడు.

మార్షల్ మైక్‌కు శూల్ మాయిస్టర్‌ను కలుసుకున్న తరువాత చాలా సంతోషమైంది. ఎందుకంటే ఫ్రాన్స్ సైన్య వివరాలను గూర్చి శూల్ మాయిస్టర్‌కు బాగా తెలుసు. వెంటనే మైక్ వియన్నాలోని



పెద్ద పెద్ద సైనిక క్లబ్బుల్ని శూల్ మాయిస్తర్‌కు పరిచయం చేయించాడు. అతడికోసం సైనిక పదవిని కేటాయించి గూఢచారి విభాగంలో ప్రముఖుడుగా అన్ని బాధ్యతల్నీ అప్పగించాడు.

శూల్ మాయిస్తర్ ఒక క్షణం కూడా వృధా చెయ్యకుండా ప్రతి చిన్న రహస్యాన్ని నెపోలియన్‌కు చేరవేయసాగాడు. మరోవైపు ఆస్ట్రియా ప్రభుత్వ ఖజానానుండి పెద్ద మొత్తంలో డబ్బును లాగసాగాడు. బ్రహ్మాండమైన విందులను ఏర్పాటుచేసి ఉన్నతాధికారుల స్నేహం సంపాదించేవాడు. ఈ విధంగా వెంచ్, రుల్‌స్కే అనే ఇద్దరు అధికారులను తన వలలో వేసుకున్నాడు. వారిద్దరూ ఆస్ట్రియా సైన్యంలో ఉన్నతాధికారులు. వారిద్దరు శూల్ మాయిస్తర్ ఇచ్చే తప్పుడు సమాచారాలన్నింటినీ మైక్‌ముందు యదార్థమని నమ్మించేవారు. ఫ్రాన్స్‌నుండి సైన్యం అసంతృప్తి, ప్రజల తిరుగుబాటు గూర్చి, నెపోలియన్ ఇలాంటి గడ్డు పరిస్థితుల్లో ఇతర దేశాలపై దాడి చేయలేడని ఉత్తరాలు వచ్చేవి. ఉత్తరాల క్రింద ఫ్రాన్స్ సైన్యంలోని ఉన్నతాధికారుల సంతకాలుండేవి. నెపోలియన్ కేవలం శూల్ మాయిస్తర్ కోసమే ఒక నకిలీ దినపత్రికను అచ్చువేయించి పంపేవాడు. ఆ పత్రికలోని వార్తలన్నీ ఫ్రాన్స్‌లోని అంతర్యుద్ధానికి సంబంధించినవే!

శూల్ మాయిస్తర్ ఫ్రాన్స్ అంతర్యుద్ధంతో సతమతమవుతోందని, అందువల్లనే నెపోలియన్ తన సైన్యాన్ని రైన్ నుండి వెనక్కి రమ్మని కబురు పంపించాడని మైక్‌కు తెలియచేశాడు. అంతే! మైక్ తన 30 వేల సైన్యాన్ని రైన్‌లో ఉన్న సైన్యంపై దాడి చేయమని ఆదేశించాడు. కాని మైక్ ఊహకు విరుద్ధంగా రైన్ సైన్యం ముందుకు సాగి మూడు రోజుల తరువాత 20 అక్టోబర్‌న ఆస్ట్రియాను ఆక్రమించుకొంది. ఆ తరువాత కొన్ని రోజులకు ఆ ఉస్తర్‌లిట్జ్ నగరాన్ని కూడా వశపర్చుకున్నారు. ఫ్రాన్స్ రెండవ విజయం తరువాత వియన్నా అధికారులకు శూల్ మాయిస్తర్‌పై అనుమానం కలిగింది. ఆ తరువాత అతణ్ణి అరెస్టు కూడా చేశారు.

కాని ఇంతలో ఫ్రాన్స్ సైన్యం వియన్నాను ఆక్రమించి తమ గూఢచారిని సగౌరవంగా విడుదల చేయించింది.

తనకు జరిగిన పరాభవాన్ని దిగమింగి తిరిగి తన పాత జీవితాన్నే ఆరంభించాడు.

కాని ఆస్ట్రియా ప్రజల రక్తం ఇంకా షూల్ మాయిస్టర్ దుష్కర్మలతో ఉడికిపోతూనే ఉంది. 1814లో లీప్ జింగ్‌లో నెపోలియన్ సైన్యం పరాజయం పొందింది. కొన్ని రోజుల తరువాత షూల్‌మాయిస్తర్‌ను బంధించారు. విడుదల కావడానికి తన గూఢచారి జీవితంలో సంపాదించిన లక్షలకొద్దీ డబ్బును నీళ్ళ లా ఖర్చు చేశాడు. చివరకు విడుదల అయినాడు. స్ట్రాస్‌బర్గ్‌లో ఒక పొగాకు దుకాణం తెరిచి శేష జీవితమంతా పేదరికంలోనే గడిపాడు.

# బలిదానం

రెండవ ప్రపంచయుద్ధ వాతావరణం నెలకొంటున్న రోజులు. జర్మనీ నియంత హిట్లర్ శక్తివంతమైన నాజీ సైన్యం ప్రపంచాన్నంతటినీ కబళించాలని కలలు గంటోంది. జర్మనీ పొరుగు దేశాలు హిట్లర్ సైనికశక్తికి భయపడుతున్నాయి. ఒకవైపు రష్యాలో స్టాలిన్ సైనిక శక్తిని అభివృద్ధి చేస్తున్నాడు. మరోవైపు జర్మనీతో మిత్రత్వానికి సంధి వార్తల్ని నడిపిస్తున్నాడు.

రష్యా ఒకవైపు జర్మనీతో సంధి వ్యవహారాలు ప్రారంభించినా, నాజీల వివరాలు తెలుసుకోవటానికి శాయశక్తులా ప్రయత్నాలు సాగిస్తూనే ఉంది. హిట్లర్ గూఢచారి విభాగం 'గెస్టాపో' ప్రధానాధికారి ఎడ్మిరల్ కనారిస్. ఎడ్మిరల్ కనారిస్ ఎంతటి క్రూరుడో అంతటి ప్రతిభాశక్తి గలవాడు. గెస్టాపో గూఢచారి విభాగం ఉక్కుతో నిర్మించిన అభేద్యమైన కోట లాంటిది. ఈ కోటలోని ఒక్కొక్క భాగం అత్యంత సమర్థులైన వారి ఆధ్వర్యంలో ఉంది. వీరంతా నియంత హిట్లర్ సన్నిహితులు, మిత్రులు. అయితే ఇలాంటి అభేద్యమైన ఉక్కుకోట ఛేదించి నాజీ గూఢచారి విభాగం పని గురించి ఎప్పటికప్పుడు తెలుసుకొని అసాధ్యాన్ని సాధ్యంగా మార్చి చూపిన ఘనత స్టాలిన్ గూఢచారి విభాగానికి దక్కింది.

హిట్లర్ నాజీ సైన్యం ఒక దేశం తరువాత మరొక దేశాన్ని ఆక్రమిస్తూ ముందుకు సాగి చివరకు మాస్కో వైపు కదిలాయి. రష్యా గూఢచారులు ఎప్పటికప్పుడు నాజీ సైన్యాల కదలికల్ని రష్యాకు చేరవేస్తూనే ఉన్నారు.

ఎడ్మిరల్ కనారిస్ విదేశీ గూఢచారులు తమ యుద్ధ రహస్యాల్ని కనుగొంటున్నారని గ్రహించాడు. మరుక్షణం వేలమంది గూఢచారులు జర్మనీ మారుమూలల్లో కూడా విదేశీ గూఢచారుల కోసం గాలించ సాగారు.

నాజీ సైన్యం క్రాంజ్ అనేచోట ఒక రహస్య స్థావరాన్ని నెలకొల్పి శక్తివంతమైన రేడియో కేంద్రాన్ని స్థాపించింది. ఈ కేంద్రం నాజీలు తమ సందేశాల్ని ప్రసారం చేసుకోవటానికే కాక విదేశీ గూఢచారులు తమ తమ దేశాలకు పంపే సందేశాల్ని కనుగొనటానికి కూడ ఉపయోగ పడుతుంది.

నాజీలు తూర్పుదిశగా దాడులు ప్రారంభించిన నాలుగవ రోజు క్రాంజ్ రేడియో కేంద్రం యంత్రాలనుండి అకస్మాత్తుగా టక టకమనే శబ్దాలు రాసాగాయి. ఆ

టక టక శబ్దాలు రష్యాకు ప్రసారం చేయబడుతున్న సాంకేతిక సందేశం. ఆపరేటర్ తక్షణమే ఆ సందేశాన్ని గూఢ చార సాంకేతిక విశేషజ్ఞులకు పంపాడు. కాని వారెంత తలబాదుకున్నా ఆ సందేశం అర్థాన్ని తెలుసుకోలేక పోయారు.

రోజు రోజుకూ సందేశాల సంఖ్య పెరగ సాగింది. ఆ సందేశాలను నోట్ చేయాలంటే ఒక్క ఆపరేటర్‌కు సాధ్య పడటం లేదు. వరుసగా ఆరుగురు ఆప రేటర్లను నియమించవలసి వచ్చింది. ఆపరేటర్లు కొన్ని రోజులకు ఈ సందేశా లన్నీ కేవలం ఐదు సంఖ్యల్లో మాత్రమే ఉంటున్నాయని గ్రహించగలిగారు.

చివరకు నాజీలు రేడియో తరంగాల ద్వారా ఆకాశాన్నంతటినీ గాలించి కొన్ని అత్యద్భుతమైన విషయాల్ని కను గొన్నారు. ఈ సందేశాలు కేవలం జర్మనీ రాజధాని బెర్లిన్ నుండేకాక బ్రస్సెల్స్, పారిస్, జ్యూరిక్ మొదలగు ప్రముఖ నగరాల్నుండి కూడా వస్తున్నాయి. అన్నిటి కంటే ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే – ఈ సందేశాలన్నీ సోవి యట్ రష్యా రాజధాని మాస్కోకే పంపించ బడుతున్నాయి. శత్రు గూఢ చారులు పంపే ప్రతి సందేశం చివర కెంట్, కోరో అనే వ్యక్తుల పేర్లు ఉంటు న్నాయి. మాస్కోకు సందేశాలు పంపి స్తున్నది వీరిద్దరే. అయితే ఈ ఇద్దరి పేర్లు సాంకేతిక భాషల్లో తెలియచేయకపోవడం వల్ల ఇవి వారి అసలు పేర్లు కావని సులభంగానే తెలుస్తోంది.

ఆకాశంలో రేడియో తరంగాలపై తేలి యాడే రెండు నకిలీ పేర్ల ఆధారంతో ఎక్కడో రహస్య స్థావరంలో కూర్చుని సందేశాల్ని పంపుతున్న ఆ ఇద్దరు రష్యా గూఢచారులను పట్టుకోవటం సాధ్యమా?



హిట్లర్ ప్రముఖ సహచరులైన హిమ్లర్, గోబెల్స్ మొదలగు మంత్రులు, రేడియో సాంకేతిక విశేషజ్ఞులు, సైన్యాధికారులు, ఉన్నతాధికారులు అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు. నాజీ గూఢచారి విభాగం కెంట్, కోరోలను ఎలాగైనాసరే బంధించాలని తీర్మానించారు.

1941 నవంబర్ 12 కోరో ఒక సందేశాన్ని ప్రసారం చేస్తుండగా, బెర్లిన్ లోని రహస్య రేడియో కేంద్రం యంత్రాలు అకస్మాత్తుగా ఆగిపోయాయి. నాజీ రేడియో కేంద్రం ఆపరేటర్లంతా స్తబ్ధులయ్యారు. యంత్రాలన్నీ సరిగ్గానే ఉన్నాయి. అంటే కోరో కావాలనే సందే శాన్ని మధ్యలో ఆపుచేశాడన్నమాట. నాజీ గూఢచారులు పోస్ట్‌మెన్లుగా, ఎలక్ట్రీషి యన్లుగా మారు వేషాలు వేసుకొని అనుమానమున్న ప్రతి ఇంటినీ పరీ క్షించారు.

అసలు సంగతేమిటంటే నాజీ గూఢ చారులు విద్యుత్తు కేబిల్‌ను మరమ్మత్తు చేసే నెపంతో ఒక పాడుపడిన భవనంలో

గొయ్యితీసి కోరో సందేశాల్ని వినే వ్యూహం పన్నారు. అందులో ఒక యంత్రాన్ని సరిచేసి తమ సహచరునికి ఈ సందర్భంగా హెచ్చరిక చేశారు. కాక తాళీయంగా అతడి మాటలు కోరో చెవుల్లో పడ్డాయి. అంతే! టక్కున సందేశాన్ని ప్రసారం చేయడం ఆపుచేశాడు.

జర్మనీ రాజధాని బెర్లిన్‌లో కుకోఫ్ అనే రచయిత, సినీ నిర్మాత ఉండేవాడు. అతడు నాజీ భక్తుడు. అతడు నిర్మించిన ఒక చిత్రానికి హిట్లర్ ప్రచారమంత్రి గోబెల్స్ బహుమతి కూడా లభించింది. కుకోఫ్ భార్య అర్థశాస్త్రంలో ప్రొఫెసర్. గోబెల్స్ కార్యాలయంలో అనువాదకు రాలు.

డిసెంబర్ 20 రాత్రి. బ్రస్సెల్స్ లోని ఒక రెండంతస్తుల భవనంలో కెంట్ ట్రాన్స్ మీటర్ చురుగ్గా పనిచేస్తోంది. ఒక స్త్రీ రేడియో దగ్గర కూర్చుంది. ఇద్దరు వ్యక్తులు సాంకేతిక భాషలో వచ్చే సందేశాల్ని నోట్ చేస్తున్నారు. అదే క్షణంలో నాజీ గూఢచారుల దళం ఆ భవనంపై అకస్మాత్తుగా దాడిచేసింది. భవనంలోని లెఫ్టినెంట్ మాకారోవ్, దానిలోవ్‌లు తమ తుపాకుల్ని సరిచేసు కోకముందే నాజీ తుపాకి గుండ్లకు కింద పడి పోయారు. రేడియో ముందు కూర్చున్న మహిళ రహస్య ఫైలును కుంపట్లోకి విసిరేసింది. ఆ రహస్య ఫైలు అగ్నికి ఆహుతి కాకముందే నాజీలు సురక్షితంగా చేజిక్కించు కున్నారు.

మాకారోవ్, దానిలోవ్‌లు మరణించ లేదు. వారిద్దరిని ఘోరంగా హింసించి చాలా రహస్యాల్ని చెప్పించారు.

బ్రస్సెల్స్ ట్రాన్స్‌మీటర్ కేంద్రంలో లభించిన రహస్య ఫైళ్ళలోని సాంకేతిక భాషను కనుగొనే బాధ్యత హైల్‌మన్ అదే అధికారికి అప్పగించాడు.

లెఫ్టినెంట్ హేరో, హైల్‌మన్‌లు మంచి మిత్రులు కూడా! హైల్‌మన్ తరుచుగా ప్రతి సాయంత్రం హేరో ఇంట్లోనే కాలక్షేపం చేసేవాడు. కొన్ని రోజుల్లోనే హైల్‌మన్ హేరో ఇంట్లో సమావేశ మయ్యే వ్యక్తులు నాజీ జర్మనీకి వ్యతిరేకంగా కుట్రలు జరుపుతున్నారని నాజీ గూఢచారులు ఒక డచ్ ట్రాన్స్ మీటర్ కేంద్రాన్ని కనుగొన్నారని, అంతేకాకుండా కుకోఫ్ దంపతులు తమ ఇంట్లోనే ట్రాన్స్ మీటర్‌తో సందేశాలు ప్రసారం చేస్తుండగా పట్టుకొన్నారని హైల్‌మన్‌కు తెలిసింది. ఈ దంపతుల్ని నరకయాతనలు పెట్టి ఎంతోమంది గూఢచారుల పేర్లను కక్కించారు.

హైల్‌మన్ స్తబ్ధుడయ్యాడు. ఈ రహస్యాలు వెల్లడి కావటంతో తన మిత్రుడు లెఫ్టినెంట్ హేరోకు ఉరిశిక్ష తప్పదని తెలుసుకొని బాధపడ్డాడు. మిత్రుడుగా అతణ్ణి రక్షించటం తన బాధ్యత అను కున్నాడు. వెంటనే ఈ విషయాన్ని తెలియచేయటానికి హేరోకు ఫోన్‌చేశాడు. దురదృష్టవశాత్తూ హేరో ఇంట్లో లేడు. హైల్‌మన్ తన సెక్రటరీకి హేరోకుఫోన్ చేసి రాగానే తనను కలుసుకొమ్మనమని చెప్పమని బయటకి వెళ్లాడు.

31ఆగష్టు 1942న నాజీ గూఢచారులు కోరో ఇంటిపై దాడి చేశారు. ఒక సంవత్సరం దాకా నాజీ గూఢచారుల్ని మూర్ఖుల్ని చేసిన కోరో ఉర్ఫ్ హేరో కాకతాళీయంగా పట్టుబడ్డాడు.

కోరోఅరెస్టుతో రష్యా గూఢచారి

సంస్థకు తీరని నష్టం వాటిల్లింది. ఆ తరువాత నవంబర్ నాటికి యూరప్ దేశాల్లోని 84 మంది రష్యా గూఢచారులు పట్టుబడ్డారు. కోరోను ఉరి తీశారు. 1943 జనవరి, ఫిబ్రవరి మాసాల్లో మరి 60 మంది గూఢచారుల్ని కాల్చేశారు.

ఇంత జరిగినా ఒకవైపు పెంట్ మాస్కోకు సందేశాల్ని అందజేస్తూనే ఉన్నాడు. నాజీ గూఢచారులు ఇక కెంట్ ను బంధించాల్సి ఉంది. వందల కొద్ది వ్యక్తుల్ని అరెస్టు చేశారు. వారిని ఘోరంగా హింసించారు. ఎన్నో డజన్ల రహస్య ట్రాన్స్మిటర్ కేంద్రాల్ని పట్టుకున్నారు.

చివరకు ఆగష్టు 1942లో నాజీ గూఢచారి సంస్థ గెస్టాపోల కెంట్ కు సంబంధించిన విశేషమైన రిపోర్టు లంభించింది. ఆ రిపోర్టు ఆధారంతోనే కెంట్ ను కూడ బంధించారు. కెంట్ ను అతి క్రూరంగా హింసించారు. అయినా నోరు మెదపలేదు. ఐదు వారాలు గడిచాయి. కెంట్ ప్రియురాలు మార్గరెట్ కూడ నాజీల్ కు చిక్కింది. మొదట ఇద్దర్నీ విడి, విడిగా ప్రశ్నించారు. అయినా ఫలితం కనిపించలేదు. పెంట్ ముందే మార్గరెట్ ను అతి ఘోరంగా హింసించగా కెంట్ మానసిక స్థైర్యాన్ని కోల్పోయాడు.

కెంట్, కోరోల బలిదానం వల్లనే రష్యా సైన్యం తూర్పు జర్మనీని ఆక్రమించగలిగిందని, ఈ ఇద్దరు గూఢచారుల సహకారం వల్లనే జర్మనీ రాజధాని బెర్లిన్‌లో ప్రవేశించగలిగారని చరిత్ర సాక్ష్యముంది.

# విదేశభక్తుడు

ఫిల్బీ బ్రిటన్‌లోని కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్నప్పుడు మార్క్సిజం పట్ల మొగ్గు చూపించాడు. 1930లో చదువు పూర్తి కాగానే ఆస్ట్రియా వెళ్ళాడు. ఆస్ట్రియాలో సోషల్ డెమోక్రటిక్ తిరుగుబాటు వైఫల్యాన్ని కళ్ళారా చూశాడు. ఈ అపజయానికి కారణం నాయకుల అసమర్థతేనని గ్రహించాడు. జర్మనీలో మితి మీరుతున్న ఫాసిజాన్ని ఎదుర్కోవాలంటే కమ్యూనిజమొక్కటే మార్గమని తలచాడు. ఆస్ట్రియా నుండి వియన్నా చేరుకున్నాడు. అక్కడ పక్కా కమ్యూనిస్టు అయిన ఒక అమ్మాయితో మనసు కలిపాడు. ఆ తరువాత ఆ అమ్మాయిని వివాహం చేసుకున్నాడు.



రష్యా కోసం ఏదైనా చేయాలని నిశ్చయించుకున్నాడు. రష్యా నాయకులు మొదట ఫిల్బీకి వియన్నా నుండి హంగరీకి సూచనలు పంపే బాధ్యత అప్పగించారు. ఫిల్బీ దగ్గర బ్రిటన్ పాస్‌పోర్ట్ ఉండటంవల్ల ఈ కార్యాన్ని సులభంగానే

సాధించగలిగాడు. ఆ తరువాత లండన్ వచ్చేసరికి సమర్థుడైన రష్యా గూఢచారిగా రాటు తేలాడు. లండన్‌లో పత్రికా రంగాన్ని అడ్డు పెట్టుకొని తన కార్యక్రమాల్ని చురుకుగా కొనసాగించసాగాడు.

1936లో స్పెయిన్‌లో అంతర్యుద్ధం చెలరేగింది. ఫిల్బీ తన తండ్రి పలుకుబడితో లండన్ నుండి వెలువడే ఓ పత్రికా ప్రతినిధిగా మేడ్రిడ్ చేరుకున్నాడు. అక్కడ నియంత ఫ్రాంకోను సమర్థిస్తూ చక్కని వ్యాసాన్ని రాశాడు. ఆ దెబ్బతో ఫిల్బీ ఫ్రాంకోకి విశ్వాసపాత్రుడయ్యాడు. దాంతో యుద్ధ సంబంధమైన వార్తల్ని సేకరించి రష్యాకు పంపటం అతనికి చాలా తేలికైంది.

రెండవ ప్రపంచ యుద్ధం రాజుకోగానే ఫిల్బీ బ్రిటిష్ గూఢచారి విభాగంలో చేరాడు. స్పెయిన్ ద్వారా హిట్లర్ వ్యూహాల్ని గమనించడం ఫిల్బీకే సాధ్యమని బ్రిటిష్ గూఢచారి విభాగం తలచింది. ఈ కారణం వల్లనే గూఢచారి విభాగం కేంబ్రిడ్జిలోని అతని మార్క్సిజం జీవితాన్ని అంతగా పట్టించుకోలేదు. అతణ్ణి గూఢచారి విభాగంలోని ప్రధానశాఖ అయిన యం.16లో నియమించారు.

ఈ శాఖలో పని చేసే గూఢచారుల కర్తవ్యం శత్రుదేశాలకు తమ వివరాలు ఎంతవరకు తెలుసో గమనించటమే! ఈ శాఖలో పని చేసే ప్రతి గూఢచారికి తమ దేశపు ప్రతి చిన్న రహస్యం కూడ తెలిసి ఉండేది. 1944 లో బ్రిటిష్ గూఢచారి విభాగం రష్యాను లక్ష్యంగా పెట్టుకొని ఒక కొత్త శాఖ ప్రారంభించింది. రొట్టెవిరిగి నేతిలో పడ్డట్లు ఫిల్బీని ఈ శాఖకు అధిపతిగా నియమించారు. దాంతో బ్రిటిష్ గూఢచారి విభాగపు ప్రతి సమాచారం రష్యాకు చేరసాగాయి. ఇంత జరిగినా, ఒక్కసారి కూడా బ్రిటిష్ గూఢచారులకు ఫిల్బీపై అనుమానం రాలేదు. ఫిల్బీ ఎప్పటికప్పుడు రష్యా గతి విధుల్ని గమనించడంలో ఏ మాత్రం వెనుకాడలేదు. తాను రష్యా గూర్చి బ్రిటన్‌కు ఏం తెలియ చేస్తున్నాడో మొదటే రష్యాకు నివేదించేవాడు. అయితే ఫిల్బీ బ్రిటన్‌కు చెప్పే రహస్యాలు అతి సామాన్యమైనవి మాత్రమే. రష్యాకు మాత్రం యుద్ధానికి సంబంధించిన అతి కీలకమైన వార్తల్ని చేరవేసేవాడు.

1947లో ఫిల్బీని టర్కీ స్టేషన్ కమాండర్‌గా నియమించారు. అప్పుడు టర్కీని కలిపే విమానాశ్రయాలు, సరుకుల సరఫరా డిపోలు మొదలైన వివరాల్ని రష్యాకు పంపించాడు. ఆ తరువాత 1949లో బ్రిటిష్ గూఢచారి విభాగంలోనిశాఖకు అధికారిగా నియమించి అమెరికా పంపించారు. సి.ఐ.ఏ.,ఎఫ్.బి.ఐ. లాంటి అమెరికా గూఢచారి సంస్థలతో బ్రిటన్ గూఢచారి విభాగం స్నేహ సంబంధాల్ని సుస్థిరంగా ఉంచటమే ఫిల్బీ చేసే పని. ఈ విధంగా ఫిల్బీ బ్రిటన్‌తో పాటు అమెరికా రహస్యాల్ని కూడ రష్యాకు పంపించటానికి అవకాశం లభించింది.

ఫిల్బీ గూఢచారిగా మొదటి అపజయాన్ని వాషింగ్టన్‌లోఎదుర్కొన్నాడు. ఫిల్బీ విద్యార్థి జీవితంలో సహచరులైన ఇద్దరు మిత్రులకు ఇదే కార్యాన్ని అప్ప

గించారు. అమెరికా గూఢచారులకు వీరిపై అనుమానం కలిగింది. అందువల్ల వారిద్దరు రష్యా పారిపోవలసివచ్చింది. దాంతో ఫిల్బీపై కూడ అమెరికా గూఢచారులకు అనుమానం కలిగింది. తత్ఫలితంగా బ్రిటిష్ గూఢచారి విభాగం ఫిల్బీకి లండన్‌కు పిలిచింది. లండన్‌లో ఫిల్బీకి వ్యతిరేకంగా ఒక రహస్య విచారణ సంఘం ఏర్పరచింది. విచారణలో తగిన సాక్ష్యాధారాలు లేకపోవటంవల్ల, ఉన్నతాధికారులు సన్నిహిత మిత్రులవడంవల్ల ఫిల్బీ రహస్య జీవితం బయటికి రాలేదు. ఉద్యోగం మాత్రం ఊడింది.

1951 నుండి 1955 వరకు ఫిల్బీ ఉద్యోగం లేక అనేక బాధలు పడ్డాడు. అప్పుల పాలయ్యాడు. అదే సమయంలో ఒక రాజకీయ నాయకుడు ఫిల్బీని రష్యా ఏజంటుగా ఆరోపించాడు. ఈ సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వం ఫిల్బీని సమర్థించడం తప్ప మరో మార్గం లేకపోయింది. ఎందుకంటే అంతకుముందే రహస్య విచారణ సంఘం నిర్దోషిగా తీర్పు ఇచ్చింది. ప్రభుత్వం ఫిల్బీ నిర్దోషి అని ప్రకటించింది. ఆ తరువాత ఫిల్బీ విదేశ విభాగ సహకారంతో మరో పత్రికా ప్రతినిధిగా బీరూట్ వెళ్ళాడు. అసలు సంగతేమిటంటే ఫిల్బీని రష్యా గూఢచారి ఋజువులతో సహా బంధించడంకోసమే బీరూట్‌కు పంపటం జరిగింది. ఫిల్బీ తక్కువతిన్న వాడేం కాదు. బీరూట్‌లో తన పాత పరిచితుడైన స్టేషన్ కమాండర్‌తో స్నేహం చేశాడు. అలా తిరిగి వీలున్నంత వరకు రష్యాకు వార్తల్ని చేరవేయసాగాడు. బీరూట్‌లోనే ఒక అమెరికా మహిళను మూడో వివాహం చేసుకున్నాడు. ఈ మధ్యకాలంలో తిరిగి



పశ్చిమ దేశాల విశ్వాసం సంపాదించుకోగలిగాడు.

కాని ఫిల్బీ చాకచక్యం వృధాఅయింది. 1961లో రష్యా గూఢచారి విభాగంలోని ఒక ప్రముఖ గూఢచారి పారిపోయి పశ్చిమానికొచ్చాడు. ఫిల్బీ రహస్యం పటాపంచలై, అతడు రష్యా గూఢచారి అని తెలిసిపోయింది. అంతే! 1963 జనవరి 23న బీరూట్ నుండి రహస్యంగా మాస్కో చేరుకున్నాడు. మాస్కోలో అతనికి ఘన స్వాగతం లభించింది. 1967లో సోవియట్ విప్లవపు 50వ వార్షికోత్సవం సందర్భంగా ఫిల్బీ సోషలిజం కోసం పాటుపడిన వ్యక్తిగా అభివర్ణించబడ్డాడు. అప్పుడు గాని పశ్చిమ దేశాలకు ఫిల్బీ అసలు రూపం తెలియలేదు. ఒక్క బ్రిటన్‌తోనేకాక పశ్చిమ దేశాలలోని దాదాపు అన్ని గూఢచారి సంస్థలతోనూ ఫిల్బీకి సంబంధాలుండేవి. దీని బట్టి ఫిల్బీ రష్యాకెంత కావలసినవాడో ఊహించవచ్చు. *

# హనీమూన్

కొత్తగా పెళ్ళయిన సుబ్బారావు, సుజాతలు జాలీగా హనీమూన్‌కి వెళ్ళామని నిర్ణయించుకున్నారు. హనీమూన్‌కి ఎక్కడికి వెళ్ళాలనేది పెద్ద సమస్యగా తయారయింది. ఏ ఊటీనో, కాశ్మీరో వెళ్ళగల తాహతు లేదు. కనీసం శ్రీశైలమో, సింహాచలమో వెళ్ళదమన్నా మాటలా ? బోలెడంత ఖర్చవుతుంది. అసలే పెళ్ళికి చేసిన అప్పులతో పీకల వరకు మునిగి పోయారు. ఆపత్సమయంలో నవ వధువు సుజాతకి బ్రహ్మాండమయిన అయిడియా తట్టింది. "ఈ ఊళ్ళోనే ఏదైనా హోటల్లో ఓ వారం రోజులు గడుపుదామండీ! పెద్దగా డబ్బు ఖర్చుండదు. మీ సరదా కూడా తీరుతుంది" అని కొంటెగా చెప్పింది సుజాత. ఈ అయిడియా సుబ్బారావుకి నచ్చింది. కాని ఈ ఊళ్ళోనే అయితే తెలిసిన వాళ్ళు కనపడితే పరువు పోతుందని సందేహించాడు. అయినా ఇంత పెద్ద మహానగరంలో మన సంగతి పట్టించుకునే వాడెవడని సరిపెట్టుకున్నాడు. మనసులో సుజాతని అభినందిస్తూ సూట్‌కేసు సర్దేశాడు సుబ్బారావు.

ఊరికి చివరగా ఉన్న పెద్ద హోటల్లో బస చేశారు సుబ్బారావు, సుజాత. రూంబోయ్‌ని పిలిచి సుబ్బారావు వాడి చేతిలో పది రూపాయల నోటు పెట్టి "చూడు బాబూ మేం కొత్తగా పెళ్ళయిన వాళ్ళం. ఈ సంగతి ఎవరికీ తెలియనివ్వకేం" అని గడ్డం పట్టుకుని బతిమాలాడు. రూంబోయ్ 'సరే' అని తలూపి తుర్రుమన్నాడు.

మర్నాడు పొద్దున్నే సుజాత గది బయటికి కొచ్చేసరికి అందరూ తననే చూస్తూ ఏదో చెప్పుకుంటున్నారు. గబుక్కున గదిలో కొచ్చి "ఏమండీ బయట జనం మన గురించి విచిత్రంగా చెప్పుకుంటూ అదోలా చూస్తున్నారు. నాకు చచ్చేంత సిగ్గుగా ఉంది బాబూ" అంది సుబ్బారావుతో.

సుబ్బారావు బయటకొచ్చి, గుంపులుగా నిలబడి తమవైపే చూస్తున్న జనాన్ని చూసి సిగ్గుపడిపోయి రూంబోయ్‌ని పిలిచి కోపంతో "ఏరా! నీకు చెప్పిందేమిటి ? నువ్వు చేసిందేమిటి ?



మాకు కొత్తగా పెళ్ళయిందని వీళ్ళతో చెప్పావా?" అన్నాడు.

రూంబోయ్ నసుగుతూ "లేదండీ! మీరు చెప్పద్దన్నాక ఎందుకు చెప్తాను? పెళ్ళయిందా అని అడిగినోళ్ళందరికీ అవలేదని చెప్పాను" అనేసరికి సుబ్బారావు అవాక్కయిపోయాడు.

—రుక్మిణి

# నాణెం

జగన్నాధం సైకిల్‌ను స్టాండులో పెట్టి వాడిచ్చే టోకెన్ తీసుకుని సినిమాహాలు వైపు పోతూంటే మధ్యలో జనం మూగి వుండటంచూసి ఇంకా టైముందిగదా ఏమిటో ఆ వింత చూద్దామని బయలు దేరాడటువైపు-

జనం మధ్యలో వున్నదేమిటో జగన్నాధానికి కన్పించలేదుగాని ఒక ముసలాడు పురాతన వస్తువుల్ని అమ్ముతున్నాడని మాత్రం అర్థం చేసుకోగలిగాడు. కాసేపుండి ఆమూలకనుండి బయట



బడి సినిమా టైమవడంమూలంగా సినిమా హాలువైపు నడిచాడు.

సలక్షణంగా సినిమాచూసి, ఒకచాయి తాగి, సదరు సినిమాలోని కూనిరాగాల్ని మనసారా వల్లిస్తూ సినిమాహాలు బయట కొచ్చాడు జగన్నాధం.

తోవలో ముసలాడు పురాతన వస్తువుల్ని ఇంకా అమ్ముతూనేవున్నాడు. జనం సంపడిమాత్రం అంతగా లేదు.

మ్యూజియాల్లో భద్రపర్చాల్సిన వస్తువుల్ని చూసే భాగ్యం నడిరోడ్డుపై ఫ్రీగా లభిస్తున్న కారణంగా మళ్ళీ ముసలాడివైపెళ్ళి సదరు వస్తువుల్ని చూడసాగాడు.

ముసలాడు హుషారుగా "ఇది బుద్ధదేవుడి కపాలాస్థిక, ఇది అక్బర్ చక్రవర్తి గారి కరవాలం, శిరస్త్రాణం, ఇది ఇక్ష్వాకుల కాలంనాటి గ్లాసు" అని అరుస్తుంటే వేడివేడి మిరపకాయ బజ్జీల్లా అమ్ముడౌతున్నాయ్ పాతకాలంనాటి వస్తువులు.

తనివితీరా వాటినన్నిటినీ చూసి ఇంటికెళ్దామని సైకిల్ స్టాండ్ వైపు వెళుతూ టోకెన్ కోసం జేబులో చేయి పెట్టుకుంటే లేదు. అంతా వెతికాడు ఎక్కడా జారవిడిచినట్టుగాలేదు. రోడ్డంతా వెదుకుతూ పాతవస్తువులమ్మేవాడి దగ్గరకుపోయి అక్కడా వెదికాడు లాభంలేదు.

ముసలాడి అమ్మకాలు బాగా సాగుతున్నాయ్ ... ఒకటి తర్వాత వొకటి చెబుతూ అమ్ముతున్నాడు. జగన్నాధం కంగారెక్కువైంది.

ఇంతలో ముసలాడు ఒక నాణెం లాంటిది తీసి "ఇది ఇబ్రహింలోడీ కాలంనాటి కంచు నాణెం, అప్పట్లో దీని చలామణి ఆఫ్గనిస్తాన్ నుంచి సిలోన్ వరకూ వుండేది...దీన్ని కేవలం ఐదు రూపాయలకే అమ్ముతా'' నంటున్నాడు.

జగన్నాధం కళ్లు మెరిసాయి. కంగారు తగ్గింది. ఒక రూపాయి కాగితం ముసలాడికిచ్చి బతిమాలి. ఇబ్రహిం లోడీ కాలంనాటి కంచు నాణాన్ని తీసుకుని సైకిల్‌స్టాండు వైపు పరుగెత్తాడు హుషారుగా.

—శ్రీధర్

# వీలునామా

మూర్ డ్రోజులయింది మందహాసరావు పోయి. ఆరోజు సాయంత్రం మంద హాసరావు దగ్గరి మిత్రుడయిన లాయరు గారు బంధువులందర్నీ సమావేశపరిచి, ఆ విషయం చెప్పారు - 'మందహాసరావు చనిపోయేందుకు మూణ్నెల్ల వ్యవధి వుండ నగా ఓవిల్లు రాసి తన దగ్గర వుంచేడ'ని. ఆ మాట వినగానే బంధువులు ఆశ్చర్య పోయారు.




"ఏ వుందని విల్లు రాశాడు? ఓ ఆస్తా, ఓ ఇల్లా ?" అంటూ విస్తుపోయారు. ఆ మాట చెప్పాక లాయరుగారు మరో బాంబు పేల్చారు- ఆ విల్లులో అన్నీ మనవల, ముని మనవల పేర్లే తప్ప కొడుకుల, కూతుళ్ళ పేర్లు లేవని.

బొత్తిగా కొడుకులకేం రాయకపోవట మేమిటి ?" అని మరింతగా నోరు తెరి చారు అంతా !

ఆ వీలు నామా తెరిచారు లాయరు గారు.

హైదరాబాద్ జిల్లా, హైదరాబాద్ నగర కాపురస్తుడయిన మధ్య తరగతి మందహాసరావు అను నేను పూర్తి జ్ఞాన ముతో ఈ విల్లు రాస్తున్నాను. నాకున్న ఆస్తులు నిజానికి చెప్పుకోదగ్గవీ, పంచుకో వలసినవీ కావు. కానీ, నా దగ్గరున్న కొన్ని రసీదులు మాత్రం అవశ్యం పంచవలసి నవి గనుకనే ఈ విల్లు రాయడమయినది. రసీదులు ఇందులో జతపర్చాను.

నా పేర హైదరాబాద్ బుల్‌బుల్ పేట గాస్ కంపెనీలో 1976 జూన్ 16వ తేదీన రిజిష్టరయిన గాస్ స్టవ్ (రిజిస్ట్రేషన్ నం. 123456 స్టవ్) నా పెద్ద కుమారుడి పెద్ద మనుమడికి (ఈ స్టవ్ 2012లో రావచ్చును) డెలివరీ తీసు కొనుటకున్నూ, నా పేర స్కూటర్ కంపెనీలో 88345 నంబర్‌న రిజిష్ట రయిన స్కూటర్ (డెలివరీ తేదీ 2057వ సం॥ జూలై) నా రెండవ కుమారుని పెద్ద ముని మనుమడు తీసుకొనుటకున్నూ, హైదరాబాద్ పంచవటి పుర కాలనీలో ఏడవనంబర్ ప్లాటులో సదరు ప్లాటు యజ మాని కట్టుకున్న ఇంటిలో ఎడమ వైపు రెండు గదుల పోర్షన్‌కు అద్దె నిమిత్తము రెండువేలు అడ్వాన్స్ ఇచ్చి వున్నాను - ఆ ఇంటిలో నా మూడవ కుమారుని పెద్ద మనుమడు అద్దెకు నివసించుటకున్నూ, ఇటీవలే ప్రారంభమయిన ఓ ఔత్సాహిక మాస పత్రికలో ప్రచురితమయిన నా నవల తాలూకు పారితోషికం మొత్తం (1985లో రావచ్చును) నా ఏకైక కుమార్తె నవలారాణి తీసుకొనుటకున్నూ నా పూర్తి ఇష్టముతో అధికారములు ఇచ్చుచున్నాను.

—పి.వి.ఆర్. శివకుమార్

# ప్రిస్టేజీ

సన్నగా జువ్వలా వుండే సుందర్రావొక సారి తానుకొత్తగా కొన్న పాత సైకిల్ మీద, ఒక ముఖ్యమైన పనిమీద బయల్దేరాడు. ఆదిలోనే ఆటంకం - సైకిల్ రెండు చక్రాల్లోనూ కుర్ర వెధవలెవరో గాలి తీసేశారు. ఆ గాలి కొట్టేవాడు ఫర్లాంగు దూరంలో ఏడిశాడు. ముందు కడుపుని శాంతపరచాలంటే కాఫీ కొట్టాలి అనుకొని, జేబులో వున్న రూపాయినోటుని ఒకసారి తడిమి చూసుకుని, నలభై పైసల కాఫీ, పదిపైసల సైకిల్‌గాలి పోతే యింక అర్థ రూపాయుంటుందిలే అనుకుని హోటల్లోకి నడిచాడు.

ఎదురుగా కూర్చుని సాంబారు జుర్రుతోన్న ఆసామిని చూసేసరికి, నోరూరింది. 'ఏభై పైసలు పెట్టి ఇడ్లీతినేసి, కాఫీ మానేసేసరి' అనుకుని, "ఇడ్లీ" అన్నాడు.

ఇడ్లీ వచ్చింది. తింటున్నాడు. నెమ్మదిగా తల తిప్పేసరికి ప్రక్కలైన్లో కూర్చున్న ఎదురింటి బ్రహ్మచారుల మీద పడింది అతని దృష్టి. వాళ్ళు ముగ్గురు తనకి విష్ చేశారు. తనూ చేశాడు గాని, 'చచ్చాంరా' అనుకున్నాడు. వాళ్ళు ముగ్గురూ షోకిల్లా రాయుళ్ళు. తన సైకిల్‌నిచూసే నవ్వారు. ఇప్పుడు తను ఇడ్లీ ఒక్కటే తిని లేచిపోతే..? తనలోని ప్రిస్టేజీ కాలరెత్తుకు నిలబడేసరికి "కాఫీ" అన్నాడు సర్వర్‌తో. కాఫీ అయింది. బిల్లు తొంభై పైసలు. గాలి కొట్టిస్తే యిక పైసా మిగల్దు.

సర్వర్ బిల్లుని పళ్ళెంలో పెట్టి తెచ్చి, తనముందు అతిమర్యాదగా వంగి పెట్టడం చూసి ఒళ్లు మండిపోయింది సుందర్రావుకి. 'వెధవ - చేతికి యివ్వకూడదూ' అని లోలోనే తిట్టుకున్నాడు. ఆ బ్రహ్మచారి వెధవలు ముగ్గురూ మరో పనిలేనట్లు తనవేపే చూస్తున్నారు.

'ఇప్పుడేం దారి ? బిల్లు పళ్ళెంలోంచి తీసుకుని వెళ్ళి కౌంటర్ దగ్గర 'పే'చేస్తే, ఈ వెధవలు వెటకారంగా నవ్వుతారేమో?'

ఏడుస్తూ రూపాయినోటుని పళ్ళెంలో వుంచాడు సుందర్రావు నిర్లక్ష్యంచేస్తున్నట్లు నటిస్తూ. పదిపైసల కాసుని పళ్ళెంలో గలగల లాడించుకుంటూ వచ్చి, కొద్దిగా వంగి తనముందు వుంచాడు సర్వర్.



'ఓరి వెధవా ! రెండు అయిదుపైసలయినా తెచ్చావుకాదు - కనీసం ఒక చక్రంలోనైనా గాలికొట్టించి, నా తంటాలేవో నేను పడును' అని తిట్టుకుని, పళ్ళాన్ని సర్వర్ వైపు జరిపాడు. సర్వర్ కళ్ళు మెరిశాయి.

'కింకర్తవ్యం' అనుకుంటూ బ్రహ్మచారి గాళ్ళవైపు చూస్తూ కూర్చున్నాడు సుందర్.

తమముందు సర్వర్ పెట్టిన 'ప్లేటు' లోంచి ముగ్గురూ మూడు మిరపకాయ బజ్జీలనూ తీసుకుని, "బిల్" అన్నారు ముగ్గురూ కోరస్‌గా. ఆశ్చర్యపోయాడు సర్వర్. కొయ్యబారిపోయాడు సుందర్.

—తులసి బాలకృష్ణ

# కుంభకర్ణుడు

ముకుందం మంచి వాడే! తెలివిగల వాడే! ఆఫీస్ పని బాగానే చేస్తాడు. కాని ఒకటే దుర్గుణం! ఆఫీసుకి లేటుగా వస్తాడు. ఆఫీసర్ చేత చివాట్లు కూడా తింటుంటాడు.

ఉండలేక ఒక రోజున అడిగేశాడు ఆఫీసర్ "ఏమయ్యా ముకుందం! ఒక్క రోజైనా టైముకి రావేమయ్యా?" అని.

ముకుందం విచారంగా ముఖం పెట్టాడు.

"ఏం చెయ్యను సార్! బ్రహ్మచారి గాణ్ణి! రాత్రిపూట నిద్ర పట్టదు. ఏ తెల్లవారు ఝామునో పడుతుంది నిద్ర. లేచే సరికి తొమ్మిదైపోతుంది" చెప్పాడు.

"అలాగా పాపం! ఇదిగో ఈ నిద్ర మాత్రలు తీసుకెళ్ళి రోజుకొకటి వేసుకో రాత్రిపూట. ఇకనుంచి రోజూ టైముకి రావాలి సుమా" అంటూ ఓ అర డజను నిద్ర మాత్రలు పొట్లం కట్టి యిచ్చాడు ఆఫీసర్ ముకుందానికి.

ముకుందం భక్తిగా తీసుకున్నాడు వాటిని.

ఆ రాత్రి ఓ మాత్ర వేసుకున్నాడు. ఎందుకైనా మంచిదని మరో మూడు మాత్రలు కూడా వేసుకున్నాడు ముందు జాగ్రత్త కోసం.

అయిదు నిమిషాల్లో గాఢ నిద్రలోకి జారిపోయాడు ముకుందం.

మళ్ళీ లేచేసరికి ఉదయం ఆరుగంటలు చూపిస్తోంది గడియారం.





ఉత్సాహంతో తొమ్మిది గంటలకల్లా ఆఫీస్ చేరుకున్నాడు.

"చాలా థాంక్స్ సార్! మీరిచ్చిన మాత్రలు చాలా బాగా పనిచేశాయి. చూశారా! ఈ రోజు టైముకి వచ్చేశాను" అన్నాడు ఆనందంగా ఆఫీసర్‌తో.

"సరేనయ్యా! ఈ రోజు తొందరగానే వచ్చావు. బాగానే ఉంది. మరి నిన్న రాలేదేమిటి ఆఫీస్‌కి?"

—కోనేనాగ వెంకట ఆంజనేయులు

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd No. H/HD/402



# వృశ్చిక రాశి

(అక్టోబర్ 24 - నవంబర్ 22)

## విజేత

వృశ్చికరాశి జాతకుల ఆత్మవిశ్వాసం అనితరసాధ్యం. వారి ధీరోదాత్తత
అనన్య సామాన్యం వారికి లభ్యమయ్యే వనరులు అపారం
ఎటువంటి ప్రమాదం ఎప్పుడు వచ్చినా ధీమాగా ఎదుర్కొంటారు. ఆర్థిక ఇబ్బందుల
సంగతి సరేసరి. జాగ్రత్తగా యోచించి డబ్బు మదుపు పెడతారు
కనుక అది అవసరానికి అక్కరకు వస్తుంది.

ముందుచూపు వృశ్చికరాశి జాతకుల సొంతం. ఉన్నత ప్రమాణాలు వారి
ఆదర్శం సామర్థ్యం ఉన్నవే వారి దృష్టిలో పడతాయి...
ఉదాహరణకు మార్గదర్శి!

సాటిలేని సేవాసౌకర్యాలు .... అందుకునే చెల్లింపులు.... రకరకాల చిట్‌లు....
మార్గదర్శి ప్రత్యేకతలు.

పదకొండు శాఖలతో ఏభై వేలకు పైగా సభ్యులతో అత్యున్నతమయిన సంస్థగా
పదహారేళ్ళయి నిలదొక్కుకొని ఉండడానికి మరి అదే కారణం!




**మార్గదర్శి**
**చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**
మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

*డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత!*

Kiron-MCF